4-10-04

321 వ సంచిక

అక్టోబర్ 2004

రూ. 7/-

# చతుర



సాగర సంగీతం

ఇచ్ఛాపురపు రామచంద్రం

# చతుర ప్రపంచం

## చైనావాల్‌కు ప్రేరణ

చైనావాల్ ప్రపంచ ప్రసిద్ధి చెందింది. 2000 మైళ్ళకు పైగా చైనాలో వందల ఏళ్ళక్రితం దేశ సరిహద్దు పొడవునా కట్టిన ఈ గోడ అంతరిక్ష ఫొటోగ్రాఫుల్లో కూడా కనిపిస్తుంది.

అయితే 2000 ఏళ్ళక్రితం బ్రిటన్‌లో కట్టిన ఇలాంటి గోడ గురించి తక్కువమందికి తెలుసు. నేలమీద, పర్వతాలమీద కట్టిన ఈ గోడ పొడవు 73 మైళ్ళు. హేడ్రియన్స్ వాల్ దీనిపేరు క్రీ.శ. 122లో ఇంగ్లండ్‌ని రోమన్ చక్రవర్తులు ఆక్రమించుకుని కొంతకాలం పాలించారు. ఆనాటి రోమన్ చక్రవర్తి హేడ్‌రియన్ దీన్ని బ్రిటన్‌కి ఉత్తర దిక్కున నిర్మింపచేశాడు. ఆ రోజుల్లో పిక్ట్స్ అనే బందిపోటు దొంగలు అటువైపునుంచి ప్రజలను దోచుకునేవారు. వారిని నిరోధించడానికి ఈ గోడని నిర్మించారు. ఎనిమిది అడుగుల ఎత్తుండే ఈ గోడ వెనక ఓ కోటని కూడా నిర్మించి అందులో సైనికులను కాపలా ఉంచాడు హేడ్‌రియన్. ఈ కోట పేరు హౌస్‌స్టెడ్. గోడ చెక్కుచెదరకుండా ఉందిగానీ కోట శిథిలమైంది. మరో రెండు కోటలను నిర్మించారుగానీ అవి కూడా నామరూపాలు లేకుండా పోయాయి.

ఈ గోడమీద గుర్రం ఎక్కి సైనికులు పహరా కాసేవారు. ఈ గోడని ఎలా కట్టా




కవర్ ఫొటోగ్రాఫర్: మధు ★ మోడల్: కీర్తన

రన్నది నేటికీ రహస్యంగానే వుంది. సున్నంతో కట్టారని మాత్రమే పరిశోధకులు గ్రహించారు. కానీ అది తప్పని 2000 ఏళ్ళ దాని జీవితకాలమే చెప్తోంది. సున్నంతోపాటు ఇంకా ఏం కలిపారన్నది మిస్టరీగానే వుంది.

500 ఏళ్ళపాటు బ్రిటన్‌ని పాలించాక రోమన్లు తరిమివేయబడ్డారు. ఆ గోడే చైనావాల్‌కి ప్రేరణ అయి వుండవచ్చని కూడా కొందరి అభిప్రాయం. అంటే అప్పట్లో చైనాకి, రోమ్‌కి లేదా బ్రిటన్‌కి రాకపోకలుండేవని ఊహించబడుతోంది.

హేడ్‌రియన్స్ వాల్‌ని దర్శించడానికి ప్రపంచం నలుమూలలనుంచీ ఏటా మూడు లక్షలమంది సందర్శకులు వస్తుంటారు. బ్రిటన్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎన్విరాన్‌మెంట్ 25మంది కూలీలచేత ఈ గోడలో పగుళ్ళు వచ్చినచోటల్లా రిపేరు చేయిస్తోంది. ఇందుకు సిమెంట్ వాడుతున్నారు. ఈ గోడ మరో 2000 ఏళ్ళు చెక్కుచెదరదని అంచనా వేస్తున్నారు.

---

## మృతులతో ముడిపడిన వృత్తి

అమెరికాలో హత్యలకు చెందిన నేరస్థులను పట్టుకోడానికి నేడు పోలీసు డిటెక్టివ్‌లకన్నా ఫోరెన్సిక్ సైన్స్ ఎక్కువ ఉపయోగిస్తోంది. ఎక్కువ భాగం హత్యానేరాలు ఫోరెన్సిక్ సైన్స్ పరికరాల ద్వారానే పరిష్కరింపబడి, హంతకులకి శిక్షపడేలా చేస్తున్నాయి.

ఈ ఫోరెన్సిక్ సైన్స్ కొరోనర్స్‌కి అందుబాటులో వుంటుంది. అమెరికా అంతటికీ అతిపెద్ద ఫోరెన్సిక్ సైన్స్ సెంటర్ లాస్ ఏంజెలెస్‌లో వుంది. ఇందులో 50 మంది కొరోనర్స్ (పోస్ట్ మార్టమ్ డాక్టర్లు) పనిచేస్తున్నారు. లాస్ ఏంజెలెస్ నగరంలో నిత్యం సగటున 15నుంచి 20 వరకూ అసహజ మరణాలు సంభవిస్తూ వుంటాయి. అందులో హత్యలు, ఆత్మహత్యలు, ప్రమాదవశాత్తు సంభవించిన మృత్యువులూ వుంటాయి. లాస్ ఏంజెలెస్‌లో కొరోనరీ సెంటర్‌లో సగటున 300 మృతదేహాలు వారి బంధుమిత్రులకి అప్పగించడానికి సిద్ధంగానో లేదా మృతదేహం ఎవరిదో ఇంకా గుర్తించని స్థితిలో నిత్యం వుంటాయి.

అనుమానాస్పద మరణ సమాచారం అందగానే ఆ విషయం పోలీసులతోపాటు కొరోనర్లకి కూడా అందజేయబడుతుంది. ఫొటోగ్రాఫర్‌తో కొరోనర్ వెంటనే ఆ స్థలానికి చేరుకుంటాడు. కొరోనర్ వచ్చేదాకా మృతదేహాన్ని కదపరు. ఆ ప్రదేశాన్ని అన్ని కోణాలనుంచీ క్షుణ్ణంగా ఫొటోలు తీస్తారు. ఈ విభాగంలో పనిచేసే ఫొటోగ్రాఫర్లలో ఒకరు గత 30 ఏళ్లుగా ఆ ఉద్యోగంలో వుంటూ ఇప్పటికి వేలాది మృతదేహాల్ని ఫొటో తీశాడు. ప్రతీ కొరోనర్ ఓ ఏడాదిలో చూసినన్ని మృతదేహాలు బహుశా ఏ పోలీసు అధికారీ తన పదవీకాలంలో చూడకపోవచ్చు. ఎందుకంటే కొరోనరీ వృత్తి మృతులతో ముడిపడి వుండడమే.

శవాన్ని ముందు ప్లాస్టిక్ పేపర్లో చుట్టి తర్వాత తెల్లటి జిప్‌బాగ్‌లో వుంచి ఫోరెన్సిక్ సెంటర్‌కి తెస్తారు. దాని బరువుని తూచి ఫొటో తీశాక వెంట్రుకలు, రక్తం, గోళ్ళ నమూనాలని సేకరిస్తారు. తర్వాత శవపరీక్ష చేసి మరణ కారణాన్ని నిర్ధయిస్తారు. పోస్ట్‌మార్టం మొత్తం వీడియో తీస్తారు. పోస్ట్‌మార్టం చేస్తూ కొరోనర్




దాని ఫలితాల్ని బయటకు చెప్పడంతో ఆ మాటలు తర్వాత కోర్టులో సాక్ష్యంగా పని కొస్తాయి. మరణించిన వారెవరో తెలుసుకున్నాక వారిదగ్గర బంధువులకి లేదా మిత్రులకి ఆ విషయం తెలియచేసే బాధ్యత కూడా కొరోనర్‌దే. శవం చర్మం మీద గల తడి లేదా పొడి ద్రవాలను సేకరిస్తారు. వీర్యం, రక్తంలాంటి పదార్థాల సమాచారం నేర పరిశోధనలో సహకరిస్తాయి.

కంప్యూటర్‌తో పనిచేసే అధునాతన ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్‌లు, డి.ఎన్.ఎ. పరీక్షలు చేసే సామగ్రి, శవాలపై వేలిముద్రలను తీసే కంప్యూటర్ స్కానర్స్‌లాంటి ఎన్నో ఖరీదైన పరికరాలు, రసాయన పదార్థాలు ఫోరెన్సిక్ సెంటర్లో వుంటాయి. కొరోనరీగా పనిచేసే యువతి శ్రీమతి జూలీవిల్సన్ మాత్రం "ఈ ఉద్యోగంలో అన్నింటికన్నా కష్టమైన పని హంతకుడిని కనిపెట్టే ఆధారాలని సేకరించడం కాదు. మృతుడి బంధువులకి ఆ సమాచారం అందివ్వడం" అంటుంది.

★

# చతుర

321 వ సంచిక సంపుటి : 27 అక్టోబర్ 2004 సంచిక : 9


విసుగెరగని సాగర కెరటాల విరామంలేని సంగీత నేపథ్యానికి... నిశీధి తోడవుతూంటే... ఆ నీటి అంచున ఇసుకలో పాతిక్కి పైబడీ, ముప్పైకి లోబడీ వయసుగల ఓ యువకుడు... హఠాత్తుగా నీటిలోపలికి అడుగులేస్తున్నాడు. తుపానులో సముద్రంలా అతని అంతరంగం అల్లకల్లోలమవుతుంటే కృతనిశ్చయుడిలా ఆత్మహత్యకు సిద్ధమౌతున్నాడు. అంతలోనే వెనకనుంచి భుజంపై ఎవరిదో మృదువైన హస్తం. వెనక్కచూస్తే... కాషాయధోవతి, పైన లాల్చీ, మెడలో రుద్రాక్ష... ముఖంలో ఇదమిద్ధంగా చెప్పలేని ఆకర్షణశక్తి... అప్పుడా యువకుడికి ఆయన చూపిన చిత్రమైన మార్గం ఏమిటి?

ఏ సముద్రం అతని ప్రాణాలను తనలో విలీనం చేసుకోబోయిందో...
ఆ సముద్రమే అతనికి మానవ జీవనరాగాలన్నిటినీ అందించి
సమాదరించిన వైచిత్రి ఎలాంటిది?

అతడు ఆత్మహత్యకు పాల్పడిన పరిస్థితులేమిటి? చివరికి అతని
జీవితం ఏమలుపు తిరిగింది?

మనసుకు హత్తుకునే జీవనరాగాలకు అక్షరరూపం
ఇచ్ఛాపురపు రామచంద్రం రచన

# సాగర సంగీతం

ఈనెల చతుర సమగ్ర నవల.



ఆకాశం- అనంతం.

అర్ణవం- అపారం.

ఆకాశపుటౌన్నత్యం కింద ఏ మనిషయినా అల్పుడే. అంగుష్టమాత్రుడే. సింధువు ముందెంతటి మహనీయ మానవుడయినా బిందువే. అనంతమయిన ఆకాశమూ, అపారమయిన సముద్రమూ రెండిటికి రెండూ మనిషిలో ఆలోచనా స్ఫోరకాలే. ఏ మనిషయినా కొన్ని నిముషాలపాటదేపనిగా ఏకాగ్రతతో అంబరాన్నో, అనంత జలరాశినో చూస్తే వాటిలోంచి ఆద్యంతరహితమయిన కాలపు మెరుపులు మెరిసి ఆ మెరుపులలో జీవనరహస్యం ప్రస్ఫుటించి అతను వేదాంతయినా ఔతాడు. విరాగయినా ఔతాడు. మేధావులూ, భావుకులూ అయితే మరీ సులభంగా లొంగిపోతారు అనంతమయిన కాలానికి ప్రతిరూపాలుగా నిలిచే సువిశాల ఆకాశం ముందూ, సుదూర సముద్రం ముందూ.

సముద్రం సుందరమయినదే కాదు చిత్రాతిచిత్రమయినదీని అందుకు మూలకారణం దానిలోని అనంతత్వమే కావొచ్చు వెన్నెలలో వింతగా ఉండే సముద్రం చీకటిలో మరీ చిత్రంగా ఉంటుంది. ఔను దృశ్యంకంటే అదృశ్యం అతి గొప్పది. తెరచిన గుప్పెట కంటి మూసిన గుప్పెటే కుతూహలం.

ఆ సాగరతీరంలో... నీటి అంచున ఇసుకలో... పాతిక పైబడి ముప్పయికి లోపడీ వయసుగల ఓ యువకుడు. చీకటిలో ఒంటరిగా అనంతవాహిని నవలోకిస్తూ, అంతకు మించి . పనేమీలేదన్నట్లక్కడే కూర్చున్న అతనొకవిధమయిన మైకానికి లోనవుతున్నాడు. ఎదురుగా ఒక్క నిముషం విశ్రాంతీ విరామమూ ఎరుగకుండా, ఎడతెరపిలేకుండా ఎగసెగసిపడుతూ ఒడ్డువేపు విరుచుకుంటున్న కెరటాలు. చెలియలికట్టను దాటలేమని తెలిసినా వాటి నిరంతర నిర్విరామ ప్రయత్నమెందుకో! క్షణమయినా ఆగని సాగరఘోష. ఆఘోషదే భాష? అది సంగీతంలా ఉందే. ఆ సాగర సంగీతానికి స్వరాలేవి? సరిగమపదని సప్తస్వరాలకతీతంగా అనిపిస్తూందే ఆ స్వర ఘోష? నిశీధి నిశ్శబ్దాన్ని చీల్చడమే దాని ధ్యేయమా? ఎందుకూ ఆ వృథా ప్రయాస? శబ్దం కంటే నిశ్శబ్దమే శతవిధాలా గొప్పదని తెలియకనా?

విసుగెరుగని ఆ కెరటాలు...

విరామంలేని ఆ సముద్ర సంగీతం...

నేపథ్యంగా నిశీధి...

మూడూ జోడవుతూ

అతన్ని అంతర్ముఖుడిని గావిస్తున్నాయి.

అతని మెదడు ఆలోచనలని గాలిస్తోంది.

అతని మనసు అతలాకుతలమయిపోతోంది.

మెదడులో చెలరేగుతున్న భావనా వీచికలు అతన్ని నిలవనివ్వడం లేదు. నిభాయించుకోనివ్వడం లేదు. తుపానులో సముద్రంలా అతని అంతరంగం అల్లకల్లోలమైపోతోంది మెల్లమెల్లగా.

నీటిగాలతన్ని మత్తెక్కించి నీరసింపజేస్తుంటే.

ఉదధి అతన్ని కెరటాలతో ఊరిస్తుంటే.

చీకటి అతనిచుట్టూ ఆకర్షణల వలలు విసురుతుంటే.

సముద్ర సంగీత స్వరాలు సమాదరిస్తాం రారమ్మంటూ స్వాగత గీతికలాలపిస్తుంటే.

అతను...

ఇసుకలో కూర్చున్నవాడల్లా హటాత్తుగా లేచి నీటిలోకి, నీలి సముద్రంలోకి, ఉన్మత్తుడిలా అడుగులు వేయసాగాడు. చావదలుచుకున్నవాడికి సముద్రమయినా మోకాలిలోతే.

మరో అడుగు ముందుకి వేశాడో అతను చనిపోవడం ఖాయం. ఒక ఆత్మహత్య జరగడం తథ్యం. సముద్రానికి మనిషింటే మహా దయ. ఆకలని అర్థించేవారికి చేపలనందించి బువ్వపెడుతుంది.

ఐశ్వర్యం కోరుకునేవారికి రత్నాలనిస్తుంది.

మరణాన్ని వాంఛించే వారికి ఆ మనోగతమూ తీరుస్తుంది.

ఎవరినీ కాదనదది. వారు కోరుకున్నదీ తానివ్వగలిగిందీ అయితే వరం ప్రసాదించేసిందన్నమాటే. ముందు వెనుకలు చూడకుండా సముద్రం మనిషినుంచి ఏమీ స్వీకరించదు. మహా అయితే ఉత్తుత్తి దణ్ణాలు తప్ప. కాని అది మనిషికి చాలా ఇస్తుంది.

అతను మృత్యువువేపుకి చిట్టచివరి అడుగు వేసేవాడే కాని సరిగ్గా ఆ క్షణంలోనే అతని భుజంమీద... ఎవరిదో హస్తం.

కొన్ని నిముషాల పెనుగులాట.

యువకుడు తననితాను మరణంవేపుకి గింజుకుంటూనూ, వేరెవరో అతనిని వెనక్కీ జీవితంవేపూ లాగుతూనూ. విజయం అతనిదే అయింది. అపజయమూ జీవితమూ యువకుడి పాలయ్యాయి. యువకుడతని అధీనంలోకయితే ఒచ్చాడు కానీ నీటిలోంచి పూర్తిగా మాత్రం బయటకురాలేదు.

"నా పేరు సీతారాం. మీరెవరు? " అతనడిగాడు యువకుడిని. యువకుడేమీ బదులు చెప్పకుండా మౌనంగా ఉండిపోయాడు. సీతారాం మెల్లగా నవ్వాడు. "కోపమా? మీ ప్రయత్నాన్ని భంగంచేశానని? " అప్పటికీ నోరు విప్పలేదు యువకుడు.

"అయ్యో! మీరు మూగవారని గ్రహించలేక"

"నేను మూగవాడినికాను. నాకు... నేను మాటాడగలను" రోషంగా అన్నాడతను మౌనవ్రతం వొదిలినట్లు. తపోభంగమయిన మునిలా అతను కొంచెం కోపంగా చూశాడు.

"మరి యింతసేపూ మాట్లాడరేం? " అడిగాడు సీతారాం.

"ఎందుకు మాట్లాడాలి? నాకే ప్రపంచంతో మాటలు లేవు"

"అంటే- ప్రపంచం మీతో మాట్లాడనందా? "

"నేనే దానితో మాట్లాడకూడదనుకున్నాను"

"ఎందుకని? "

"నాయిష్టం" మొండిగా అన్నాడు.

"ఇష్టాయిష్టాలకయినా కారణాలుంటాయిగా? మాటలాడగలగడం అనే వరాన్ని దేముడు మనుషులకి మాత్రమే అనుగ్రహించాడు" అన్నాడు సీతారాం. అతనికి సుమారు నలభయ్యయిదేళ్లుంటాయి. స్ఫురద్రూపి. కాషాయ ధోవతి. దానిపైన లాల్చీ ధరించాడు. మెడలో రుద్రాక్షమాల వేలాడుతోంది. అతని కంఠంలో మృదుత్వమేకాక యిదమిద్ధమని నిర్ధారణగా చెప్పలేని శక్తి ఏదో ఉంది.

"వెన్నెలొస్తోంది" నవ్వుతూ సంతోషంగా చూశాడు సీతారామ్.

అప్పుడాయువకుడు అతనివేపు చూశాడు కొంత ఆసక్తిగా. అతని నుదురు మీద విభూది గీతలు.

"మీరు సన్యాసులా? "

"అది చెప్పాలంటే మీరొకటి చెప్పాలి. సన్యాసమంటే మీ దృష్టిలో ఏమిటి? "

"ఏముంది, సన్యాసమంటే ప్రపంచాన్ని త్యజించి వొంటరిగా ఉండడమూ, ఏదేముడినో ప్రార్థించుకోడమూ. నిజానికి నేనే ఎక్కువ మీ కంటె"

అతను నవ్వాడు.

"ఎందుకని? "

"మీరు ప్రపంచాన్నే త్యజించారు కానీ జీవితాన్ని మాత్రం యింకా పట్టుకుని వేలాడుతూనే ఉన్నారు వ్యామోహంతో. నేనయితే ఈ జీవితాన్నే తృణప్రాయంగా వొదిలేసేందుకు సిద్ధంగా ఉన్నాను. పానకంలో పుడకలా మీరు వొచ్చి అడ్డుపడకపోతే ఈ పాటికి హాయిగా ఈ తుచ్ఛజీవితాన్ని వొదిలిపెట్టేసి ఉండేవాడిని. ఈ పాడు మనుషులకి దూరంగా సుఖంగా"

"క్షమించండి. మీరు నిజం చెప్పడంలేదు"

"చావుని కౌగలించుకోబోయే వాడిని నేనెందుకబద్ధమాడతాను! నాకేం కర్మ? "

## స చి త్ర వి చి త్రం





# సాహస క్రీడ

అమెరికాలో చాలా సాహసక్రీడలు వ్యాపారాలుగా తయారయ్యాయి. ఇప్పుడు కొత్తగా సైకిల్ జంప్ ఒక సాహస క్రీడై కూర్చుంది. అమెరికాలో సియాటిల్‌లో ఈ క్రీడ ఆరంభమై ప్రాచుర్యం పొందుతోంది.

ఓ కొండశిఖరంమీద 100 అడుగుల దూరం నుంచీ వేగంగా సైకిలు తొక్కుతూ వచ్చి ఆ అంచుకి ఆవలనున్న పసిఫిక్ మహాసముద్రంలోకి దూకాలి. సైకిల్‌తోసహా నీళ్లలోకి వెడతారు వాళ్లు. సిద్ధంగా వున్న అండర్ గ్రౌండ్ ఈత గాళ్లు వాళ్లని తక్షణం రక్షించి నీటి ఉపరితలానికి తీసుకువచ్చి ఉక్కిరిబిక్కిరి అవుతున్న ఆ క్రీడాకారుల్ని మరపడవలోకి ఎక్కిస్తారు. ఆక్సిజన్ సిలెండర్లు తగుల్చుకుని సముద్రగర్భంలో తయారుగా గజ ఈతగాళ్లు వుండటంతో ఇంతదాకా ఎవరూ మరణించలేదు, స్పృహ కోల్పోలేదు.

"కర్మకాదు. తెలియక"

"ఏమిటి మీరనేది? "

"మీకు మనుషులంటే మమకారం, ప్రేమ"

"అసంభవం" అరిచాడతను.

"యోచించి చూస్తే సత్యమదే. మీ అంతరాత్మ అడుగు పొరలనిండా మానవత్వమే"

"ఎలా చెప్పగలరు? "

"మీ వొంటి మీదేం దుస్తులున్నాయి? "

"అండర్ వేర్. అంటే చిన్నలాగూ" సిగ్గుపడ్డాడతను.

"నేను సన్యాసినే అయినా ఆంగ్లం కూడా తెలుసులెండి. ఆc... మీరీ సముద్ర తీరాని కదొక్కటే ధరించి వొచ్చారా? "

"ఛీ! చొక్కా, ప్యాంటూ... బనీనూ... చెప్పులూ అన్నీ వేసుకునే వచ్చాను"

"మరేవీ అవన్నీ? "

"వొడ్డున వొదిలేశాను"

"ఎందుకనీ? "

"నేనెలాగూ చస్తున్నాను. కనక వాటితో నాకేం పనీ? వొడ్డున వొదిలేస్తే ఏ బీదవాడికయినా దొరికితే వాడు వాడుకుంటాడని" అనేశాడు మామూలుగా.

"అదే నేనంటున్నదీని. మీకు సాటి మనుషల గురించి ఆ ఆలోచనా, పట్టింపూ ఉన్నాయనేగా మీ చర్యలోని అర్థసూక్ష్మం? మీకు మీరొదిలేసిన బట్టలూ, పాదరక్షలూ ఎవరికి దొరుకుతాయో తెలియదు"

"ఎవరో ఓ మనిషికి. వాటితో అవసరముండే పేదవాడికి"

"ఔను. మీ వస్తువులను వినియోగించుకునేవాడు పరిచితుడా అపరిచితుడా అని ఆలోచించలేదు మీరు. ఎవరో ఒక మనిషి. అయినా అతనికీ మీకూ సంబంధం ఉన్నట్లే. అతనెవరయినా కానీండి మీకతనిపట్ల ప్రేమా, జాలీ, మానవత్వమూ ఉన్నట్లే. మీమధ్య ఉండేది మానవసంబంధం. అలాగే మనమధ్యనున్నదీ అదే బంధం. ఆ మానవానుబంధాన్ని పురస్కరించుకునే నేను మీ ఆత్మహత్యా ప్రయత్నాన్ని వారించి మీకు ఆగ్రహం తెప్పించాను" క్షమనర్థిస్తునట్లే అన్నాడు సీతారాం. అయితే ఇప్పుడా యువకుడు మూర్ఖంగాను పెంకిగానూ ఉండలేకపోతున్నాడు. అతనికేదో బలహీనత, మృదుత్వం ఆవరిస్తున్నట్లున్నాయి. అవి సీతారాం గౌరవనీయమయిన రూపాన్ని చూస్తున్నందువల్లనో, అతని జ్ఞానాన్ని ప్రతిఫలించే మాటలవల్లనో, ఆ కంఠంలోని ఇంద్రజాలిక శక్తివల్లనో, మరిదేనివలననో, ఏదయినా కారణం కావచ్చు

పైన వెన్నెల ప్రకాశవంతంగా ఉంది.

వెన్నెలలో సముద్రం మహా అందంగా ఉంది.

"అభ్యంతరం లేకపోతే ఇప్పుడయినా మీ నామధేయం చెప్పండి. పేరులో ఏదో ఉంటుందని కాదు. రూపానికి నామం సంకేతం మాత్రమే. అయినా మానవ సహజమయిన కుతూహలం. మనిషి అలవాట్లూ బలహీనతలూ ఒకంతట వొదిలిపోవుగా? " నవ్వాడు సీతారాం.

మంత్రముగ్ధంగా ఉందామందహాసం. దానిలో ఏదో వశీకరణ ప్రభావముంది. సీతారాంని పట్టిపట్టి చూస్తూ... అతని కళ్లల్లో కళ్లు కలిపి దృష్టిని వెనక్కి తీసుకోలేకపోతున్న ఆ యువకుడు తను తన అధీనం తప్పినట్లు చటుక్కున అన్నాడు. 'మాధవ్!'

"అందమయిన పేరు. సాక్షాత్తూ శ్రీకృష్ణుడి నామధేయం. వేణునాదంతో ఆయన అందరినీ వివశువులను గావించినట్లు మీ వచో మాధుర్యంతో ఇతరులనానందింపజేయాలి. అటువంటిది మీరే ఆత్మహత్యా ప్రయత్నానికి తలపడడమేమిటి? చాలా ఆశ్చర్యకరంగానూ నమ్మశక్యంగాకుండానూ ఉందే!"

అతని మాటలు వింటూంటే మాధవ్ వివశుడే అవుతున్నాడు.

"ఊc. మీరెందుకీ తొందరపాటుకి గురయ్యారు? " అర్థిస్తున్నట్లే అడిగాడు.

"... ..."

"ప్రేమ భంగమా? "

"హు... ప్రేమ! ఈ భూమిమీద అదెక్కడుందీ, స్వార్థంతప్ప? నేనలాటి పిచ్చి పెట్టుకోలేదు"

"ఉద్యోగం దొరకకనా? "

"నిజానికి దొరకలేదు. కాని అంతమాత్రాన నేనేమీ భయపడిపోలేదు. చేతిలో విద్యుండగా. బతకలేననే అధైర్యం నాకెన్నడూ లేదు"

"మీరేం చదివారు? "

"ఎమ్మే. నిజానికది పెద్ద విద్యార్హతేమీ కాదు. ఫస్టుక్లాసూ రాలేదు. అయితే నేను ఆంగ్లంలోనూ, సంస్కృతంలోనూ ప్రత్యేక కృషిచేశాను"

"సంస్కృతంలోనా!" సీతారాం కళ్లు మెరిశాయి.

ఆయన ఆశ్చర్యాన్ని అనుమానంలా భావించి "నేను సంస్కృతం నేర్చుకున్నానంటే అంత ఆశ్చర్యానికేముంది? " అడిగాడు మాధవ్. "కావాలంటే వొడ్డున వొదిలిన సంచీనింతవరకూ ఎవరూ తీసికెళ్లకుండా ఉంటే దానిలో నా మిగతా సర్టిఫికేట్లతోపాటు ఇదీ ఉంటుంది, చూడండి"

"ఒక్కసారి మీరొచ్చి చూపించరూ? నాకు సంస్కృతమంటే ప్రాణం. అది చదివినవారంటే ఎక్కడ లేని అభిమానమూ" అంటూ అతన్నాప్యాయంగా కౌగలించుకున్నాడు సీతారాం. ఆ కౌగిలి... స్పర్శ... వాటిలోని ప్రేమాభిమానాలు, మానవత్వం మరీ కరిగించాయి మాధవ్‌ని. ఏదో అందమైన అదృశ్యశక్తి ఆవహించినట్లు వివశుడైపోయాడు. సీతారాం కోరికను కాదనలేకపోయాడు. అతను చెయ్యి పట్టుకుని నడిపిస్తూంటే నీళ్లలో మెల్లగా వొడ్డువేపుకి నడవసాగాడు.

సీతారాంకి ప్రాణం తెరిపిన పడుతోంది.

తను ఉపయోగించిన ఉపాయం ఫలించినట్లే. తను మాట్లాడీ అతని చేత మాట్లాడించీ ఎలాగయితేనేం మాధవ్‌ని వొడ్డువేపు జీవితంవేపు నడిపించగలుగుతున్నాడు. అందగాడూ, మేధావీ, చురుకూ అయిన ఈ యువకుడిని తను సవ్యంగా వినియోగించగలిగితే, పెడదారి పట్టబోయే శక్తిని సక్రమ మార్గానికి మళ్లించగలిగితే...? ఆలోచనలో పడిన సీతారాం వొడ్డెక్కడమే గమనించలేదు. అతనింకా మాధవ్ చేతిని గట్టిగా పట్టుకునే ఉన్నాడు. బిగి సడలితే ఎక్కడ జారిపోతుందో తన పెన్నిధి అన్నట్లు. అలాగే మాధవ్‌ని పట్టుకునే కూర్చున్నాడిసుకలో. మాధవ్ సంచీ తీశాడు. చెప్పులు బయటపడేశాడు. ఒక్కొక్క కాగితమూ తీయసాగాడు మరో అరలోంచి.

"ఇది ఎమ్మే సర్టిఫికేటు, ఇది టైప్ లోయర్, ఇది షార్ట్‌హేండ్ లోయర్, ఇది హోమియో డిప్లొమా"

"హోమియో కూడా చదివారా!"

"తీరికవేళలలో... పోస్టల్ కోచింగ్ పొందాను. తరువాతదే హోమియో వైద్యుడితో కొన్నాళ్లుండి, మెలకువలు తెలుసుకున్నాను. ఈ పుస్తకం మెటీరియామెడికా, ఇది భగవద్గీత, ఆ సంస్కృతం సర్టిఫికేటు దీనిలో ఉంది. చూడండి"

"వెన్నెల బాగానే కాస్తోంది కానీ ఈ వెలుగు నా కళ్లకి చాలదు. ఏ విద్యాపీఠం వారిది ఈ అర్హతా పత్రం? "

"తిరుపతి వారి కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం వారు ప్రసాదించినది. కొన్నాళ్లు హైదరాబాద్‌లో ఉండవలసిరావడంతో సంస్కృత భాషా ప్రచారసమితికి కూడా హాజరయ్యేవాడిని"

"చాలా మంచిపని చేశారు" అభినందించాడు సీతారాం.

"సరే... ఇక మీరు వెళ్తారా? "

నివ్వెరపోయాడు సీతారాం. మళ్ళీ మొదటికి వచ్చాడా మాధవ్?

"ఇద్దరమూ కలిసే వెళ్దాం"

"ఎక్కడికి? "

"వెనక్కి"

మాధవ్ అడ్డంగా తలూపాడు. "నేనెం

దుకు రావడం వెనక్కి? నా వెనుక ఎవరూ లేరు. ఏమీలేదు" అలా అంటుంటే అతని హృదయం భారమై కంఠం జీరపోయింది. కళ్ళల్లో నీళ్ళూరాయి.

"మాధవ్! మీ వెనక నేనున్నాను. ఎన్న టికీ ఉంటాను. నేనేకాదు మీ వెనుక ఇంకా ఎంతో ఉంది. జీవితం, ప్రపంచం... ఎన్నో ఉన్నాయి" ఉద్వేగంగా అన్నాడు

"మీరా!" భారంగా నవ్వేశాడు మాధవ్.

"మీరు నాకుండడమేమిటి? మీరసలే సన్యాసులూ, స్వాములూ"

ప్రపంచమంతా నా సంసారమే. ప్రతి మానవుడూ నావాడే. ప్రతివారూ నాకాప్తులే, ఆత్మీయులే, ఆత్మబంధువులే. ఇది సత్యం కనుక చెబుతున్నాను. నన్ను విశ్వసించండి. మీరు నావారు. నేను మీ వాడిని" అంటూనే మాధవ్ తలమీద చేయివేసి నిమురుతూ అతని శిరస్సును తన వక్షానికి ఆన్చుకుని ఆప్యాయాభిమానాలతో ఆలింగనం చేసుకు న్నాడు సీతారాం. ఆ స్పర్శ... మాధవ్‌ని విచి త్రమైన అనుభూతికి లోనుచేసింది. అయ స్కాంత చికిత్స (మాగ్నటిక్ థెరపీ) పొంది నట్లు మాధవ్ హృదయం ఆవేదననుంచీ ఆర్తినుంచీ కొంత తేరుకుందా స్పర్శతో. మరి కొంతసేపా సుఖాన్ని పొందితే బాగుండునని పించిందతనికి. కానీ సీతారాం అతనిని మెల్లగా ఆలింగనంనుంచి వదిలివేశాడు.

"మీకేమీకాని నా గురించి మీకెందుకూ ఇంత పట్టింపూ, శ్రమా? "

"ఆ ప్రశ్నకు జవాబు ఇదివరకే చెప్పాను. నేను మానవాళినంతటినీ ప్రేమించే సన్యా సిని. ఆ మానవాళిలో మీరూ ఒకరు. అందుచేత మీరంటే నాకు ప్రేమ. రెండవది మీరు సామాన్యులు కారు"

"అంటే? " ఆశ్చర్యంగా చూశాడు మాధవ్.

"విద్యావంతులు"

"నాలాటి ఎమ్మేలీదేశంలో లక్షలకొద్దీ ఉన్నారు" నవ్వాడు మాధవ్.

"హోమియోపతి వైద్యులు"

"వాళ్ళకీ కొదువలేదు"

"సంస్కృతప్రియులు"

"వాళ్ళ సంఖ్య మరీ స్వల్పంకాదు"

"కానీ ఇన్ని సుగుణాలూ ఒకే మనిషిలో ఉండడం అరుదు. అలాంటివారి సంఖ్య అతి స్వల్పం. అదీకాక మీకు పేదలంటే జాలీ, ప్రేమా. నాకూ అంతే. ఒకేజాతి పక్షులకొక దానిమీదొకదానికి అభిమానముండడంలో ఆశ్చర్యమేముంది? పైగా నా స్వార్థమూ ఒక టుంది" నవ్వాడు సీతారాం.

"ఏమిటి? సన్యాసికి కూడా స్వార్థముం టుందా? "

"నేను అందరిలాటి సన్యాసిని కానుకదా. మాధవ్! మీరు మీకక్కరలేదేమోకానీ ప్రపం చానికి... కనీసం ఈ దేశానికి కావాలి. చాలా కావాలి. దేశం మిమ్మల్ని పోగొట్టుకో లేదు, వదులుకోలేదు"

మాధవ్ సూటిగా చూశాడతని ముఖంలోకి.

"మేధావులవలస (బ్రెయిన్ డ్రెయిన్) అంటే ఒకదేశపు మేధావులు మరోదేశం వెళ్ళి పోవడమేకాదు, తన దేశ ప్రజలకు ఉపయో గపడకపోవడం కూడా అని నా ఉద్దేశం. మాధవ్! మీరు నాతో వెనక్కి, ప్రపంచం లోకి, జీవితంలోకి రాక, ముందుకీ సముద్రం లోకీ మృత్యువు చెంతకీ వెళ్ళిపోతే అది మేధావుల వలసే. అంతేకాదు... అది దేశ ద్రోహమూ, ఆత్మద్రోహమూ కూడా" హెచ్చ రిక చేస్తున్నట్లు ఉంది సీతారామ్ కంఠం.

మాధవ్ తుళ్ళిపడ్డాడు. "దేశద్రోహమా? "

"కాక? ఈ దేశం తల్లిలా మిమ్మల్ని పెంచి పెద్ద చేసింది. విద్యాబుద్ధులు గర పింది. దేశమాత రుణం తీర్చుకోవలసిన తరుణమాసన్నమయ్యేసరికి మీరేమో తనువే చాలించేస్తానంటున్నారు. తప్పుకాదూ ఇది? ద్రోహంకాదూ? " సీతారాం స్వరంలో తీవ్రత.

నిర్ఘాంతపోయాడు మాధవ్. "మీరనేదే మిటి? ఒక మనిషికి తాను స్వేచ్ఛగా చని పోయేందుకయినా హక్కులేదా? "

"కొందరదృష్టవంతులకుండదు. వారిలో

మీరొకరు. మాధవ్... జీవితం వరం. దానిని వినియోగించుకోవడం వివేకంకానీ అంతం చేసుకోవడం ఆవేశంకాదూ? "

"చెప్పడం సులభమే. కానీ నా పరిస్థితి తెలిస్తే..."

"మీరు చెప్పకుండా ఎలా తెలుస్తుంది? నేను సన్యాసినేకానీ సాముద్రికుడిని కానుగా"

"మూడు శవాలకగ్నిసంస్కారం చేసి ఇంకా ఇరవై నాలుగు గంటలైనా కాలేదు. ఒకదానివెనుకగా ఒకటి చొప్పున ముగ్గురి శవాలని" మాధవ్ కంఠం దుఃఖంతో వణికింది. విషాదం తొణికిసలాడుతుంటే సీతారామ్ అతని భుజంమీద చెయ్యివేశాడు ఓదార్చుతున్నట్లు. వెయ్యిమాటలు చెప్పలేని భావాన్నికే ఒక్క స్పర్శ సులభంగా ప్రకటించగలదన్న విశ్వాసంతోపాటే అతనికి మరొక విషయమూ తెలుసు. మనిషికొక బలహీనతుంటుంది. పిండదశనుంచి మాతృగర్భంలో ఉండడంవల్లనేమో అతనికి మరో మానవ స్పర్శ అలవాటవుతుంది. అందుకే బిడ్డగా కూడా తల్లో, తండ్రో ఎత్తుకుంటే ఏడుపాపుతారు. పెరుగుదలతో ఈ స్పర్శని కోల్పోతారు. ఐతే ఆటలలోనూ, స్నేహాలలోనూ సాటివారి స్పర్శను పొందుతారు బాల్యంలో. కొంత వయసొచ్చేసరికి ఈ స్పర్శకీ దూరమౌతారు. అప్పటికి కామభావనలు మొదలవుతాయి. ప్రేమ, వివాహం, వీటిని కోరుకునేది స్పర్శకోసమే. స్పర్శసుఖాన్నెంతగా వీలైతే అంతగానూ పొందాలనుకుంటాడు. స్నేహితులతో కరచాలనం. వారినాప్యాయంగా కౌగలించుకోడం... ఇవీ అతనికి సాంత్వననిస్తూనే ఉంటాయి. కొన్ని విధాలయిన నరాల ఒత్తిడికి 'స్పర్శ' సుఖాన్నివ్వడమేకాక చికిత్స కూడా.



ఔను... స్పర్శ కూడా కొన్ని శారీరక అసౌకర్యాలకు సాంత్వనే. ఇదీ ఒకటైపు విధానమే. సైకోథెరపీలాగే టచ్ థెరపీ.

అదే ఉపయోగిస్తున్నాడతను మాధవ్‌మీద.

"మీరు సమయానికి వచ్చి ఆపకపోతే నేను హాయిగా చచ్చిపోయుండేవాడిని ఈ పాటికి"

"మాధవ్! నిన్ను చూస్తే జాలేస్తోంది. కానీ నా మనసుకెందుకో ఏ సముద్రం ముందు నీకు జీవితం వ్యర్థమూ అర్థరహితమూ అనిపించిందో అదే సముద్రంముందు జీవితం స్వర్గమనీ, మధురాతిమధురమనీ నువ్వు గ్రహించగలవనిపిస్తోంది. కాకపోతే కొంత కాలం పట్టవచ్చు సత్యమూ సాపేక్ష సిద్ధాంత బద్ధమేసుమా! కాలమనే గీటురాయిమీదనే సత్యం నాణ్యతా, స్థిరతా నిర్ణయించబడతాయి"

"నాకు జీవనమా ధుర్యం అందడమా" విరక్తిగా నవ్వాడు.

"నేను అగ్నిసంస్కారం చేసినదెవరికనుకుంటున్నారు? మా అమ్మకీ, నాన్నకీ, కౌసల్యకీ. ప్రపంచంలో నాకింకెవరూ మిగలలేదు ఆప్తులూ, ఆత్మీయులూ"

"ఇప్పటికి నేనున్నాను. సంస్కృతంలో సంభాషిస్తూ నాకెంతో సంతోషం కలిగించిన నువ్వు నాకు చక్కని స్నేహితుడివయ్యావు. సత్సంగం లభించింది నాకు. కొద్ది కాలంలో నీవెనుక, నీకోసం ఇంకా చాలా ప్రపంచం ఉంటుంది. నా యందు విశ్వాసమూ, దయా ఉంచి పద" అన్నాడతను మాధవ్ చేయందుకుని.

ఎక్కడికని అడగలేదు మాధవ్.

సంస్కృతంలోనే సంభాషించుకుంటూ వారిద్దరూ నడవసాగారు.

ఎప్పటిలాగే ఆవేళా అనకాపల్లి బస్ కాంప్లెక్స్ కోలాహలంగా ఉంది. ఎక్కువ బల్లలు లేకపోవడంతో ప్రయాణీకులు చాలా

మంది నిలుచునే, కొంతమంది అటూఇటూ తిరుగుతున్నారు.

పదిన్నరకే చాలా ఎండ కాస్తుండడంతో బస్‌స్టాండ్‌లో నీడే తప్ప చల్లదనం ఏమాత్రం లేక ఉక్కపోస్తోంది. చిరాకుగా ఉందక్కడ. భుజాన సంచి, కాషాయరంగు లాల్చీ, పంచె. మాధవ్ అందరిలోనూ కూడా ప్రత్యేకంగా కనపడుతున్నాడు. స్టాండులోకి ప్రవేశించే ప్రతి బస్సునీ ఆత్రంగాచూసి, అంతలోనే నిరాశగా నిట్టూర్పు వదులుతున్నాడు.

"మీరెక్కడికి? " ఎవరో అడిగాడు. చదువుకున్నవాడిలాగే ఉన్నాడతను.

"పూడిమడక"

"ప్చ్... పాపం"

"అదేం? "

"బస్సులో ఇక్కడినుంచక్కడికి వెళ్ళవలసి రావడం నిజంగా శిక్షే. అది ఈ పాటికే మీకనుభవమౌతూ ఉండాలే"

"నిజమే. బోర్డునిబట్టి పది గంటలకి రావాలి బస్సు. పదింపావుకి రాకపోవడంతో విచారణలో అడిగాను. వస్తుందని ఓ సారీ, రావాలని మరోసారీ అన్నారు. విసుగొచ్చి వచ్చేశాను"

"మరో పావుగంటలోగా కచ్చితంగా రాదు" నవ్వాడు.

"ఎలా చెప్పగలరు? "

"అది పూడిమడక బస్సు. దానికి ప్రత్యేకతలున్నాయి"

"ఏమిటి? "

"చేపల తట్టలతో వస్తుంటుంది కనుక యోజన గంధిలా అల్లంత దూరంనుంచే మత్స్యగంధాలు విరజిమ్ముతుంది. అలాగ దానిరాకను చాలా ముందుగానే పసిగట్టవచ్చు రెండోది దూరంనుంచే చెప్పెయ్యచ్చు"

"అంటే? " అడిగాడు మాధవ్.

"పైన వేసిన చేపల బుట్టలలోంచి నీరు కారుతుంటుంది. కనుక ఏ బస్సులోంచి నీరు కారుతుంటుందో అదే పూడిమడకది"

"హాస్యంగా మాట్లాడతారు మీరు. మీ పేరు? "

"విశ్వం. అదుగో నా బస్సొచ్చేసింది" అంటూ పరుగెత్తాడతను మాధవ్ ఇంకా వివరాలడుగుదామనుకునేంతలోనే.

పూడిమడక బస్సు తప్ప మరో మూడు బస్సులొచ్చాయి. స్టాండూ, బల్లలూ ఖాళీ అయ్యాయి కొంతమేరకు. పంకాకింద బల్ల మీద కూర్చున్నాడు. వేడి భరించలేనట్లు కళ్ళు మూసుకుని వెనక్కి వాలాడు. అతని మెదడులో స్వామి మెదులుతున్నాడు. అతని మాటలు, సముద్రతీరంలో అంతగా మాట్లాడిన స్వామి తరువాత అట్టే మాటాడలేదు. ఆ అర్ధరాత్రి ఆశ్రమానికి వెళ్ళాడు తనాయనతో. వెన్నెలేమో ఆ వాతావరణం మరీ బాగుంది. చల్లని గాలీ, ప్రశాంతతా, నిశ్శబ్దమూ,

నాలుగైదు పాకలు. అదేనట ఆశ్రమం. అట్టహాసమేమీలేదు.

పాక లోపల మాత్రం విశాలంగానూ, పరిశుభ్రంగానూ, నిరాడంబరంగానూ ఉంది. ఒక బల్ల, బీరువా ఉన్నాయి. నేలమీద చాప పరచి ఉంది. రాతపనికి కిందకూర్చునే వ్యాస పీఠంలాటి చిన్న బల్ల ఉపయోగించాలి. విద్యుద్దీపం మాత్రం ఉంది.

"బయట కానీ లోపల కానీ నీ యిష్టమొచ్చిన చోట నిద్రపో చాప వేసుకో. ఉదయం మాట్లాడుకుందాం. నీ సంచికేమీ లోటు రాదు. నిశ్చింతగా నిద్రపో" అని వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం సహజంగానే ఆలస్యంగా మెలకువొచ్చింది. స్వామి లేరు. కాని ఎవరెవరో వొచ్చి తన అవసరాలు తీర్చారు. చేసేందుకే పనీలేక ఆశ్రమమంతా కలయదిరిగాను. కొన్ని విషయాలు అవగతమయ్యాయి. నిజానికది ఆశ్రమం కాదు. ఒక కార్యాలయం. కొంచెం దూరంలో వృద్ధుల కావాసాలు కల్పించారు. వృద్ధులక్కడ నివసిస్తున్నారు. ఆశ్రమ భోజనం కూడా ప్రత్యే

కమే. శాకాహారం, పాలు, అవీ మితంగానూ వేళకి. ఎటుచూసినా నిరాడంబరత్వమే. బీరువా అద్దాల వెనుక పురాణాలు, ఉపనిష త్తులూ కనిపిస్తుంటే తీశాడు. మరొక అరలో ఫైళ్లూ, ఉత్తరాలు. కేవలమూ కుతూహలం కొద్దీ అవి అక్కడక్కడ చూశాడు. అవి చదు వుతుంటే స్వామి వెనుక ఏదో రహస్యమున్న ట్టనిపించింది.

స్వామి పేరనున్న ఈ ఆశ్రమానికి పెద్ద పెద్ద వాళ్లు ఎవరెవరో ఎక్కడెక్కడినుంచో విరాళాలు పంపుతున్నారు! ఎందుకో తెలిసే వివరాలు లభించలేదాకాగితాలలో. ఆశ్రమ నిర్వహణలో గోసంరక్షకశాఖ కూడా ఉంది. అవన్నీ చూస్తుంటే తనలో ఏవేవో సందే హాలు. ఈయన మరో బాబా కాదుకదా?

ఇంతకీ ఒకరిద్దరినడిగాడు "ఎవరీ స్వామీజీ? "

"స్వామీజీయే" అని నవ్వేశారంతే తప్ప వివరాలు చెప్పలేదు. దానితో పుస్తకాలు చదువుతూ గడిపాను. అప్పుడు వొచ్చారు స్వామి.

"ఈ నిర్వ్యాపారత్వం నాకు దుర్భరం గానూ, దుస్సహంగానూ ఉంది స్వామీ!" నివే దించుకున్నాడు సంస్కృతంలో. "నాకేద యినా కార్యముప్పగించండి"

"అయితే నువ్వు మానవసేవకే అంకితంకా వాలని నిర్ణయించుకున్నావా? మాధవా! మరోసారి నీ నిర్ణయాన్ని విమర్శించుకోడం శ్రేయస్కరమేమో. ఈ పథంలో జీవితం వేరుగా ఉంటుంది. మనం తీసుకునే ఏ నిర్ణ యమయినా తరువాత పశ్చాత్తాప పడవలసి వొచ్చేదిగా ఉండకూడదు. మానవసేవా కార్యక్రమంలో ఆడంబరముండదు. ఆర్జన ఉండదు. జీవిక మేరకే తప్ప స్వలాభమూ, స్వసుఖమూ అతి స్వల్పం. ఒక విధంగా ఈ బృహత్తర కార్యభారం భుజాన వేసుకుని నిర్వర్తించడం త్యాగమే"

"ఒకానొక విషాద పరాకాష్టలో జీవితాన్ని అంతంచేసుకోవాలనుకున్నవాడిని. మీవలన పునర్జన్మ ఎత్తాను. ఇక నా జీవితం మీ ఆదే శాలను పాటించడానికే. మానవసేవను నేను త్యాగంగా కాక విధిగానే భావిస్తాను" ఉద్రేకంగా అన్నాడు తను. "నిస్సంకోచంగా శలవివ్వండి నేనేం చేయాలో"

"అనకాపల్లికి దక్షిణంగా, సుమారు పాతిక కిలోమీటర్ల దూరంలో సముద్ర తీరముంది. అక్కడ పూడిమడకనే గ్రామముంది. నీ వక్కడికి వెళ్లు"

"వెళ్లి? ఏంచేయాలి? "

మందహాసం చిందించారాయన "వెళ్లాక అక్కడేం చేయాలో నీకు పరిస్థితులూ కాలమే సూచిస్తాయి. నీ వలన ఘనకార్యమే జరుగుతుందని, లోకోపకారమే కాగలదని అంతర్వాణి ఆశాభావం వెలిబుచ్చుతోంది. నువ్వక్కడే జీవించు"

"అవశ్యం"

హటాత్తుగా చిన్న గందరగోళం.

కళ్లు తెరిచాడు మాధవ్. పూడిమడక బస్సొస్తోంది!

అతను లేచి వేగంగా అటు నడవసా గాడు.

అదృష్టవశాత్తూ అతనికి కిటికీ పక్క చోటు దొరికింది.

ఈ ప్రాంతంలో తను నివసించబోతు న్నాడు కనుక వీటి గురించి తెలుసుకోడం మంచిదన్న ఉద్దేశంతో బయటకు చూడసా గాడు ఆసక్తిగా. రోడ్డుపక్క పొలాలు. సార వంతమయినట్లుందిక్కడి భూమి.

"అచ్యుతాపురం" కండక్టర్ అరుపుతో బస్సా గింది. చాలామంది దిగిపోయారు. కూడ లిలా ఉంది. కుడివైపుకొక దారి చీలి ఉంది. అది యలమంచిలి వెళ్తుందట. సినిమాహా లుంది. ఇంతకు మునుపూ రోడ్డుపక్క ఒకటో అరో తగిలాయి టూరింగ్ టాకీసులు.

"ఏమిటవి? చిన్నచిన్న కొలనులలాగ- నీటి పొలాలేమిటి, మిగిలిన పొలాల మధ్య? వాటిలో కొన్నిటిలో ఎండలో మెరు స్తున్న ఆ వెండి కుప్పలేమిటి? మధ్యమధ్య

ఆ బంగారు రాసులేమిటి? ధాన్యపు రాసులు కావే! ఏమిటవి?

"కొత్తోరిలా ఉన్నారూరికి. అవి ఉప్పుకొటార్లు బాబూ. సముద్రప్రాంతం గదా!" పక్కతను సందేహం తీర్చాడు మాధవ్ అడగగానే.

"ఉప్పు కుప్పలా అవి!"

"ఔను బాబూ. అది ఉప్పు పంట"

"దిగండి దిగండి"

"పూడిమడకేనా యిది? "

"అనుమానం లేదు"

బస్సునుంచి కాలుకింద పెట్టి ఒక్కక్షణం అట్టే నిలచిపోయాడు. మరుక్షణం మరి నిలవలేకపోయాడు.

పన్నెండు గంటల ఎండ మండిపడుతోంది. చుట్టుపక్కల ఒక్క చెట్టుకూడ లేదు. ఒక కిళ్లీకొట్టు కనిపిస్తే అటు నడిచాడు.

"చల్లని మజ్జిగ దొరుకుతుందా? "

"సోడా ఉంది"

"ఇవ్వండి" ఆ సోడాతోనే ముఖమూ, నోరూ కడుక్కుని మిగిలిన గుక్కెడూ నోటిలో పోసుకున్నాడు. అతనికి ఆకలేస్తోంది. చుట్టూ ఎక్కడా భోజన హోటలు బోర్డు కనిపించలేదు. రెండుమూడు టీ పాకలు మూసి ఉండగా కొంచెం పెద్దది ఒకటి తెరచిఉంది.

"భోజన హోటలు"

"టిఫినుకయినా భోజనానికయినా ఇక్కడ ఇదొక్కటే హోటలు. టిఫిన్లు పొద్దుట పదింటికే సరి. మధ్యాన్నం మూడుకి పకోడీలూ మసాలా గార్లూ వేస్తాం. భోజనం మూడు గంటలు ముందుగా చెబితే చేస్తాం. చెప్పండి, టీ ఇచ్చేదా? "

"వొద్దు. ఈ పూటకి అరటిపళ్లు తీసుకుంటాను. రేపు మీరు భోజనం పెడుదురుగాని. అన్నట్లు బస చెయ్యడానికిక్కడ హోటలుగది లాటిది"

హోటలువాడు నవ్వేశాడు. "ఇదేమయినా టౌనా? కావాలంటే తుఫాను రక్షణ గృహం అని ఒకటుంది. దాన్లో ఉండడమే"

మాధవ్ కిళ్లీ కొట్టుకెళ్లి అరటిపళ్లు తిన్నాడు. "సముద్రానికెటు పోవాలి? " ఫక్కున నవ్వాడతను. "మీ ఎదురుగా ఉన్నది సముద్రం కాక మరేటి? "

అప్పుడటు చూశాడు. కళ్లు చిట్లించి ఎండన పడిరావడాన తను చూడలేకపోయాడు సరిగా. కానీ ఎదురుగా ఓ ఫర్లాంగు దూరంలో సముద్రమే. నీలినీరూ నింగీ కలిసిపోయినట్లుంది. తను గుర్తించలేకపోయాడు.

"హోరు లేదేం? "

"కెరటాలుంటే హోరుంటుంది. ఇలాటప్పుడు అట్టే హోరుండదు. దగ్గరకెళ్తే గాని యినపడదు. సముద్రం చూడ్డానికొచ్చారా? ఎళ్లండి యిదే మంచిఏళ"

సముద్రదర్శనానికీ మంచివేళా చెడ్డవేళా ఉంటుందా? ఉంటుంది. తన అనుభవమే నిదర్శనం. కాళ్లకి యిసుక తగులుతోంది. చేపలవాసన మరింత దట్టమౌతోంది. అక్కడో కోవెల స్పష్టంగా కనిపిస్తోంది. కొద్దిదూరంలో ఉన్న నూతివద్ద కాళ్లు కడుక్కుని ఆలయాన్ని సమీపించాడు. అది జగన్నాథస్వామి కోవెల! తాను ప్రజల దేవుడనీ, ప్రజలకీ తనకి మధ్య అవరోధంగా ప్రహారి గోడ ఉండరాదని భావించాడేమో జగన్నాథుడు. ఆలయానికి ప్రహారీ లేదు.

కొన్ని గజాల అవతల కళ్లని కట్టిపడేసే కమనీయ దృశ్యం. ఆలయం వెనుక బంగారపు రజనారబోసినట్లు ఇసుక ఎండకి మెరిసిపోతూ. ఆ ఇసుక అంతమయ్యే చోటునుంచీ నీరు, సముద్రం. వొడ్డుదగ్గర తెల్లగా, ఆపైన లేత నీలం రంగులో, ఆ వెనుక ముదురునీలానికి మారుతూ, చూపానంతదూరాన చుక్కలసీమలో మమేకమవుతూ మహాసముద్రం. అంతా నీరే. కానీ దాని వర్ణంలో ఎన్నో కొత్తపుంతలు. సముద్రనీలం అతి చక్కని వర్ణమేకాదు. అత్యంత వైవిధ్యమయినదీను. ఆ నీలినీటిలో

దూరంగా చిన్నచిన్న నల్లచుక్కలు. దగ్గరగా వస్తుంటే తెలుస్తుందవి తెప్పలని. తీరాన ఒకవేపు గుడిసెలు మానవనివాసాలు. అవి యింకెవరివవుతాయి, బెస్తవారివికాక?

జగన్నాథస్వామికీ జాలరులకి జన్మాంతర బంధమేమో. పూరీలో జగన్నాథుడు. అక్కడ జాలరులు. విశాఖలో జాలరులు. అక్కడ జగ్గడు. ఈ పూడిమడకలోనూ, అదుగో జాలరులు, ఇదుగో జగన్నాథుడు. జగన్నాథుడు జాలరుల దేముడుకాదు కదా జగానికి నాథుడయినా?

ఔనూ, జగన్నాథుని రథమేదీ? జగన్నాథ రథచక్రాలేవీ?

ఆలోచనలాపి దృష్టిని కేంద్రీకరించాడు. అటువేపు, అంబుధి వేపు.

ఇదే తను నివసించవలసినచోటు. ఇక తన ఉనికీ మనికీ ఇక్కడే. అతను కోవెల లోకి వెళ్ళాడు. మిట్టమధ్యాహ్నపు మిడసరి లగ్నంలో కూడా జగన్నాథుడు సుభద్రా సమేతుడై దర్శనం ఇస్తూనే ఉన్నాడు. మాధవ్ చేతులు జోడించాడు. "స్వామీ! ఇకపై నా జీవితం ఆ జాలరులది. నా శక్తి సామర్థ్యాలన్నీ వారికే అంకితం. అలాగ అనుగ్రహించు, ఆశీర్వదించు. వారినిలాగే నన్నూ నీవాడిని చేసుకో"

మాధవ్‌కాశ్చర్యంగానూ ఉంది, అయోమయంగానూ ఉంది.

తను చూస్తుండగానే తీరం జనంతో నిండింది. పడవలలోంచి మనుషులు దిగారు. పట్టిన చేపలని ఒడ్డున పడేశారు. వలలూ తాళ్లూ ఓ పక్కన పెట్టారు. ఒక్కొక్క చోటా చిన్నచిన్న గుంపు. చేపలని తెచ్చినవాళ్లూ కొనుక్కుందుకు వచ్చిన వాళ్లూ... ఒక్కొక్క పడవా వస్తుంటే ఒక్కొక్క చిన్న దుకాణం తయారవుతోంది. చేపలు... చేపలు... చేపలు... చిన్నవి, పెద్దవి, చాలా పెద్దవి.

నల్లనివీ తెల్లనివీ పచ్చనివీ రంగురంగులవీ మచ్చలవీ మత్స్యాలు నీళ్లోడుతున్నాయి కొన్ని. కొన్ని మీనాలు చచ్చినట్లు పడుంటే కొన్నేమో కొనప్రాణంతో కొట్టుకుంటున్నట్టు గిలగిలలాడుతూ, మరికొన్ని చక్కగా సజీవంగా కదులుతూ నీటిలోంచి బయటకు తేబడిన చేపలు.

ఎక్కువ చేపలను పట్టి తేగలిగిన వారి కళ్లల్లో ఆనందమూ, ఆశా, వెలుగూ. కొంచెం మాత్రమే దొరికినవారు దిగులుగా, బాధగా, ముఖం వేలాడేసుకుని బేరసారాలు జరుగుతున్నయ్. ఎన్ని చేపలున్నా పోగు మొత్తంకి బెస్తలు ధర చెప్పడమూ కొనేవాళ్లడగడమూ.

అతను వారిని మరింత పరిశీలనగా చూడసాగాడు.

ఎంత పెద్ద వయసువాడయినా గోచీయే. చిన్నకీ పెద్దకీ అందరి మగాళ్లకీ మొలకి తాడూ, మొలతాడుకి గోచి. అంతే ఒంటి మీద మరో ఆచ్ఛాదనలేదు.

ఏడాది నిండిందో ఇంకా లేదో, ఓ శిశువు మొలకి గోచీ అయినా లేదు. అడుగులు వేయడమటుంచి నిలబడడమేనా వచ్చునో రాదో! అంత చిన్న శిశువు నీటిలోకి వెళ్లిపోతున్నాడు. మామూలు నీళ్లు కావు మహాసముద్రం. పక్కనంతమందుండి ఎవరూ చూడరేం?

పరుగుపరుగున వెళ్లి ఆ శిశువునందుకున్నాడో లేదో "ఎవరది?" అంటూ అతని వెనుకనుంచి ఒక గొంతు.

"ఈ పిల్లవాడు నీళ్లలోకి [illegible]తున్నాడు. ఎంత ప్రమాదం జరుగునో" అన్నాడు మాధవ్ వాడినింకా చంకనుంచుకునే.

గొల్లున నవ్వారు వాళ్లు. "కొత్తోరిలా ఉన్నారు. అందుకే కంగారుపడ్డారు. బాబూ! మా జాలారి మొగోళ్లకి రెండేసిళ్లు. ఒకటి నేలమీదా రెండోది నీటిమీద. మావి రెండు పెపంచకాల బతుకులు. నీటిలో బతికే చేపనీ నీటిమీద బతికే మమ్మల్నీ నీరేం చేస్తది? గంగమ్మ తల్లి దొడ్డది. మా బిడ్డలకి బువ్వపెడుతుంది. ఆడిస్తది... లాలిస్తది. అంతేగాని వాళ్లుసురు పోసుకోదు. ఆడితనే

ర్నుకుంటున్నాడు. గంగాపుత్రులం కద బాబూ! నేలమీద నడకరాకపోయినా పర్లేదు గాని నీటిమీద ఈత చేతకాకపోతే బతుకు ముందుకెళ్లదు. వాణ్ణిగ్గెయ్యండి. వాడికేటీ కాదు"

అంత చిన్న పిల్లాడిని నీటిలో వదలడానికి ధైర్యం చాలక ఒడ్డునే దింపి అక్కడినుంచి కదిలాడు మాధవ్ తన అమాయకత్వానికి సిగ్గుపడుతూ.

అమ్మకాలు ముగించేసుకున్న బెస్తలు డబ్బులని రొంటిలో దోపుకుని వలలనూ గాలాలనూ భుజాలనేసుకుని గుడిసెల వేపు కదిలిపోతున్నారు. మరోవేపు ఒకటీ అరా పడవలు వస్తూనే ఉన్నాయి. చేపలు ఒలుపు తూనే ఉన్నారు ఆ పడవలవాళ్లు. బేరగాళ్లు వాళ్లని చుట్టుముడుతూనే ఉన్నారు.

"మా అయ్యారానేదేటి? " అడిగిందొకపిల్ల. "మీతోటే బయలుదేరినాడుగా? "

"మీ అయ్యకాశెక్కువ. మరీ లోతుకి పోనాడు"

"అరిపాలెం సినేమాకి దీసుకెడతనన్నాడు"

"సేపలు బాగా పట్టి అరిపాలెమేటి, అనకాపల్లె దీసుకెళ్తాడు. రెండాటలూ చూబిస్తాడు. ఆడు పొద్దు తిరిగే వరకూ ఒడ్డు చేరడుకానీ నువ్వింటికిబో" కచ్చితంగా చెప్పేశాడు. ఆ పిల్లకెనిమిదో తొమ్మిదో ఉంటుందేమో. వయసు మొయ్యలేనంత నిరాశని మనసుకత్తుకుని దిగులుగానూ మెల్లగానూ వెళ్లిపోయిందక్కడినుంచి మాటిమాటికీ వెనక్కి తిరిగి సముద్రం వేపు చూస్తూనే.

కొత్త మనుషులు, కొత్త వాతావరణం, క్రొంగొత్త విషయాలు. అద్భుత రసంలో మునిగి తేలుతూనే కదులుతున్నాడు మాధవ్.

ఆ వేళ రాత్రి చీకటిలో ఒంటరితనంలో సముద్రం తనని ఉద్వేగినీ ఉన్మత్తుడినీ చేసింది! మరి ఈ పగటివేళ జనసమ్మర్దంలో ఈ సముద్రం తనను భావావేశంలో తేల్చి ఎత్తెయ్యదేం?. ఉద్రేకంలో ఊపెయ్యదేం? ఇప్పుడిక్కడ ఆట్టే కెరటాలు లేకుండా ఏమీ ఎరుగని నంగనాచిలా ఎంత శాంతంగా ఉంది? అతను సముద్రంలో దిగి స్నానం చేశాడు. ఒడ్డుకొచ్చి బట్టలు వేసుకోబోతూంటే

"ఆ నూతికాడ నాలుగు చేదలు తోడి పోసుకోకుంటే ఒళ్లు సిటసిటలాడుద్ది. ఉప్పు నీళ్లు గందా? ములిగినంతసేపూ బాగానే ఉంటది. తరవాతే తమాసా జూబిస్తయి. పట్నపోళ్లుగదా తెలియదని జెప్పాను" అన్నాడొక బెస్త.

నిజమే అనుకుంటూ కొంచెం దూరంలో కనిపిస్తున్న నూతివేపు నడిచాడు. ఆ బావి దగ్గర ఎవరో నీళ్లు తోడుకుంటున్నారు. మరొక చేద (రేక) లేదక్కడ. నిరీక్షిస్తూ నిలబడగా "తానం చేస్తారా? తీసుకోండి. మీదయ్యాకే నేను చేదుకుంటాను" అందామె చేద అందిస్తూ. అతను తలెత్తి చూడకుండానే తీసుకుని అలవాటుగా "థాంక్స్" చెప్పి నూతిలో చేదవేశాడు. తాటికమ్మతో తయారుచేయబడిన ఆ చేద నీటిలో ములగదే! దానిలోకి నీళ్లురావే! ఫక్కున నవ్విందామె గవ్వలు గలగలలాడినట్లు. "మీకు చేదడం చేతరానట్లుంది. కూర్చోండి గట్టుమీద. చకచక నాలుగు చేదలు తోడిపోసేత్తాను. లేకపోతే నాకు వేళయిపోతుంది" అంటూ అతని చేతిలోంచి చేద తీసుకుని నాలుగంగల్లో చేది అతని నెత్తిమీద పోసింది.

సముద్ర పొడ్డున నూతిలోని నీరు తియ్యగా ఉంటుందనేది ఎల్లవేళలా నిజంకాదేమో అనిపించింది బావినీరు నోటిలోకి వెళ్లి రుచి తెలియగానే. ఉప్పగాలేదు, కాని తియ్యగానూ లేదు. ఆమె మరో మూడు చేదలు చేది పోసి "చాలా? " అని అడిగింది. అప్పుడు చూశాడతనామె ముఖంలోకి కృతజ్ఞతలు చెబుదామని. కాని ఆమె ముఖం చూడగానే గుండె గొంతుకలో కొట్లాడినట్లయింది. కృతజ్ఞతలు తెలపడం మరుగున పడి అతని నోటివెంట "కౌసల్యా" అనే పిలుపు ఉద్వేగంగా.. "కౌసల్యా... కౌసల్యా...

కౌసల్యా!!"

"నా పేరు కౌసల్యాకాదు, కైకేయీకాదు" అందామె నీళ్లు తోడుకుంటూనే.

"మరేమిటి? "

"కాసులమ్మ. మా దేవత పేరు. అందరూ కాసులంటారు"

అతను గొణుక్కున్నాడు కౌసల్య- కాసులు, కౌసల్య- కాసులు. సారూప్యం... నామ సారూప్యం. రూప సారూప్యమూను.

సారూప్యమేనా? ఇరువురూ ఒకరుకారా? తన మనసెందుకలా భ్రమలు గొలుపుతోంది? తనది భ్రమేనా?

ఏది సత్యం? ఏది మిధ్య? ఎవరు నివృత్తి చేస్తారు?

"కౌ..స..ల్యా!" ఆర్తిగా పిలిచాడు.

"మీకేమన్నా వెర్రా, పిచ్చా? ఎవరన్నా చూసి పోతే ఏమనుకుంటారు? " అంటూనే ఆమె కడవనెత్తికెత్తుకుని వెళ్లిపోయింది. కాని అప్పటికే వాళ్లిద్దరూ ఎవరికంట పడకూడదో వారి కంటనే పడ్డారు.

వెర్రి! పిచ్చి!

నిజమే. అభిమానాలు వెర్రే. ప్రేమానురాగాలు పిచ్చే.

ఆమె వెళ్లిపోడంతో అంతా శూన్యమయిపోయినట్లే తనకిక అక్కడ పనేమీలేనట్లే కదిలాడు మళ్లీ సముద్రపు ఒడ్డుకి.

నీటి అంచున నిలబడి నీటిలో సుమారు రెండు మూడు ఫర్లాంగుల దూరంలో ఉన్న ఆ కొండనీ సముద్రాన్నీ చూస్తుంటే

"ఏటి బాబూ అలా సూత్తున్నారు? "

"ఆ కొండ దాని పేరేమిటో? "

"కొండంటూన్నాంగదా? మళ్లీ మరో పేరు లేకపోతేనేం? మనం దాన్నేమయినా పిలవాలా? అది పలకాలా? " కిసుక్కున నవ్వాడు.

"నీ పేరేమిటి? "

"గంగన్న"

"పల్లీయుడివా? అంటే..."

"తెల్సు బాబూ! పల్లీయులంటే మేం పల్లోళ్లంటాం. చేపలు పట్టేవాళ్లే. కాని ఇక్కడ వాళ్లు లేరు. అంటే ఇక్కడ వాళ్లు చేపలు పట్టడం కాక ఎవసాయం చేస్తారు. శీహరిపురం అలాటి సోట్లకు పోనారు పల్లోళ్లు. అక్కడ ఇళ్ల కట్టడం పనులూ గట్రా చేస్తారు. బాబూ... తమరికిక్కడ పనేటి? "

"ఇక్కడే ఉండిపోవాలని వచ్చాను. నానివాసం ఇక్కడేర్పరచుకుందామని. మీతో పాటు ఒకడిగా బతుకుదామని, ఔనూ నువ్వేం చేస్తావు? "

"తుపాను రక్షణకంటూ ఓ డాబా ఇల్లు కట్టించిందిగా ప్రెబుత్వం? అదే ఇక్కడికెవ రేనా వొస్తే బసకూడా. దానికి వోచ్‌మన్‌ని" గర్వంగా చెబుతూ చుట్టంటించాడు. "ఆ జీతం సారాకేచాల్దు. అంచేత పగలు ఏటికెల్తాను. రాత్తిరక్కడ పడుకుంటాను. రెండుజ్జోగాలూ రెండాదాయాలూ"

"బాగుంది. నువ్వు కల్లు తాగవా? "

"సేతినిండా డబ్బాడితే కల్లు కర్మేమిటి? సారాయే తాగుతాడెవడయినా. ఇంకా బ్రేంది రమ్మూ తాగుతాం"

"ఔనూ, వేట కెళ్తానంటావేం? ఇక్కడ అడవుల్లేవుగా? " ఆశ్చర్యంగా అడిగాడు మాధవ్.

జాలిపడుతున్నట్లు చూశాడు గంగన్న. చుట్టపొగ గుప్పున నములుతూ "మీకేటీ తెలిసినట్టులేదు. ఏటంటే గంగకెళ్లి సేపలు పట్టుకు రావడమే"

"మరేమీ అనుకోకు. నువ్వు బలశాలివిగా కనిపిస్తున్నావ్. కనుక నువ్వు వేటకెడితే వల నిండా చేపలేనా? "

"నీటి మీదేటకి కండబలమొక్కటి సాల్దు. గుండె నిబ్బరమూ బుర్రా కూడా ఉండాలి. అవీ మనకెక్కువే. ఏటకి శక్తీ ఉండాలి సాహసమూ ఉండాలి"

"నీటిలోంచి ఒడ్డున పడేస్తే గిలగిలలాడుద్ది చేప, కాని కొన్ని పెద్ద సేపలు తెప్పలోని మనిషినే నీళ్లలోకి తిరగ్గొట్టేయగలవు. కీలెరిగి వాతపెట్టినట్లు వాటమెరిగి గాలమె

య్యాలి. లేకపోతే మనమూ మన గాలమూ కూడా గోవిందో గోవిందే. కొన్ని చేపలెదురు దిరిగి మనిషినుక్కిరిబిక్కిరి చేసేసి ఊపిరాడ నివ్వన్న. సేపలది నీటిగోదా. మడుసులది నేలగోదా. సవుద్రంలో స్తానబలం సేపల్ది. అయినా ఆటిని నెగ్గుకు రావాల".

"నైట్ వాచ్‌మన్‌గా జీతం ఒస్తుందిగా చాలదూ? మళ్లీ వేటకెళ్లి యాతన పడడం దేనికీ? " యధాలాపంగా అడుగుతున్నట్లడి గాడు.

"డబ్బుకోసం. సొమ్మెందుకంటే సుకం కోసం"

"ఇప్పుడు సుఖపడడంలేదా? "

"సుకానికి సుక్కెక్కడ? కోరికలకంతెక్కడ? బాగ్యవంతుడే కానీండి, బెస్తోడే కానీండి, బాగుబతుకే కానీండి, బడుగుబతుకే కానీండి. ఎవరయినా ఏ బతుకయినా ఎప్పుడూ కోరుకునేదొకటే"

"ఏమిటి? "

"ఇంకా సుకం. బాసయేరుకావొచ్చు బతుకు లేరుకావొచ్చు ఏమనిసి తాపత్రయ మేనా ఇంకా ఎక్కువ సుకపడడానికే"

"అలాటి సుఖాలకోసమేనా నీ సాహసాలు? "

"మీరు మమ్మల్ని సాహసులన్నా మరో టన్నా మేము బాముకుంటున్నదేమీ లేదు. మేమహోరాత్తుర్లూ అతలాకుతలమయ్యేది, అర్రులుచాచేది బిరుదులకోసమూ కాదు కితాబులకోసమూ కాదు. బతుకు బండి నడవడంకోసమే"

"ఏమనుకోకుకానీ ఒక్కో పడవా పట్టిన చేపలకి బాగానే ప్రతిఫలం ముడుతున్నట్లుందే!"

"దూరపు కొండలు నునుపు. పడవ సొంతంది కాకపోతే పడవద్దె, సరంగు వాటా పోగా మిగిలినది పడవమీద చేపలు పట్టి నోళ్లు పంచుకోవాలి. పైపై వాళ్లయితే అప్పుడు మనిసికెంతొస్తదో మీరే ఆలోసించండి. అదురుస్టం బాగుంటే సేతికేబయ్యో అరవయ్యో అందనూవొచ్చు నసీబు కరాబయితే పాట్లూ వొట్టి చేతులే మిగలనూ మిగలచ్చు ఏదయినా గంగమ్మ తల్లి దయమీదే మా జాలరోళ్ల జీవితాలు"

"ఏమయినా మీరు వీరులే, ధీరులే, సూరులే"

"నవ్వుతాలకన్నా ఆ మాట నిజమే. అవతలొడ్డులేని అంతులేని సవుద్దరం, దానిలో చిన్న తెప్పేసుకుని ముగ్గురో నలుగురో బయలెల్లడం మరి గంగలో మనిసికి మింగుడయ్యే మిడిమిడి సేపలే కాదు మనుసుల్నే ఆమ్మని మింగేగల తిమింగిలంలాటి పెద్ద పెద్ద సేపలూ ఉంటాయి. వాటితో ఎట్టుకుంటే మరి వొడ్డు చూడక్కర్లేదు. గుడినీ గుడిలో లింగాన్నీ కలిపి మింగేసేలా తెప్పనీ తెప్పతోపాటు మనుషుల్నీ కలిపి కబళించీగల పెనుసేప పాలిట పొరపాట్న పడ్డామో అంతేసంగతులు. పెళ్లాం మరొకణ్ణి చూసుకోవలసిందే. నా గురించేటుందికానీ మీ మాటలు చెప్పండి" అన్నాడు చెప్పి చెప్పి విసుగొచ్చినట్లు.

"చెప్పడానికేముంది? నా పేరు మాధవ్. చదువుకున్న వాడినే. ఇక్కడుండిపోవాలని వచ్చాను. బసకోసం చూస్తున్నాను"

"ఉజ్జోగమా? "

"ఉహు. ఇక్కడేదయినా పని దొరికితే చేస్తాను"

"చదువుకున్న పట్నం బాబులకిక్కడేం పనులు దొరుకుతాయ్? రెండు మూడ్రోజులుండడానికంటే మా తుపాను రక్షక కేంద్రంలో చోటు చూపించగలను"

"చాలు, అది చాలు"

"కాని మీరేటో ఇసిత్రంగా వున్నారు. అందరూ పట్నాలు పోతుంటే మీరేమో సదువుకునీ ఈ పల్లెకి పనిగట్టుకు రావడం"

"అనుమానించవలసిందిగా అనిపిస్తోందా? "

"నిర్మొగమాటంగా చెప్పాలంటే అంతే బాబూ. పస్లేని మంగలి పిల్లిబుర్ర గొరిగా

డని. సదువుకున్నోరీ వూరి మీదకెందుకురా వాలీ అని? మా జాలార్లకి పైవోళ్ల మీద అనుమానం జాస్తి. అంత బేగీ నమ్మం"

"ఎందుకనీ? "

"ఎందుకంటే ఏంజెప్పేది? మా అనుబవా లలాగున్నయ్. నాల్రోజులలవాటుపడేవరకూ పరాయోళ్లు మాకు కొత్తే"

"ఒక పని చేద్దాం గంగన్నా. నా దగ్గర కొంత డబ్బుంది. అది నీకే ఇస్తాను. దాచు. బస దొరికేవరకూ నేను తుపాను రక్షణ కేంద్రం వరండాలో పడుకుంటాను నా సంచీనే తలకింద పెట్టుకుని. అప్పుడు ఫర వాలేదుగా? నాకు నీమీద నమ్మకమే" అన్నాడు మాధవ్.

"సరే. నాకుపనుంది. ఎల్తాను. పడుకునే ఏళకి రండి. నేనక్కడే ఉంటాను" అని వెళ్ళి పోయాడతను. అతను వెళ్తుంటే,

"ఒరేయ్ గంగన్నా, నువ్వు నిలుచుని మాటాడుతున్నకాడ కొమ్ము కర్ర తాడుగానీ ఔపించిందా? "

"అవుపించనేదే... నేను ఆ ధ్యాసలో లేను. బాబుతో ఊసులాడుతున్నాను. ఎల్లి సూడు. ఏటైపోద్ది? "

"ఎదకడానికే పోతన్నా. అది అచ్చొచ్చిన కొమ్ముకర్ర తాడు. ఎదికి దొరికించుకోపోతే అయ్య నా బుర్ర రామకీర్తన పాడించేస్తాడు"

కొమ్ముకర్ర తాడంటే జాలరుల సామగ్రిలో ఏదో అయి ఉంటుందనుకున్నాడు మాధవ్. ఆ కుర్రాడివైపే చూడసాగాడు.

పన్నెండో పదమూడో ఉంటాయి వాడికి. బెస్తల యూనిఫామే. మొలతాడూ, పుట్ట గోచీ. నల్లని ముఖంలో తెల్లటికళ్ళు చీకటిలో ధ్రువతారల్లా మెరుస్తున్నాయి. సూదుల్లాటి ఆ కన్నులతో తీరాన్ని గాలించేస్తున్నాడు పరుగులు పెడుతూనే. కుర్రాడుకదా కాలు నేలమీద నిలవడంలేదు. తూరీగల్లే తుప్పుతు ప్పున ఎగురుతున్నట్లే వాడి పరుగు ఇసకలో. ఆపైన కొమ్ముకర్ర తాడునెలాగయినా వెదికి పట్టాలనే పట్టుదలాయె. మొత్తానికి దాన్ని దొరికించుకున్నట్లే ఉన్నాడు. వంగి ఏదో అందుకున్నాడు. అందుకుని ఆనందంగా...

"సిక్కావే సేతిలో సిలకమ్మా... నువ్వెక్క డికి నన్నొదిలీ పోలేవమ్మా" అని పాట పాడుతూ గెంతులేస్తూ మరీ వస్తున్నాడు. అసలే కుర్రతనం, ఆపైన పోయింది దొరికిం దనీ, అయ్య చేతిలో దెబ్బలు తప్పాయనీ ఆనందం. పాట రాకేంచేస్తుంది? ఆట రాకేం చేస్తుంది? ఐతే బెస్తవాడయినా వీడి నోట పల్లెపదం పలకరావడంలేదు! సినిమా పాటే వస్తోంది.

వాడిని చూస్తుంటే మాధవ్‌కేదో ఆలోచన స్ఫురించింది.

ఔను... అదే మంచిది. తక్షణావసరమూ కర్తవ్యమూ కూడా. రోము నగరంలో ఉండ దలుచుకుంటే రోమన్‌లాగే ఉండమని సూక్తి. మంచిపనికే క్షణమయినా మంచి ముహూర్తమే.

"చూడూ... నీ పేరేమిటి? "

"నాగేశ్వర్రావు"

"నాగేశ్వర్రావా? "

"ఔను. మాయమ్మ మూగమనసులు సినిమా మూడోసారొచ్చినప్పుడు మజ్జాన్న పాట జూసిరాగా ఆ రేతిరే నేను పుట్టానని అయ్యనొప్పించి నాగేశ్వర్రావని పేరెట్టింది. కానేటినాబం? " నిట్టూర్పు విడిచాడు.

"ఏమయింది? నీ పేరు చాలా బాగుంది కదా? "

"పేరయితే మంచిదే పెట్టారు. కానీ అటు అయ్యా అమ్మాకాని తక్కినోళ్ళు కానీ నాగేశ్వ ర్రావని పిలవరే నోరారా. నాగి... నాగిగా... అలా పిలుత్తారు స్వయంగా. నా కొళ్ళుమం డిపోద్ది. కోపవొచ్చేస్తుంది. కానీ ఏటిసెయ్య గల్ను? కుర్రోళ్ళకోపం ఊపుకి సేటు"

"నేను నిన్ను నాగేశ్వరరావూ అని పిలు స్తాను. నాగేశ్వర్రావూ నాకో చిన్న ఉపకారం చేసి పెడతావా? నాకాసాయం చేస్తే... ఇదిగో ఈ బాల్‌పెన్ను ఎంత బాగా రాస్తుందో... ఇదిస్తాను"

"అలాంటివి మాకెందుకు? మాకేమయినా చదువా, సంజా? అసలు మీకేటుపకారం కావాలి? తెప్ప ఎక్కించుకుని గంగలో తిప్పాలా? "

"ఊహూ... అదికాదు. ఈత నేర్పాలి"

"ఓసంతేనా. నా సేతిలో యిద్య. సేతన యినది నేర్పడానికి లంచం దీసుకుంటా నేటి? మీరిక్కడ కూసోండి ఈత గుడ్డలేసుకుని. కొమ్ముగర్ర తాడిచ్చేసి చిటికెలో తిరిగొచ్చేస్తాను" అంటూ తుర్రుమన్నాడు హుషారుగా.

ఈతకని అండర్‌వేర్‌లో మిగిలేసరికి అర్థమయింది. బెస్తలు మొలతాడుగోచీ మాత్రులై ఎందుకుంటారో. ఏ పనికి తగిన దుస్తులా వృత్తివి. నాగేశ్వర్రావొచ్చి ఈతలో ప్రాథమిక విషయాలూ మెలకువలూ బోధించాడు. వాడు తెలివయినవాడే. మాటకారే అనిపించిందా చెప్పడం ధోరణి గమనిస్తుంటే.

"సూడండి. సెరువులో ఈదినా సంద్రంలో ఈదినా నీళ్ళు మింగకూడదు. మనం నీళ్ళు మింగేమో సముద్రం మనని మింగేసి పొట్టలో పెట్టేసుకుంటుంది. అంచేత ఎదపైన ఎప్పుడూ నీటిమీదకే ఉండాలి. నీళ్ళలోకి ఉండాల్సొస్తే నోరు మూసేసుకునీ, గాలి పీల్చకుండానూ ఉండాలి. నీళ్లడుగునుండగా ముక్కుతో గాలి పీల్చేమో ఉక్కిరిబిక్కిరైపోయి గోవిందా గోవిందాయే. మరి మనమెప్పుడూ నీటిమీద తేలి ఉండాలనే ప్రయత్నించాలి. మరిసిపోకూడదు" అంతలోనే వాడికేమొచ్చిందో ముఖం అదోలా పెట్టేసి... "అసలు... ఈతకి మాటలేముండవు. ఈతంటే ఈదడమే. ఒక్కసారి నీళ్ళలో పడ్డామో మనకే తెల్సిపోతుంది. కాళ్ళూచేతులూ కొట్టుకుంటాం. సావునుంచి తప్పించుకుందుకు మార్గమదే కనిపిస్తుంది. మాటల్లో సెప్పలేం గానీ, నీళ్ళల్లోకురకండి. మిగిలింది నే జూసుకుంటాను. మీ ప్రేనానికి నా ప్రానమడ్డేస్తాను" అంటూ చటుక్కున నీళ్ళలోకి తోశాడు. అక్కడ కొంచెం లోతుగా ఉంది. నేల అందడంలేదు. ఐతే కింద్నుంచి నీటి ఒత్తిడి, పైనుంచి నా శరీరభారం. బ్యాలెన్స్ చేసుకుంటూ, కాళ్ళూచేతులూ కొట్టుకుంటూ... తేలుతూ, మునుగుతూ మధ్య మధ్య వాడిచేత రక్షింపబడుతూ, వెచ్చని నీటిలో ఓ అరగంట కొట్టుకుని మంచి థ్రిల్లనుభవించి ఒడ్డెక్కాను.

"ఇవేల్టికి సాలు. ఎక్కువయితే అలుపూ, ఆయాసమూ వస్తాయి మొదట్లో. మీక్కొంచొచ్చింది. నాల్రోజుల్లో నన్ను మించేస్తారు" అన్నాడు నాగేశ్వర్రావ్ మాధవ్‌నుత్సాహపరుస్తున్నట్లే. తనకంటే చాలా చిన్నవాడలా పెద్దవాడిలా ప్రోత్సహిస్తుంటే సరదా, ముచ్చటా వేశాయతనికి. జేబులోంచి అర్ధరూపాయి తీసిచ్చాడు. కాదనకుండా తీసుకుని,

"మరి రేపు వుంటారా? మీదీవూరు కానట్లుందే" అడిగాడు వాడు.

"రేపేకాదు ఎప్పటికీ ఇక్కడే వుంటాను. ఇవాల్టినుంచీ నాదీవూరే"

"మీ గుడిసె.. అహ మీ యిల్లెక్కడ? "

"ఈ రాత్రికి తుపాను రక్షణకేంద్రం."

గడియారం చూసి ఆశ్చర్యపోయాడు. పల్లెలో కాలం కూడా మెల్లగానే నడుస్తుందేమో జీవితంలాగ.

వాచీ ఆగిపోలేదని నిర్ధారించుకుని అతను బెస్తవాడ వేపు నడిచాడు. సాయంత్రపుటెండ కాంతిగానే తప్ప వేడిగాలేదు. ఆపైన చల్లని గాలి. జాలారిపేట గుడిసెలు ఒకదానిపక్క ఒకటి పేర్చిన గవ్వల్లా ఉన్నాయి. వాటి ముందు జాలరులు కొందరు. వలతాళ్ళు సరిచేసుకుంటూనూ, గాలాలూ బాగుచేసుకుంటూనూ ఉన్నారు.

అప్పుడే భోజనాలయ్యాయి కాబోలు ఆడవాళ్ళు వంటసామానులు కాళీ చేస్తూనూ, కడుక్కుంటూనూ, ఆడపిల్లలు తల్లికి సాయపడుతుంటే, మగపిల్లలు తండ్రికి సాయమందిస్తున్నారు.

"తెరసాపనిండా బొక్కలే. జాగ్రత్తగా మాసికవెయ్యాలి"

"చిన గాలం ములికి మొండిబారింది. అర గదియ్యి"

"దారాలు సిక్కులడ్డాయి"

"పొద్దోలిపోతోంది. తొరగా కానివ్వాలి. సురుగ్గా సేతులెయ్యండి" వీళ్లు రేపటి వేట కోసం వారి వారి పనిముట్లు బాగు చేసుకుంటున్నారు. దాదాపు ప్రతి గుడిసెలోంచి రేడియో మోగుతోంది. కొందరయితే ట్రాన్సిస్టర్‌ని పక్కన పెట్టుకుని వల బాగు చేసుకుంటున్నారు.

"చూడబోతే వీళ్ళకి రేడియో పిచ్చి ఎక్కువలాగే ఉందే!" అన్నాడు, ఆ వాడకి చెందనట్లు కనిపిస్తూ తనకి దగ్గరలో నిలుచున్న వాడిని చూస్తూ- అతను పూడిమడక నివాసని భావించి.

"పిచ్చి కాదు. రేడియో అంటే సరదాయే కాని... వాళ్ళకి అవసరం కూడా"

"అవసరమా!"

"ఊఁ... సముద్రంమీదకి కదా వీరు వెళ్లేది? అందుచేత తుఫాను రాబోతూంటే ముందుగా తెలుసుకోవాలి. వాతావరణ సూచిక వింటారు విధిగా. అయితే నిజానికి వీళ్ళు ఘనులు. రేడియో వారికంటే తుఫానెప్పుడొస్తుంది, ఎంత తీవ్రతతో వొస్తుంది, వేటకెళ్ళవచ్చా కూడదా అనేవన్నీ వీళ్ళకే బాగా తెలుస్తాయి. సముద్రం సంగతి చేపక్కాక చెట్టుకి తెలుస్తుందా? తెప్పేసుకుని గంగమీదకెళ్లే బెస్తలకి తెలిసినట్లు తుఫానుల సంగతి ముందుగా రేడియోకీ, టివీకీ తెలుస్తుందా? "

అతనితో వాదించదలుచుకోలేదు మాధవ్- అతనికి వివరించేందుకు సమయం లేకపోవడంతో.

అవతల మలిసంజ వేళవుతోంది.

సూర్యాస్తమయమవుతోంది.

నీటిలోనుంచి కదలకుండానే అతను సంధ్యావందనమొనర్చాడు.

చీకటి చిక్కబడుతూంటే అతను కదిలాడు జాలరివాడమీదుగా. పూడిమడక ఊరిలోకి. మార్గమధ్యంలో- ఆశ్చర్యపోయాడు వారిని చూసి.

వీరు వారే! మధ్యాహ్నం తీరాన తను చూసినవారే. కాని తీరులో ఎంతవార! అప్పుడేమో పుట్టగోచీలతో... ఇప్పుడేమో పంచె, అల్లిక బనీను. పంచె, చొక్కా లేదా కొందరు చొక్కాలూ, పంట్లాలూ పెళ్ళికో, ప్రయాణానికోలాగ తయారై హుషారుగా.

"ఇయాళ చేపలు శానా పడ్డాయిగా? ఎన్ని కుండల్దాగుతావో? "

"సామ్మొచ్చిన్నాడయినా సారా తాక్కపోతే బతుకెందుకు? కస్టానికి కూల్తక్కవయితే కల్లు, సరిపోతే సారా. బెమ్మాండంగా డబ్బులొస్తే బ్రేందీ. అదిరా తమ్ముడూ మన తీరీ"

"నాకు సేపలాట్టే పణ్ణేదు. ఇయేళ నా మొకానికి కల్లుపాకే"

"నాకూ అంతేరా. సారాకొట్టు అదురుస్టం రాసిపెట్టినేదు నా నొసట"

"మీరు తాగేసి మమ్మల్నొగ్గేకండి. ఇంటికట్రండి. మా సంగతి మరిసిపోక-" ఎవరో స్త్రీ.

"నాకలాంటి సోర్ధం నేదే. కట్టుకున్నదాన్ని మరిసిపోనేంత మత్తెక్కినా. నువ్వూ నాతో రారాదుటే. బార్యాభర్తలం బెమ్మాండంగా బ్రాందీ మజా సేద్దాం? "

"వొద్దులే. ఆ రోజులు ముందున్నాయి"

"కల్లుకుండట్టుకోని కొంపకొచ్చేకూడదా? మనవూఁ, పిల్లలూ అందరం కలిసే తాగొచ్చు ఈలోగా సేపలేపుడు జేసుంచుతాను, చల్లచల్లగా పుల్లపుల్లగా కల్లూ, ఏడేడిగా సేపముక్కలూ ఎంత బలేగా ఉంటదో" మరొక స్త్రీ.

"అసలు బలే ఆ తరవాతే. నువ్వూ నేనూ తాగీ తినీ సీకట్లో తెప్పోరకుబోయి సరసంలాడుకుంటే సాచ్చాత్తూ స్వరగమే"

"చెడ్డీ ఊడిపోవడం కూడా తెలవనంతగా చెడదాగేకు" ఇంకొక స్త్రీ.

"చేసుకున్నదాన్ని మరచిపోను. చెడతా

గను. తాగొచ్చి నీకు చెయ్యవలసిన సృంగారం చేస్తానుగా. చింతెట్టుకోకు- చిన్న దానా"

సరసాలు, సరాగాలు, చెణుకులు, చమత్కారాలు, అంపకాలు, ఆస్యాలు, పలకరింపులు, పులకరింపులు.

అతను ఊరిలోకి చేరుకున్నాడు. హోటల తను గిన్నెలూ అవీ కడిగేసుకుని కూర్చున్నాడు. ఆ పూటకీ అన్నప్రాప్తి లేదని సరిపెట్టుకున్నాడు మాధవ్. కాని "పాలున్నయ్ కావాలంటే" అన్నాడు హోటలువాడు. ఎదురుగా కిళ్లీ దుకాణంలో అరటిపళ్లు కొనుక్కుని- అవి తిని పాలు తాగుతూ హోటలతన్ని అడిగాడు "జాలరులందరూ తాగుతారా రోజూ? "

"ఆహాఁ డబ్బులుండాలే కాని ఎంతయినా తాగేస్తారు"

"ఎందుకూ? "

అప్పుడే అక్కడికి చేరాడు జగ్గన్న. అతను కల్లు కంపు కొడుతున్నాడు.

"ఎందుకేటి? ఏటకెళ్ళి తెడ్డేస్తూ తెప్పమీద సేపలు పట్టుకురావడం తమాసా యేటి? ఎంత కష్టమో. ఆ కష్టం మరిచిపోవాలంటే తాగక తప్పదంతే. కల్లే లేకపోతే కాయకష్టమే చెయ్యలేడెవడూ. మీరిచ్చాపోర్లు తాగరా? మేస్త్రిపనోల్లు పుచ్చుకోరా? ఆకలికి కూడూ, కష్టానికి కల్లు"

"జగ్గడితో ఎట్టుకుంటే జాములాతిరే. మాటలు తెఁవల్చడు. మాటకి మాట తెగులూ నీటికి నాచుతెగులూ అనూరికే అన్నారా? మీరు వెళ్లండి బాబూ-" అన్నాడు హోటలువాడు.

"ఎక్కడికెళ్తారు? నాతో పాట్రావాలసిందే" నవ్వి, "పదండి మాధవు బాబూ, మనింటికి పోదాం" అన్నాడు జగ్గన్న. అతన్ని కాదనడం ఇష్టంలేక కదిలాడు మాధవ్. కల్లు తాగినవాడిని సాధ్యమయినంతవరకూ కాదనకపోవడమే నయమని అతనికనిపించింది. తుఫాను రక్షణ (తుఫాన్ షెల్టర్) అని ప్రభుత్వం నిర్మించిన ఆ భవనం నిజంగా తుఫానొస్తే ఊరివారిలో పదోవంతుమందికి కూడా చాలదు. దానికి విశాలమయిన హాలుతోపాటు ముందు వరండా కూడా ఉంది. ఆ వరండాని చూపించి జగ్గన్న వెళ్ళిపోయాడు. బెస్తల ఇళ్లకది అతిదగ్గరే. వెళ్తూ జగ్గన్న ఓ హెచ్చరిక చేశాడు. "ఎందుకేనా సరే ఏ బుద్ధి పుట్టినా ఊరివేపెళ్లండి. కాని జాలరిపేటేపు మాత్రం వెళ్లకండి. ప్రమాదం"

నేనెక్కడికి వెళ్ళాలిలే అనుకుంటూ వొట్టి గచ్చుమీదే మేను వాల్చాడు మాధవ్. వాతావరణం చల్లగా ఉన్నా పగలంతా అలసి సొలసి ఉన్నా కొత్తచోటవడంవల్లనో, వొట్టి గచ్చుమీద పడుకోవడంవల్లనో అతనికి నిద్ర రావడంలేదు. సరిగ్గా ఆ సమయంలో-

"అమ్మోయ్ నాయనోయ్" ఆర్తనాదం. అతను తుళ్లిపడ్డాడు. ఎక్కడో దూరంనుంచి "నన్ను చంపేకు. వొద్దు-" స్త్రీ రోదన. ఆ కంఠం పరిచితంగా అనిపించింది. అతను ఒక్కక్షణం ఆలస్యం చేయలేదు. ఉన్నవాడు న్నఫళాన లేచాడు.

"అమ్మో... బాబో" ఎంతో బాధ నిండిన గొంతుతో.

సందేహంలేదు. ఆ కంఠం కౌసల్యది. కౌసల్యదే.

అతను ఆ కంఠం వినపడుతున్నవేపు పరుగెత్తాడు. దారీతెన్నూ కానరావడంలేదు. చీకటి కొత్తచోటు ఎరుగనితోవ. అయినా సరే అతను ఆ గొంతూ దానినుంచి విషాద బాధా వినిపిస్తున్న దిశగా వెర్రివాడిలా పరుగెడుతున్నాడు- వొంటరిగా. అతనికి తెలియదా శోకాలు జాలారిపేటనుంచని. అతనికి జ్ఞాపకం లేదు. "అటువెళ్తే ప్రమాదం" అంటూ జగ్గన్న చేసిన హెచ్చరిక. అతనికి తెలుస్తున్నదొక్కటే- తను తక్షణం అక్కడకు వెళ్ళి కౌసల్యను రక్షించాలి. అదే తన కర్తవ్యం"

చీకటిలో... సందులలో... గొందులలో పరుగెత్తి ఆ గుడిసె ముందాగాడతను.

విధాత సృష్టి యావత్తూ విచిత్రాల మయం. ఆ విచిత్రాలలో కొన్ని విషాదాలు.

మధ్యాహ్నం నూతిగట్టుదగ్గర కాసులు మాధవ్‌తో మాట్లాడుతూ ఎవరి కంటప డితే అత్యంత ప్రమాదకరమో అతని కంట నేపడింది. అతను ఆమె భర్త, అతని పేరు గరటయ్య.

ప్రేయసీ రూపవతీ ప్రియా. స్త్రీ అందంగా ఉంటేనే మగవాడు ప్రేమిస్తాడు. చక్కటి చుక్కనే మక్కువ పడి మనువాడతాడు. గర టయ్యా అంతే చేశాడు. కాసులమ్మని ఎంచు కునెంచుకుని మనసూ మోజు పడీ మరీ మనువాడాడు. అంతవరకూ బాగానే జరి గింది. చాలామంది జాలారులలా ఆమె నల్లగా ఉండదు. కొంచెం పసిమివర్ణమా మెది. అలాటి రంగూ అరుదే, అందమూ అరుదే వాళ్లలో. అందుకే అతనామెనే చేసు కోవాలని పట్టుపట్టింది. కాని మనువూ మూడునిద్దర్లూ ముగిసి కాసులు కాస్తా కట్టు కున్నదయిపోడంతో అతనిపట్ల భార్యారూప వతీ శత్రుః అన్నది నిజంకావడం మొదలు పెట్టింది. జాలరుల స్త్రీలకి ఘోషా ఉండదు. అది కుదరనిది కూడా. వాళ్లు నలుగురిలోకీ వెళ్లవలసిందే. వెళ్లి తీరవలసిందే. విధిగా. వివిధ వ్యాపకాలకీ. మగాళ్లు నీటిమీద పడితే ఆడవాళ్లు వీధిన పడక తప్పదు. నలుగురి లోనూ మసలక తప్పదు.

ఆడది...

అందమయినది...

వయసులో ఉన్నది.

ఏ మగకన్ను ఆశగా ఆమెమీద పడక మానుతుంది? అందునా ఎందరికో ఉండని గజనిమ్మపండు రంగు వొళ్లూ, బేడిస చేప ల్లాటి బెత్తె డేసి నయనాల జంటా. చూడ ముచ్చటే. చేరకోరికే.

తన పెళ్లాన్ని మరొకడు కన్నెత్తిచూడ డమా! అదే జరిగితే అతని అహాన్ని మంటేసి మలమల మాడ్చేసినట్లే. అయితే ఆమెను చూసిన వాళ్లందరితోనూ వాదులాడి నెగ్గుకురావడం సాధ్యంకాదుకదా? కుదిరేది కాదుకదా? అందుచేత... సులువేమి ఉంటే... చేతనయినదేమిటంటే... ఏ అందాన్ని చూసి పెళ్ళాడేవరకూ నిద్రపోలేదో, ఆ అందాన్నే... తన ఆడదాన్నే... చిత్తుగా కల్లో సారాయో తాగొచ్చి అత్తమీద కోపం దుత్తమీద చూపినట్లు, చావబాదీ, చితక దన్నీ, చిందులేసీ ఆపైన ఏడుస్తున్న ఆ శరీ రంమీదే కోపంలాగే కోరికా తీర్చుకుని తనివీ తాపమూ తీరగా మంచానికో, చాపకో అడ్డం పడడం. మనువయిన నాలుగోరోజే యీ అనుభవం ఎదురయింది కాసులుకి. వారా నికీ పదిరోజులకీ వాడిచేతిలో వొళ్లు హూనా మైతోంది. మనసు దుఃఖం అవుతోందప్పటి నుంచీ. మూడేళ్లనుంచీ ఈ ముచ్చటే. అయితే మున్నెన్నడూ గరటయ్య ఇంత పశు వుకాలేదు.

"సెప్పే... ఆడెవడు? " ఆమె జుత్తు అతని చేతిలో. కొప్పు మెలిదిప్పుతుంటే బాధకి తట్టుకోలేక ఆమె మెలితిరిగిపోతోంది.

"నాకు తెల్దు- నీమీదొట్టు. నూతికాడ నిలు చుంటే నీళ్ళిచ్చానంతే"

"లంజా! రంకునేర్చినదానివి బొంకునే ర్వవా? ఇయాళ నీళ్ళిచ్చావ్, రేపు నీవొళ్లే యిత్తావు" దభీమని వీపుమీద పిడిగుద్దు.

"నాకాపాడుబుద్ధి లేదు" ఏడుపులోనే అందామె. "మనోళ్లనెవరినేనా అడుగు నామీన నమ్మకంలేకపోతే"

"ఆడు మనోడు కాదుగా. పట్నవాసపోడు. సోగ్గా నేవళంగా ఉన్నాడు. అందుకే సూసీ సూడగానే మనసు పారేసుకున్నావు. మాప టేలకో మరెప్పటికో సందుచూసి ఆడికి వొళ్లూ పారేసుకుంటావు. గుడిసేటిదానా!" మరో గుద్దు. అతని నోటినుంచి వొస్తున్న సారా కంపుకంటే అసహ్యంగా ఉన్నాయతని మాటలు, తిట్లు.

"నన్ను నమ్మకపోతే, నా మాట నమ్మక పోతే నేనేటి సెయ్యగల్ను? మరిచిపో

యావా మావా? మనువుకి ముందు నన్ను ప్రాణంలో ప్రాణంలా కంటికి రెప్పలా జూసుకుంటానని బాసలాడేవు"

"నోర్ముయ్ పోకిరీముండా! సేపని పొడిచేసినట్లు పొడిసేయగల్ను. బడితుచ్చుకుని బాదీగల్ను" అంటూ కోపంగా చెయ్యెత్తాడు.

ఇంక ఆగలేకపోయాడు మాధవ్. కళ్ల ముందు జరుగుతున్న అన్యాయాన్ని చూస్తూ ఊరుకుండలేకపోయాడు. సత్యాసత్యాలు తెలిసిన అతను అకారణంగా ఆడమనిషిమీద జరుగుతున్న అత్యాచారాన్ని భరించలేక.

"ఆగు!" అని అరుస్తూ వాళ్ల మధ్యకురికాడు. ఎత్తిన గరటయ్యా చేతినట్టే పట్టుకున్నాడు ఆమె చెంపమీద పడకుండా.

"ఎవడ్రా నువ్వు?" అంటూ అటు చూశాడతను. మాధవ్‌ని చూసి మరీ ఉగ్రుడైపోయాడు పుండుమీద ఎండుకారంజల్లినట్టు.

"ఓసి రంకుదానా! పగలు చూసి రాత్తిరికే రప్పించేసుకున్నావటే! ఒరేయ్! మిండగాడా! ఎంత గుండెల్దీసిన బంటువిరా. గుడిసెకే వొచ్చేశావురా వొంటిమీద గుడ్డలేనాలేకుండా!"

"బాబూ మీరెల్లిపొండి. మీరెందుకు? ఆలుమగల తగవు మధ్య కన్యులు రాకూడదని తెలీదా? ఎల్లిపొండి" అంది కాసులు.

"నేనెల్లనిస్తానే ఇంతవరకూ వొచ్చాక? ఆడో నేనో తేల్చేస్తాను తప్ప వొల్లకోను. నిన్నూ వాడినీ ఇక్కడే నరికిపోగులెట్టకపోతే నేను మొగాణ్ణే కాను, నీ మొగుణ్నీకాను. నా పేరు గరటయ్యే కాదు, నేనొక అబ్బ అమ్మలకి పుట్టినోణ్ణీ కాను" అంటూ బీరాలూ రోషాలూ కురిపిస్తూ మూలనున్న పడవ తెడ్డందుకున్నాడు.

"పారిపొండి బాబూ. పారిపొండి. మాకిది మామూలే. నామీద్దయుంటే పారిపొండి"

మాధవ్‌కీ గత్యంతరంలేదనిపించింది.

అతనిలో అనుమానం బీజం. ఆపైన మతిపోగొట్టే సారా మైకం. తను అపరిచితుడు. అండర్‌వేర్ మాత్రమే ఉంది వొంటి మీద. ఈ వేషం గౌరవనీయమయినది కాదు. తను వారి సామ్రాజ్యంలోకి చొరబడ్డాడు. పైగా వేళకానివేళ. ఎవరేనా తననే తప్పుపడతారు. ఆలుమగల తగవులో నువ్వెందుకు తలదూర్చావ్ తగుదునంటూ అని. తనిక్కడుంటే ఆమె పరిస్థితి మరీ చెడుతుందేమో.

గరటయ్యా గాలిలోకెత్తి బలంగా అతని నెత్తిమీద దించుదామనుకున్న పడవతెడ్డు ఆశగా గురిచూసుకుంటోంది. ఇన్నాళ్లూ అది చేపరక్తపు రుచే ఎరుగును. మనిషి రక్తం రుచి ఎలాగుంటుందో? అని అది అతని బుర్ర బద్దలుకొట్టి రక్తం రుచి చూడడానికి ఆయత్తమౌతోంది.

అమానుషుడు. ఇప్పుడితని చేతిలో తను ఓడిపోవడం తథ్యం. ఎదిరించి నిలచినా తనకి కావలసింది భౌతికవిజయం కాదు. సమయం తీసుకున్నా సమగ్ర విజయం సాధించాలి. కౌసల్యకోసం.

మాధవ్ నెత్తిమీద ఆ దుడ్డుకర్రలాటి పడవతెడ్డు పడి ఫటీల్మని మాడు పగలగొట్టి రక్తమాంసాలని చిందించేదే కాని సరయిన క్షణంలో అతను తప్పుకుని, అవతలకు గెంతి, పరుగెడుతూ చీకటిలో కలసిపోయాడు. ఊపుకాసుకోలేక గరటయ్యా తూలి పడిపోయాడు నేలమీద. కాసులతనికి ఉపశమనాలు చేయసాగింది.

ఎటుపోతున్నాడో ఎరుగకుండా పరుగెత్తిన మాధవ్ తీరానికి వొచ్చాడు. చీకట్లో సముద్రం మసకమసగ్గా కనిపిస్తోంది. దానికి తోడు అతని కళ్లల్లో నీరు. అతని హృదయంనిండా ఆవేదనా, ఆర్తీ. గుండెలని పిండేస్తున్న బాధ.

కౌసల్యా! చివరికిలా అయిందా నీ జీవితం! ఆ మూర్ఖుడిని... అతని శిక్షలని ఎలా భరిస్తున్నావ్? ఎందుకు భరిస్తున్నావ్? జీవితానికర్థం కన్నీళ్లే అని ఎలా లొంగిపోతున్నావ్ అన్యాయానికి? ఆడయినా మగయినా

మనిషే. ఒక రెక్కువా లేదు మరొకరు తక్కువాలేదు. ఎవరి జీవితం మీద హక్కు వారిదే. నీ స్వేచ్ఛా సౌఖ్యాలకోసం, నీతో పాటు నేనూ కంకణం కట్టుకుంటున్నా నీ క్షణంనుంచే సముద్రం సాక్షిగా.

కౌసల్యా! జీవితానికి దాంపత్యం అవసరమే. కాని అటువంటి పరీక్షాసమయమే వొస్తే జీవితమే అన్నిటికంటే ఉన్నతమయినది. చివరకి దాంపత్యం కంటే కూడా!

అందుకే నేను నరరూపరాక్షసుడయిన నీ భర్త చేతిలో మరణించనిదీ బలికానిదీ. నిన్నతని దారుణ శిక్షలనుంచి రక్షించలేని నా అసహాయతకెంతవగచానో! నీ వొంటి మీద మరి దెబ్బపడకుండా కాపాడ లేని నా అసమర్థతకెంత సిగ్గు పడ్డానో!

ఈ సముద్రం సాక్షిగా మళ్లీ వాగ్దానం చేస్తున్నాను. నన్ను నమ్ము. కౌసల్యా! నేను పిరికివాడిలా పారిపోయి వొచ్చింది బతికియుండిన సుఖముల బడయవొచ్చునని ఎంత మాత్రమూ కాదు. ఎప్పటికేనా కాపాడాలనే. కౌసల్య పరిస్థితికి దుఃఖించి దుఃఖించి... కన్నీరు కార్చేసరికి గుండె తేలికయింది. మనసూ కలతతీరింది. కనురెప్పలు బరువెక్కి నిద్ర వొస్తున్నట్లనిపిస్తుంటే అతను బసవేపుకి నడవసాగాడు. జాలారిపేట గుడిసెల నడుమనుంచే. అప్పటి కదిగో యిదిగో అని అర్ధరాత్రవుతోంది.

"శ్రీ సూర్యనారాయణా... వేదపారాయణా...లోకరక్షాకరా... దివ్యచూడామణీ" సూర్యుడికి సుప్రభాతం చెబుతున్నాడతను తొలిసంజవేళ.



అంతలో పెద్దవాళ్లెవరో వొచ్చారు. "దండాలు బాబూ! ఇయేళ తవరికి దండమెట్టుకునేటకెళ్తాం. ఆశీర్వదించండి" అన్నారు నమస్కరిస్తూ.

"పెద్దవారు! నాకు పమస్కరించకండి"

"వయసుకేటుంది. తాడిసెట్టుగ్గూడా వొస్తది. మీరు కులానికి పెద్ద. విద్యకి పెద్ద. మాకుర్రోళ్లేటేనా అంటే పట్టించుకుని కోపగించకండి"

"అబ్బే! వాళ్లేమీ అననూలేదు. నాకు కోపమూరాలేదు" నవ్వాడు. "మరయితే ఆశీర్వదించండి. వారమౌతుంది, ఏట సరిగా పడక పొట్టలెండిపోతన్నయ్ తిండిలేకా కల్లు లేకా. మీ ఆసీర్వచనం వల్లేనా ఈ దినమయినా సేపల బుట్ట నిండితే మీ పేరు జెప్పుకుంటాం. దేవుళ్లా కొలుస్తాం. కాదనకండి. సుబంపలకండి"

మాధవ్ యిరుకులో పడ్డాడు. ఇవాళ వాళ్ల అదృష్టం బాగుండి కష్టంఫలిస్తే తనకి మెప్పే. అలాకాకపోతే ఎంత ముప్పో? మనుషుల నమ్మకాలు మహాగట్టివి.

"మీరు నన్ననవసరంగా ఎత్తుకెగరేసేస్తున్నారు"

"గంగమ్మ తల్లికెలాగూ దణ్ణం వెట్టుకుంటాం తెప్పనీట్లోకి తోసేముందు. మీరూ ఓ మంచి మాట నోట బలికితే"

"దానికేం? అలాగే" అంటూ సంస్కృతంలో ఓ శ్లోకం రాగయుక్తంగా చదివి "ఆ గంగాభవాని దయ మీమీదుండి మీకు కష్టానికి తగిన ఫలం లభించాలి" అంటూ చేయెత్తి దీవించాడు. దానితో వాళ్లెంతో పొంగిపోయారు. "దొడ్డమనసు బాబూ తమరిది. మీమాట ఏదవాక్కే. అన్నట్లు నా పేరు రాములు. ఈడు సోములు. మళ్లీ కలుస్తాం మహానుబావా!" అని వెళ్లారా అల్పా

సంతోషులు.

తీరంమీద కలకలం.

"పూనతాడేదిరోయ్? "

"ఇదుగో"

"మావా! చేమంగా ఎల్లి నాబంగా తిరిగిరా. బేగొచ్చీ ఏం? సాయింత్రం అనకాపల్లెల్లి కోక్కొనుకోవాల"

"శాన్సు కొట్టేసినావే. కొత్త కోక కొనిపించుకుంటన్నావు!"

"ఆమజ్జ్య ఆరోగ్గెం సెడితే బాపనమ్మ తల్లికి కోక సూబెడతానని మొక్కుకున్నాను. ఇంకా పనులున్నాయని అనకాపల్లిలో కోగ్గొనడం"

"పదండెహె. ఈతలికే ఆలీస్సెమయిపోయింది. పొద్దుసూడండి" ఎవరో హెచ్చరించారు.

పడవలు నీళ్లలోకి దింపి కొంచెం మేర నీటిలోకి తోసి కొన్నిటిలోకి ముగ్గురూ, కొన్నిట్లోకి నలుగురూ, ఇద్దరిద్దరూ, అలా ఎక్కి కూర్చున్నారు. ఓ చిన్న పడవలో మాత్రం ఒక్కడే బయలుదేరగా మరో పెద్ద పడవలో ఐదుగురెక్కారు.

ఇప్పుడు తీరం పెళ్ళి వారు వెళ్ళిపోయాక పందిరిలా బోసిగా, వెల్తిగా ఉంది. ఎండ చుర్రుమనడం ప్రారంభించింది.

అతను కొత్త తోవన బయలుదేరాడు. అటువేపు పొలాలున్నయ్. పాకలున్నయ్. వాటిమధ్యగా కాలిబాటమీద చూసుకుంటూ అడుగువేస్తున్నాడు దారిబాగాలేక. సరిగ్గా అప్పుడు "ఈ పాలికాని మీ సొమ్ములు మా చేలో పడి చెడదీశాయో బందెలదొడ్డిలో పెట్టడమే ఔనులే!"

అవాక్కయిపోయాడు మాధవ్.
అద్భుతంలో మునిగి మునకలయ్యాడు.

ఏమి భాష అది! అచ్చ తెనుగా? ఎంత మెచ్చదగినది! పద సంఘటనలోనే పరమ సంగీతం! మాటలపొందికలోనే మధురస్వరాలు! ఇందుకే అన్నారేమో తెనుగును ఇటాలియన్ ఆఫ్ ద యీస్ట్ అని. నిజంగా ఇటాలియన్ యింత తీయగా ఉంటుందా? సువర్ణానికి సువాసనబ్బినట్లు. సాహిత్యానికి తగిన సుస్వరం! ఏమి కంఠం! ఆత్రంగా అటు చూశాడు.

ఆరేళ్లయినా ఉంటాయో ఉండవో ఆ చిన్నారికి. చిన్నకోయిలకి. పేదకుటుంబానికి చెందినదని ఆ లాగు చెప్పకనే చెబుతుంది. కూటికి పేదకావొచ్చు కాని కంఠానికి, ఉచ్చారణకి కాదుగా.

చటుక్కున ఆమెనెత్తుకుని, ముద్దుపెట్టుకుని, "నీ పేరేమిటి? " అడిగాడు.

"సరస్వతి... దింపేండి. నేను బెద్దదాన్ని. నన్నెవరయినా ఎత్తుకుంటారా? "

"సరస్వతి. ఎంత యుక్తంగా ఉంది పేరు. సరస్వతి, వాణి, శారద, చదువుల తల్లి. సంగీతఖని" ముద్దులాడడంలో మైమరిచాడు.

"మాయమ్మ చూసిందో మిమ్మల్నీ నన్నూ కూడా తిడద్ది. దింపేండి. అదుగో మాయమ్మ" గింజుకుంది పాప. అతను దించలేదు సరస్వతిని.

అంతలో రానే వొచ్చిందామె. "ఏటి బాబూ? మా గుంటేంచేసిందేటి? "

"మీ అమ్మాయి చాలా ఘనమయిందమ్మా. మీరు చాలా అదృష్టవంతులు ఇటువంటి బిడ్డను కన్నందుకు"

"మీరనేదేటి? ముందు మా గుంటనొగ్గండి"

దింపి "చూడమ్మా. మీ పాప వల్ల ఓ మహత్కార్యమూ, బృహత్కార్యమూ జరగవలసిందుంది. అందుకు మీ సహకారం అత్యావసరం"

"మీరేటంటున్నారో నా కర్థంకావడంనేదు"

"మీ పాపది కాకలీ స్వరం"

"ఏటి? మా గుంటది కాకిగొంతా!"

"ఛఛ...కాకలీ స్వరమంటే, కోయిలంత తీయని కంఠమని. చూడమ్మా... ఈ పాప తండ్రెవరు? ఏం చేస్తారు? వివరాలు చెబితే

తరవాత వొచ్చి ఆయను కలుసుకుని మాట్లా డతాను"

"ఏటో మీ గోల... నాకేటర్థంకాదు. మా యజమాని మసేను. చేపలూ పడతాడు. చిన్న పొలంచెక్క ఎవసాయమూ జేస్తాడు. అదుగో ఆడనే మా గుడిసె. అటొచ్చి ఎవరి నడిగినా మసేనిల్లేదంటే ఎవరయినా చెబ్తారు" అంటూ పిల్లని తీసుకువెళ్లిపో యింది

మసేను... సరస్వతి...మననం చేసు కుంటూ నడిచాడు మాధవ్. అతని మెద డులో ఒక చిత్రం రూపొందుతోంది. గీతలు గీసేకొద్దీ చిత్రం స్పష్టమూ ప్రస్ఫుటమూ అయ్యేటట్లు ఆలోచించేకొద్దీ అతను తన ఊహను స్పష్టంగావించుకోగలుగుతున్నాడు.

★ ★ ★

తొమ్మిదికి మరో పావుగంట ఉండగా తుపాను రక్షణకి వొచ్చాడు ఊరు తిరిగి. జగ్గన్న చెప్పాడంటూ ఎవరో ఆమె వెచ్చజేసిన పాలు తెచ్చి ఇచ్చింది ముంతతో. భగవంతుడికి, ఆమెకీ కృతజ్ఞతలు తెలుపు కుని తీసుకున్నాడు వాటిని.

"నీ పేరేమిటమ్మా? "

"సచ్చోతి"

"డబ్బు ఎంతివ్వాలో చెబితే ఇస్తాను. రోజూ ఉదయమూ రాత్రీ కావలసుంటుంది. కాచిస్తే కృతజ్ఞుడినే. పచ్చివయినా సరిపెట్టు కుంటాను"

"అయన్నీ జగ్గన్నకి సెప్పండి. నాకు తెల్దు"

మాధవ్ పాలు తాగి గోడకి చేరబడ్డాడు చాలాసేపటికి ఆకలి ఆలోచనలకు హద్దువే సింది. అతను హోటల్‌కి నడిచాడు.

"స్వామీ" ఎవరో పిలిచారు.

"ఏం కావాలి తమకు? "

"ఇక్కడికి దగ్గరలో ఉప్పు కఠారులు న్నాయి"

"ఔను"

"ఒకవిధంగా నేను వాటికి కౌలుదారినని చెప్పుకోవొచ్చు"

"మంచిది"

"నా పేరు పెంచలయ్య. ఇక్కడ నా వ్యవ హారాలు చూసేందుకు ధర్మారావని ఓ గుమాస్తాని పెట్టాను జీతానికి. అతను బద్ధ కస్తుడే కాదు మోసగాడిలా కూడా ఉన్నాడు"

"మనుషులను చటుక్కున చెడ్డవారిగా భావించకూడదు"

"లేదులేదు. చూసీ తెలుసుకునీ చెబుతు న్నాను. అతనవినీతి పరుడే. సందేహం లేదు.

"సరే కాని నేనేం చేయగలను? "

"మీరు అప్పారావుతో మాట్లాడడం విని మీరు ధర్మమూర్తులనీ, విద్యావంతులనీ రెండు విషయాలు తెలుసుకున్నాను. అందుకే మీ సహాయం అర్థిస్తున్నాను"

"నేను చదువుకున్నవాడినే. కాని మీకేవి ధంగా సహాయపడగలను? ఉప్పు కొఠా రులూ వ్యవహారాలూ నాకేమీ తెలియవే"

"అదేమీ బ్రహ్మావిద్యకాదు. మీవంటి చురు కయినవారొక్కసారి ఫైళ్లు పుస్తకాలూ చూస్తే పట్టేస్తారు. నిజానికా పనికి మొట్టమొదటి అవసరం అర్హతా తెలివితేటలు కావు... నిజాయితీ! అక్కడొక చిన్న మోసం ఖరీదు వేలలో ఉంటుంది. నేనిక్కడుండి చూసు కోనూ లేను, కాసుకోనూలేను. మీ నిజాయితీ కోసమే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. దయచేసి అంగీకరించండి. మీ ఋణం ఉంచుకోను" చేతులు పట్టుకున్నంత పనిచేశాడు నాగభూ షణరావ్.

"నాకు ఇక్కడ బతికే దారికి సంపాదన అవసరమే స్వల్పంగా అయినా. మీరు నాకు మంచి అవకాశమే ఇస్తున్నారుకూడా. ఐతే నాకిక్కడ చేయవలసిన పనులనేకం ఉన్నాయి. వాటితో నాకాట్టే తీరిక మిగల దేమో ఉద్యోగం నిర్వహించేందుకని సందే హించవలసి వస్తోంది"

"మీరొక్కసారి నాతో వస్తే అంతా తెలు స్తుంది. ఉద్యోగంలా నియమిత వేళల్లో పని

చేయనక్కరలేదు. రోజూ ఓసారొచ్చి అవసరాన్నిబట్టి ఒకటి రెండు గంటలు అజమాయిషీ చేస్తే చాలు. గుమాస్తా ఉంటాడు పనికి. తనపైన నీతిమంతుడయిన అధికారున్నాడంటే కిందవారిలో అవినీతి, లంచగొండితనమూ తగ్గిపోతాయి. నాకు కావలసిందదే. ప్లీజ్ కాదనకండి. రండి" అంటూ మోటార్ సైకిలు తీశాడతను.

ఇదెందుకొచ్చిందో చూద్దాం. తనకి తన ప్రణాళికని ఆచరణలో పెట్టాలంటే స్వల్ప మొత్తంలో అయినా ధనం అత్యవసరం. భగవంతుడే తనకీ మార్గం చూబెడుతున్నాడేమో. డబ్బు తనంతటతానేమీ చేయలేకపోయినా ఏ పని చెయ్యాలన్నా అర్థమవసరమే మంచి పనికి కూడా. అనుకుంటూ మోటార్ సైకిలు వెనుక కూర్చున్నాడు.

రోడ్డు మీదుగా సుమారు కిలోమీటరు మలుపు తిరిగాక మరో కిలో మీటరు విశ్రాంతి గృహంలాటి భవనం. ముందూ వెనుకా విశాలమయిన వరండాలూ, మధ్యలో నాలుగుగదులూ, ఒక దానిలో కార్యాలయం, భవనం చుట్టూ పాకలు, వాటి ముందు పశువులు, తోటలో ఈ గృహసముదాయం.

ఓ గంటసేపు నాగభూషణరావు ఫైళ్లూ రికార్డులూ పుస్తకాలూ చూబిస్తూ పని వివరించారు. కష్టమనికాదు, క్లిష్టమూ కాదు అనిపించింది మాధవ్‌కి.

"సరే రేపటినుంచి ఏదో వేళలో వచ్చి పని చేస్తాను" అన్నారు.

"థాంక్స్ మరి మీరెలా వచ్చి వెళ్తారు? "

"అడ్డదారిన మైలు కూడా ఉండదు. నాకు నడక అలవాటేకాదు, సరదా కూడా"

"జీతం..."

"మీరెంతిస్తే అంతా"

"ప్రస్తుతానికి అడ్వాన్స్‌గా ఓ ఐదువందలుంచండి" అందించబోయాడు.

"అవసరమయినపుడు తీసుకుంటాను కంపెనీలోంచి. ప్రస్తుతం నాకు బసంటూ లేదు. వొస్తాను" అంటూ మెట్లు దిగేసరికి-

"ఊళ్లోకేటి తమరు బాబాగారూ? ఎండగా ఉంది. నా సైకిలు మీదొచ్చేస్తారేటి? మీకభ్యంతరం లేకపోతేనే" అంటూ చుట్టపొగ గట్టిగా లాగాడు ఓ వ్యక్తి.

"నేను బాబానికాను. నీతో రావడానికి నాకభ్యంతరమూలేదు. కాని నీచుట్టుంది చూశావ్... నిజం చెప్పొద్దూ, నాకు చాలా బాధాకరంగానే వుంది. దయచేసి ఆర్పెయ్ నీకు నామీద కనికరంవుంటే" నవ్వాడు మాధవ్.

"టౌనోళ్లు. మీకు సుట్ట సంగత్తెలీక అంటున్నారు. అసలు సుట్టంటే ఏమిటి? దాని గనతేటనేది పెత్యచ్చంగా చూసి తెలుసుకోవాలంతే... చుట్టరికం చూడాలంటే" అంటూనే చుట్టార్పేసి చెవిలో పెట్టేసుకున్నాడు.

"ఏంచెయ్యాలి? "

"మూడు గంటలకి నైట్ హౌస్‌కాడుండండి. మిమ్మల్ని నేను ఓ చోటకి తీసుకెడతాను. అక్కడ సొయంగా మీరే సూద్దురుగాని సుట్ట కదా కమామీసూ"

చుట్టకి కథ! చుట్టరికం చూడడం! వెళ్ళి తీరాల్సిందే. తెలుసుకోవలసిందే.

"నీ పేరేమిటి? "

"కడలి. జాలారిని" సైకిలు తొక్కుతూనే చెప్పాడు అతను. కడలి! చిత్రమయిన పేరు! అనుకున్నాడు మనసులో మాధవ్. పూడిమడకకు కేంద్రమనదగిన బస్‌స్టాండు దగ్గర ఆపాడు కడలి సైకిల్‌ని.

"నేను వెళ్తాను" అంటూ దిగాడు మాధవ్.

"మూడు గంటలకి లైట్ హౌస్‌కాడ. మరిసిపోకండి"

"అలాగే"

బ్రాందీషాపులాగే బడ్డీకొట్లూ బస్‌స్టాండ్ ఆవరణలోనే ఉన్నాయి. కాఫీ, టీ హోటళ్లూ అక్కడే, కిరాణా షాపూ అక్కడే. మాధవ్ గడియారం చూసుకుంటే రెండు కూడా కాలేదింకా. బసలాటి తుఫాను రక్షణ నిలయం వరండాకి వెళ్లడమా- లేక యిక్కడే గడిపి మూడుకి సరాసరి లైట్‌హౌస్‌కి వెళ్లడమా

అని ఆలోచిస్తూ, నిలుచుంటే-

నూనె బిడ్డి (అల్యూమినంతో చేసిన- పెద్ద చెంబెలాటి పాత్ర) పట్టుకు నడుస్తూ కౌసల్య! అంతే అతనికి తానేం చేస్తున్నాడో తెలియ లేదు.

"కౌసల్యా! కౌసల్యా!" అంటూ ఆమెని దాటుకుని- వెనుదిరిగి ఎదురుగా నిలబ డ్డాడు.

"మీరా! నిన్న చేసింది చాలదనేటి, నా ఎంటపడ్డారు? అయినా నేను కౌసల్యనీకాను, కైకనీకానని చెప్పలేదూ? నాపేరు కాసు లమ్మ. కాసులు" తీక్షణంగా చూసింది.

"నన్ను క్షమించు కౌసల్యా! నా మూలంగా నువ్వు నిన్న అనవసరంగా శిక్షిం చబడ్డావు. నిజంగా నాకేమీ తెలియదు. నన్ను క్షమిం చవూ?"



"ఏటో మీ మాటలు సినేమాల్లోనాగ నాకేటీ అర్థం కాడంలా. మీరెందుకు నాయెంట బడతారు? ఎల్లిపోండి. ఎవరేనా యిజ్జూసి ఆడికి మోసేస్తే మల్లీ రేతిరికి వొల్లూనం జేస్తాడు. అసలే మా మావ మంచోడు కాడు. పగప ట్టాడంటే ఆళ్లూ ఇళ్లూ అని కూడా సూడక వొళ్లు కుళ్లబొడిచీగల్డు"

"అది కాదు కౌసల్యా! నీతో చాలా మాట్లా డాలి. ఎన్నో చెప్పాలి" బతిమాలాడాడు దీనంగా.

"నేనెవరు, నువ్వెవరు? నాతో నీకు మాటలూ పాటలూ ఏటికి. ఆటలుగా ఉందే టాడదంటే? మరియాదగా మరో దారిన పోతావా, అరిచి నలుగుర్నీ కూడేసి రేవు పెట్టించీమంటావా?"

"అయ్యో కౌ...స...ల్యా!"

అప్పటికే ఆమె అతన్ని దాటి విసవిస విసురుగా నడిచి వెళ్లిపోయింది. అప్పటికతనికి తను చేసిన పొరపాటు తెలిసి వొచ్చింది. ఇప్పుడిక్కడ తనూ ఆమె మాట్లా డడం ఎవరేనా గరటయ్యకు చెబుతారా? అతను మళ్లీ ఈవాళ కూడా పశువులా కాసు లని ప్రాణాలు పోయేలా కొడతాడా? కౌస ల్యని చూసిన ఆనందంలో వొళ్లు మరచి ముందుచూపూ ఆలోచనా కోల్పోయి ఎంత తప్పు చేశాడు. ఈ రాత్రి మళ్లీ ఆమెకు నర కమేనా తన మూలాన?

హృదయం బాధతో మూలుగుతోంటే పశ్చాత్తాపంతో దహించుకుపోతోంటే తెలియ కుండానే నడచి లైట్‌హౌస్ చేరుకున్నాడు.

అక్కడంతా ఇసుక. ఒక్క చెట్టూలేదు. రవంత నీడా లేదు. ఎండగా ఉంది. ఐదు నిమిషాలు నిలు చునేసరికి ఎక్కడి నుంచి ఊడిపడ్డాడో కడలి.

"ఉన్నారుగందా! అమ్మయ్య పదండి. సుట్ట సంగతి, సుట్టరికం సంగతి చూద్దురుగాని" అంటూ తొందరపెట్టి బయలు దేరతీశాడు మాధవ్‌ని.

జాలారి పేట కొస. సముద్ర తీరమే దాదాపు. అక్కడినుంచి యిసుక మొదలౌ తుంది. అక్కడ రావిచెట్టులాటి పెను వృక్షం. దాని మొదలున అర్ధచంద్రాకారంలో గచ్చు అరుగు. చెట్టు చుట్టూ చాలామంది జనమే. నిలుచునేందుకూ కూర్చునేందుకూ కావలసినంత కాళీ జాగా. ఇప్పుడా మేరంతా జనం ఉన్నారు. జనమంటే బెస్తలే. తిన్నె మీద పిలగోడు కూర్చున్నాడు. పిలగోడంటే కులపెద్ద. జాలారి పేట పురమయితే పిల గోడు పురోహితుడూను. అతనికటూ ఇటూ ఇద్దరేసి పెద్ద మనుషులు కూర్చుని ఉన్నారు. వాళ్లెదురుగానూ జనం కంటే విడి గానూ ఇటూఅటూ రెండు పక్షాలులాగా ఒక

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. **3000/-** పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.




ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

అక్టోబర్ చతుర నవల **సాగర సంగీతం**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

పురుషుడూ అమ్మాయీ, ఓ పురుషుడూ అబ్బాయీ. ఆ ఇద్దరేసి వెనుకా ఓ స్త్రీ.

"చెప్పండి" అన్నాడు కులపెద్ద వారివేపు చూస్తూ.

"మా అబ్బాయి వాళ్లమ్మాయి మీద మనసు పడ్డాడు" అన్నాడు కుర్రాడితో ఉన్న తను.

"మా అమ్మాయికీ ఆ అబ్బాయంటే ఇష్టమే" అన్నాడాడపిల్లతో నిలుచున్నతను.

"మేం వియ్యమందుతాం" ఇద్దరు పెద్దలూ ఒకేసారన్నారు.

"మీరు వియ్యమందడం మాకూ సమ్మతమే. సంతోసమే" అన్నాడు కులపెద్ద వాళ్ల వేపూ తన పక్కనున్న పెద్ద మనుషులవేపూ చూసి తలపంకిస్తూ. అక్కడున్నవారందరూ జాలారులే. ఆ తానులో ముక్కలే. పైవాడు మాధవ్ మాత్రమే.

వాళ్లిద్దరూ అంతవరకూ రొంటినదోపుకున్న పెద్ద చుట్టలు బయటికి తీశారు. కులపెద్ద సైగతో ఆ చుట్టలొకరిదొకరు మార్చుకున్నారు.

"చుట్టలు మార్చుకున్నారు. చుట్టరికమేర్పడిపోయింది. సంబంధం కాయమయింది. తొందరలో లగ్గవెట్టించీసి ఆల్లిద్దర్నీ కలిపీండి" అన్నాడు కులపెద్ద.

"ఎల్లుండాదోరం. అమ్మవారిని తెచ్చుకునే రోజేకదా! ఆనాడే మనువుజేసేస్తాం తమరి సమచ్చంలోనే"

"సుబం" అన్నాడు అంతటితో ఆ విషయం ఐపోయిందన్నట్లు.

నమ్మలేకపోయాడు మాధవ్. సంబంధం ఖాయం అవడానికి పదినిముషాలయినా పట్టలేదు. ఎక్కడో వొకరినొకరు చూసుకుని వధూవరులు నచ్చుకున్నారు. పెద్దలకి చెప్పారు. వాళ్లు చుట్టలు మార్చుకుని సంబంధం ఖాయపరిచేసుకున్నారు. వ్యర్థమయిన పెళ్లిచూపులు లేవు. అమ్మాయి దోషిలా అందరిముందూ తలవొంచుకుని ఉండనక్కరలేదు. వెర్రి పశ్నలూ వెకిలి ప్రశ్నలూ లేవు. నసుగుడూ నాన్పుడూ లేదు. నిరాడంబరంగా సూటిగా ఎంత చక్కగా జరిగింది ప్రధానం! వెనక్కి తీసుకుందుకూ వంచించేందుకూ వీలులేకుండా పదిమంది ముందూ ఖరారు. కేవలమూ ఒక్క చుట్టమార్పుతో! చుట్టరికానికి ఆద్యమూ అర్థమూ ఇదేనా?

"ఏటి బాబూ ఆలోచిస్తన్నారు? చూశారా చుట్టెంత గొప్పదో! చుట్టరికమంటే ఏటో? మీలాటోళ్ల పెళ్లిళ్లు సిగరెట్టు మార్చుకోడంతో సంబంధాలు జరగవ్. కానిక్కడ సుట్టతోనే సంబంధం. ఏది గొప్ప? చుట్టా, సిగరెట్టా? " నవ్వుకున్నాడు కడలి.

"వీళ్ల పెళ్లిళ్లకు కట్నాలూ కానుకలూ ఉండవా? "

"కట్నమా! నామోషి. ఇచ్చినోళ్ల చెయ్యి పైనా పుచ్చుకున్నోళ్లది కిందా ఐపోదూ? అదేటి పౌరుసం? సొంతంగా సంపాదించుకోవాలిగాని. ఆడపిల్లకి సారె మాత్తరం ఎడతారు కలిగినంతలో. ఇది ఇంతా అని నిర్బంధం వుండదు. కుటుంబాలేకమై బంధుత్వాలు కలుస్తూంటే వెదవ డబ్బులతో పనేటి? "

ఈ బుద్ధి నాగరీకులకే ఉంటే కట్నాలకోసమని కళ్యాణాలు జరగని కన్యలుందురా? వరకట్న వేధింపులూ హత్యలూ ఉండేవా? ఆడపిల్ల పుట్టిందని అమ్మానాన్నా చాటుగానయినా దుఃఖించే అగత్యముండేదా? పుట్టింటి నుంచి డబ్బుతేలేదని కొత్త కోడలుని కిరసనాయిలు పోసి అంటించేడాలుండేవా? ఎన్నెన్ని అనర్థాలుండేవికావో అక్కడ కూడా ఇక్కడిలా వివాహ పద్ధతి, ఆచార సంప్రదాయాలూ ఉంటే.

"కట్న కానుకలు లేవుసరే. మరి పెళ్లెలా జరుగుతుంది? ఖర్చు."

"పెద్దల ముందూ పెద్ద మనుషుల ముందూ బంధువుల ముందూ పెళ్లి కొడుకు పెళ్లి కూతురి మెడలో తాళికట్టేస్తాడు. పురోయితుడూ, పంతులూ మంత్రాలూ ఉండవు.

మంత్రాలు మాకేటర్ధమవ్వాలా ఏడవాలా? పెళ్లికి లగ్గానికొచ్చినోళ్లకి పులుసావొణ్ణవూ... పులుసంటే సేపలు మొదలు సేతికం దినవన్నీ ఉడికించీడమే పెద్ద గంగాళంలోనో బానలోనో ఏసి. అసలు మునుపయితే పిల గాడే పిల్ల మెళ్లో తాళికట్టేవాడు. ఇప్పుడా ఆచారం మారిపోయింది. తాళెవరు కట్టినా మనువెలా జేసినా సంసారం సాగించేదాయి ద్దరేగా. తాళిదేముంది, తాడుముక్క. కావల సింది మనసులు కలవడం. ఎంత బాగుంది వీరి పెళ్లి. కట్నాలూ కానుకల బలవంతం లేదు. వ్యాపారంకాదు. ఆడంబరాలూ అనవ సర వ్యయాలూ లేవు. ఆడపిల్లల తండ్రులు పెళ్లి చెయ్యడానికి దివాలా తియ్యనక్కర్లేదు. చేశాక కూడా ఏ క్షణంలో అల్లుడు అమ్మా యిని ఏం తీసుకురమ్మని పుట్టింటి మీదకు తోలేస్తాడో అని అనుక్షణమూ భయపడి చావనక్కరలేదు.

విద్యావంతులు, నాగరికులు పురోభివృద్ధి చెందేస్తున్నామని విర్రవీగినాళ్లు ఈ విష యంలో నిజంగా ఎంత వెనక బడుతున్నారు వీరి ముందు.

"ఏటలా నిలబడిపోనారు? మీ పెళ్లిళ్లు గ్యాపకమొస్తున్నాయా? ఇప్పుడిప్పుడు ఈళ్లూ తెలివి తప్పుతున్నార్లెండి. మైకులూ, ఈడియో సినిమాలూ అంటున్నారు పెళ్లికి. టౌన్ల పెళావమూ సినీమాల మాత్యమూను. ఆ మరో ఇంత జూస్తారేటి? మాకయితే అదేటీ కాదనుకోండి, మీరెక్కడివారో గదా అంచేత మీకది ఇంతా ఇద్దూరమేగావొచ్చు"

"ఏమిటది?" కుతూహలంగా అడిగాడు మాధవ్.

"చెప్పడంకాదు. సొయంగా సూద్దురుగాని, సెకసెక అడుగియ్యండి, సమయం మించిపో కుండా"

మాటాడకుండా అతనివెంట కదిలాడు మాధవ్. పరుగులాటి అతని నడక నందు కోడం అతి కష్టంగానే ఉన్నా. రోడ్డు మీద నడకవేరూ, ఇసుకలో నడకవేరూ తను అల వాటు చేసుకోవాలి.

"మీరిక్కడ నిలుచుని జరిగేది చూడండి. ఇందాక మనం జూసింది జాలారి పేట రచ్చ బండ. ఇది వాడోళ్లది. వాళ్లలో కట్నాలున్నయ్యి. మునుపయితే ఐదొందల వరకూ ఉండేది. ఇప్పుడది మెల్లగా ఐదేలకి పాకిపోయింది"

నిజమేమరి చెడుతొందరగా ఎదిగిపో తుంది పిచ్చిమొక్కలా. మాధవ్ అటు చూశాడు.

ఇదీ రచ్చబండే. జాలర్లలో రెండు కులా లుట. ఇది రెండవ కులం వారిదేమో. వాతావరణమూ పరిసరాలూ దాదాపుగా ఇందాకటిలాగానే ఉన్నాయి. రచ్చబండ మీద పిలగోడు ప్రత్యేకంగా కూర్చున్నాడు. అతని కటూ ఇటూ పెద్దమనుషులు. ప్రేక్షకులలో పెద్దవాళ్లేకాని పిల్లలు లేరు. పెద్దలలో మాత్రం స్త్రీలూ పురుషులూ రమారమి సమానంగానే ఉన్నారు.

"కొత్వాలూ" పిలిచాడు పిలగోడు.

"అయ్" అంటూ ముందుకొచ్చాడొకడు.

"కనకం రాలేదేం? కబురు చెప్పావా?"

"ఒళ్లు బాగులేదని వొయిజ్యంకోసం అనకా పల్లెళ్లారుట"

"సరే ఉన్న వాళ్లతోనే కానిద్దాం. ఏమం టారు?" అని మిగిలిన పెద్దమనుషులవేపు చూశాడు పిలగోడు. అలాగే అన్నట్లు తలూ పారు. తిన్నెకెదురుగానూ.. మిగిలిన వారికి దూరంగా విడిగానూ ముగ్గురు నిలబడి ఉన్నారు. వారిలో ఇద్దరు పురుషులూ ఒక స్త్రీ. ఒక్కసారి వారివేపు చూసి కంఠం సవ రించుకుంటున్నట్లు సకిలించి చుట్టంటిస్తూ "బెన్నయ్యా" అని పిలిచాడు కులపెద్ద ఉరఫ్ పిలగోడు.

విడిగా నిలబడిన ఇద్దరు మగవాళ్లలోనూ ఒకడు ముందుకొచ్చాడు.

"అయ్యా"

"నీ పెండ్లాం పిర్యాద్జేసింది. నువ్వు దాన్నీ మజ్జ్యా పెతిరాత్రీ సిదగ్గొట్టేస్తున్నావట. నిజ

మేనా? "

"నిజమే పెద్దా"

"ఎందుకొ్కడుతున్నావూ? కట్టుకున్న ఆడ దాన్ని కొట్టడం తప్పుకాదూ? "

"తప్పే ఎందుకొ్కడుతున్నానో దాన్నే అడుగు పెద్దా"

"ఏమే ఏటంటావు? " స్త్రీవేపు చూశాడు పిలగోడు.

"కొట్టినోడే సెప్పాల ఎందుకొ్కట్టాడో"

శ్రోతలు ఆశ్చర్యంగా చూస్తున్నారామె వంక. ఇక్కడ మొగుడు పెళ్లాన్ని కొట్టడం సర్వసామాన్యం. తాగొచ్చి వేళకి కూడొండలేదనో, వొండిన కూర రుచిగా లేదనో ఏదో ఓ కారణంగా మగాడు ఆడదాన్ని తరచుగా కొడుతూనే ఉంటాడు. అందులో కొత్తేమీ లేదు. ఆడది ఆ దెబ్బలకి అలవాటు పడిపోతుంది సంసారంలోని చాలా విషయాలకి లాగే. మొగుడు కొడుతున్నాడని తగవు పెట్టే ఆడది అరుదు. మరేదో ఉండి ఉంటుందనుకున్నారు ప్రేక్షకులు.

"సబబే... నువ్వే చెప్పు బెన్నా!' కొట్టినోడికే తెలుస్తది కారణం"

"ఇది సత్తెవమ్మ. నాయాలి. మీ ముందే మనువాడాను. నాలుగేళ్ల కిందట మనసుపడే మనువాడాం. మీకూ యాదస్తుండే ఉంటది" అన్నాడు సదరు బెన్నయ్య.

"ఔను" అన్నట్లు తలూపాడు పిలగోడు చుట్ట ముట్టించి.

"నాలుగేళ్ల పాటు నికరంగానే కాపరం జేసింది. ఇదిగో ఈ మజ్జనే దానిబుద్ధి గడ్డి తినడం మొదలెట్టింది"

"అంటే ఏటి? ఏం జేసింది? "

"ఆ సెన్నయ్యగోణ్ణి మరిగింది"

"చెప్పుడు మాటలు వినినెట్టావా, నీకల్లతో నువ్వే జూశావా? " తలొంచుకున్నాడు బెన్నయ్య. "ఆళ్లిద్దరూ తెప్పల మాటున పకపకలూ ఇకయికలూ ఆడుతూ పొర్లుతూంటే కళ్లారా చూశాను. జుత్తట్టుకుని గుడిసెలోకి లాక్కొచ్చి సంసారికి రంకూ బొంకూ రాణించవని మంచి సెడూ బోదించాను. మనసిచ్చాను నాకన్నాయంజేయకే అని ప్రాదేయపడ్డాను. పాదాలట్టుగున్నాను. అదంటే నాకంత పేమమరి. అలా ఒకసారీ రెండుసార్లూ కాదు. ఎప్పటికప్పుడలాగే అన్నట్లు గంగిరెద్దులా తలూపడం. మళ్లీ మామూలే. ఎవ్వారం మొదటికి రావడమే. మాటలదారి మాటలదే. ఒట్టుతోసిగట్టుమీదెట్టేసి సెన్నయ్యగాడి సెంతకి పోయేది. చూస్చూసి సహనం నసించి మొన్న తాగొచ్చి సిదకబాదాను, సచ్చేమే"

"నీ పెనివిటి సెప్పింది నిజవేనా? నువ్వు తప్పుడు పనులు చేస్తన్నావనీ, అడ్డదార్లు తొక్కుతున్నావనీ ఆడనేది యెదార్ధమా, కాదా? ఏటిజెబ్తావ్? " సత్తెమమ్మకి పట్టుమని పాతికేనా వయసుంటుందో ఉండదో. మనిషి ఆరోగ్యంగా ఉంది. ఆ ఆరోగ్యమే ఆమెలో అందమేమో. మంచికోకే కట్టింది.

పసుపు రాసుకుని బొట్టు పెట్టుకున్న ఆమె నుదురు పల్లెటూరి సంక్రాంతి గడపలా ఉంది. ఆమె కళ్లల్లో జరిగినదానికి చింత ఉన్నట్లేమీ లేదు. నిర్భీతిగా అందామె- నేనతగాడినప్పుడు మనసుపడింది నిజమే. మనువాడిందీ నిజమే. నాలుగేళ్ళపాటు సంసారం జేసి చూశాక ఇతడివల్ల నాబంనేదని తేలిపోయింది"

"అంటే? నీ ఉద్దేశమేటి? ఆడు మొగాడు కాదనా? " అడిగాడు పిలగోడు. "నాకయన్నీ తెలవ్వు. ఆడదాన్ని కనుక బిడ్డలనెత్తాలని నా యావ. కడుపు పండించుకోవాలని కుతి. ఇప్పటికే నాకు పిల్లలు పుట్టకపోవడం చూసి నలుగురూ గొడ్డురాలనంటున్నారు"

మధ్యలో అడ్డం పడ్డాడు బెన్నయ్య. "మనువై మహా ఎన్నేళ్లయిపోయిందని, ముందు ముందు కూడా పిల్లలు పుట్టనే పుట్టరనేసుకోవడానికి? "

"ఐదేళ్ళవుతోందదిగో ఇదిగో అని. అయ్యే చెట్టు ఆకుల్లోనే తెలుస్తది. మొగాడికి చావ ఉంటే మనువయిన మరేటికే ఆడదాని

కడుపు పండదా, అమ్మాయి మనసు నిండదా? ఇతగాడితో ఎన్నాళ్లు కాపరం జేసినా ఆడది గొడ్డును కట్టని రాటలా బిడ్డ నెత్తకుండా బోడిగా ఉండవలసిందే. సచ్చిపో నయినా సచ్చిపోతానుగాని సంతానం కల గని సావొద్దు నాకు..."

"నేనేవయినా ముసలోడినా, ముతకో డినా? అచ్చమయిన మొగాణ్ణి. దానిమీద ప్రేమకొద్దీ పాకులాడ్డం. ఆ మాటకొస్తే పిల్లలు పుట్టకపోడానికి నాలో మగతనం లోటే అనేటి, దాన్లో ఆడతనం లేదేమో? " అన్నాడు బెన్నయ్య రోషంగా.

"అతనన్నదీ నిజమే మరి. ఇడిపోయి ఇద్ద రికిద్దరమూ వేరేవాళ్ళని జేసుకుంటే అప్పుడు బయట పడుతుందెవరి పస ఏమిటో" అంది సత్తెమమ్మ ధైర్యంగా.

"సత్తెవమ్మా? "

"అయ్యా!"

"మొగుడితో ఉంటూనే... బర్త ఇలాకాలో ఉంటూనే మరొకడితో కులికావా, లేదా? "

"కు...లి...కా...ను..."

"తప్పు కాదూ అది? "

"తప్పే... కానీ పిల్లలకోసం. అతడిలో లోపమని..."

"ఎవరిలో లోటనేది ఈశ్వరుడికే ఎరుక"

వింటున్న మాధవ్‌కి వీళ్ళకి దేముడు తప్ప శాస్త్రం (సైన్సు) గురించి పట్టింపు లేన ట్లుంది. అందుచేత శాస్త్రమాగిపోయినచోట సర్వేశ్వరుడు ప్రారంభమవుతాడన్న నానుడిని వీరు వర్తింపజేసుకోక ఆదినుంచి ఆ దేముడిమీద భారమేస్తున్నారు. ఇదీ ఒకందుకు మంచిదే అనిపించింది.

"ఎందుకయినా సరే- కట్టుకున్నోడుండగా ఒకడికి బార్యోగా ఉండగా మరొకడితో వెంప రలాడడం నేరమే"

"నేను తప్పే జేశాను" ఒప్పేసుకుంది సత్తె మమ్మ.

పిలగోడు బెన్నయ్యవేపు తిరిగాడు.

"బెన్నా! ఇది కుక్క ముట్టినకుండననీ, సెడి పోయిన సేటిదనీ తన నోటితో తనే ఒప్పేసుకుంది. మరి" నీ ఉద్దేశమేమిటన్నట్లు అర్థవంతంగా చూశాడు చుట్ట పొగ పీలుస్తూ.

"కాన్నాకదంటే మహా ఇది పెద్దయ్యా! ఇక మీదటయినా యిశ్వాసంగానూ, కుదురు గానూ కాపరం జేస్తానంటే- జరిగింది మన సులోంచి తుడిచేసుకుంటాను. మంచి మన సుతో మళ్లీ సంసారం జేసుకుంటాం"

"అతనివల్ల నాకు కడుపు పండనూ పండదు. నేను కుదురుగా ఉండనూ ఉండ లేను" తెగేసి చెప్పింది ఆ స్త్రీ. వారికి స్త్రీత్వ మంటే మాతృత్వమే అన్నట్లూ అంతకంటే ఆడబతుకుకర్థమూ, పరమార్థమూ లేనట్లే. "సెన్నయ్య నన్ను సేరదీసి మనువాడి వొడి నింపుతడు. ఆ నమ్మకం నాకుంది"

"బెన్నా! నువ్వేటి సెబుతావ్? " పిలగోడు అతన్నడిగాడు.

"అదలాగనేస్తే సెప్పడానికేటుంది, సెయ్య దానికేటుంది? సంసారం రెండెడ్ల బండి. ఒంటెద్దు నాగనేదు. ఆలూమగలూ ఏకమై తేనే అందమూ ఆనందమూ. నేనక్కర్లే దంటూ అసయ్యించుకునే ఆడదానితో నేను కాపరమూ చెయ్యలేను, నాకా కర్మాలేదు. దానిష్ట ప్రెకారమే కానీండి" అతని ముఖం నిండా విచారం, గొంతునిండా దుఃఖం, కళ్ల నిండా కన్నీళ్లు. అతి తప్పనిసరయి నిర్వే దంగా బలవంతంగా అతనలా అన్నట్లు న్నాడు. పాతివ్రత్యమంటూ పడతులకూ, సతీవ్రత్యమంటూ పురుషులకూ వేరు వేరు పేర్లు పెట్టినా స్త్రీ పురుషులను కలిపి ఉంచేది ప్రేమ. అన్యోన్యానురాగం. దానికి లింగభేదం లేదు. పావురాలవంటి పక్షులు కూడా ఈ అన్యోన్య ప్రేమకాదర్శాలే. జంటలో ఒకటి దూరమయితే రెండవది జీవితాంతమూ ఒంటరిగా ఉండిపోతుంది తప్ప మరొక దానిని చేరదీయదు. వాటి ప్రేమకంత ఏకాగ్రతా ఏకోన్ముఖతా. జతని దూరం చేసుకుంటున్న క్రౌంచ పక్షి ఆవేదన

ప్రతిబింబిస్తోంది బెన్నయ్య ముఖంలో.

"చెన్నయ్యా!" పిలిచాడు పెద్ద. సత్తెమమ్మ కుడిపక్కగానూ కొంచెం దూరంగానూ ప్యాంటూ చొక్కా వేసుకుని నిలుచున్న ముప్పయ్యేళ్ళవాడు ముందుకొచ్చాడు. "సత్తె మమ్మ చెప్పింది సత్యమే. అది బెన్నయ్య భార్యగా ఉందని తెలిసినా మనసు నిగ్రయిం చుకోలేక దానితో తెప్ప వెనకాలా, ఇసక తిప్పలమీదా దాన్ని నేనెన్నోసార్లు ప్రేమిం చాను. తప్పే మరోడి భార్యతో సుకపడడం నేరఁమే" అని తలవొంచుకున్నాడు.

"ఆ తప్పలా ఉంచు. బెన్నయ్య వొదిలే స్తాడు దాన్ని. దీన్ని నువ్వు మనువాడ తావా? నీమీద ఆశతోనూ, మోజుతోనూ నీ చెంత చేరతానంటూందిది. నాల్రోజులు కొత్తమోజు తీరిపోగానే వొగ్గేసిపోవుకద? సరిగా ఏలుకుంటావుకద? లేకపోతే ఈ ఆడ దాని బతుకు రెండింటికీ సెడ్డ రేవడవుద్ది. ఆ పాపమూ, వుసురూ నీకు తగుల్తాయి" అన్నాడు పిలగోడు.

"లేదు పెద్దా. ఎప్పటికీ దాన్ని దాని చెయ్యీ వొగ్గేను. అన్నాయం జెయ్యను" ఒక సారాగి అన్నాడు "గంటాలమ్మ సాచ్చి"

ఒక్క నిముషం ఆలోచిస్తున్నట్లు- చుట్ట పొగ గట్టిగా పీలుస్తూ మౌనంగా ఉండి, పక్కకి పెద్ద మనుషులవేపు తిరిగాడు పిల గోడు. "అణ్ణీ దాన్నీ ఓటి సేసేద్దాం. వాళ్లు కోరుకుంటున్నది అదే కాబట్టి ఇడిపోతానని ముందుకొచ్చింది సత్తెమమ్మ కనక బెన్నయ్య గాడు కట్నం తిరిగివ్వక్కర్లేదు. పోతే తప్పు సత్తెమమ్మ పరాయోడితో పడకలు జేసిందని దానికీ మరోడి ఆడదానితో కులికినందుకు చెన్నగాడికీ ఇద్దరికీ తప్పెయ్యాలి. మీ ఉద్దేశ మేమిటి? " ధర్మాసనం అలంకరించిన పిల గోడు పక్కనున్న పెద్ద మనుషులనడిగాడు. "బెన్నయ్య పెళ్ళాన్ని కొట్టడం తప్పు కదూ? " అడిగారు వాళ్ళు.

"సత్తెమమ్మకీ చెన్నయ్యకీ తప్పెయ్యడం నాయమేకదా. బెన్నయ్య సంగతే మరోసారా లోచించాలి. ఎందుకంటే మనోళ్లలో రోజూ రాత్తిరి తాగనోడుండడు. దానిమీద అప్పుడూ అప్పుడూ ఆడదాన్ని దరువెయ్యడమూ సాధా రణమే. అదీగాక ఆడది మరోడితో తిరుగు తోందని వాడు కొట్టాడు కానీ ఊసుపోక తాగొచ్చి ఉట్టినే కొట్టలేదు కొవ్వెక్కి. అంచేత ఆడికి తప్పెయ్యక్కర్లేదు" ఏమంటారన్నట్లు చూశాడు- చెప్పదలుచుకున్నది శాసిస్తున్నట్లే చెబుతూ.

"ఔను. మనఁవూ కాలమాన పరిస్థితులని బట్టి పోతూ న్యాయం జెప్పాలి"

తప్పెంత అనేదానిమీద వాళ్ళ మధ్య గుస గుసలలో సంప్రదింపులు జరిగినట్లున్నాయి. ఒకటి రెండు నిమిషాలపాటు చివరకి-

"సత్తెమమ్మా! నువ్వు తప్పు కట్టాల" అంటూ వేళ్లు చూపించాడు పిలగోడు. అది చూసి జేబులోంచి డబ్బుతీసి చెన్నయ్య సత్తె మమ్మ కందించగా ఆమె దానిని పిలగోడి పక్కనున్న పెద్దమనిషి కందించింది.

"బెన్నయ్యా! నువ్వాను. తప్పు చెల్లించాలి" అంటూ మళ్ళీ వేళ్లు చూపించాడు. అతను డబ్బు తీసి పెద్దమనిషికందించాడు. అప్పుడు-

"బెన్నయ్యా! సత్తెమమ్మా. మీరిద్దరూ ఇక యీాచ్చనం నుంచీ ఆలుమగలు కారు, ఇడి పోయారు" అని తీర్పు చెప్పి-

"బెన్నయ్యా! నువ్వటు తూరుపుగా ముకం పెట్టు. సత్తెమమ్మా, నువ్వు పడమరకేసి తిరుగు. ఆఁ. తిరిగారా? మరి మీరు వెనక్కి జూడకుండా పొండి"

నిజంగానే వాళ్లు విడిపోయారు. ఎడము ఖమూ పెడముఖమూ అయి ఒకరు తూర్పుకీ మరొకరు పశ్చిమానికి వ్యతిరేక దిశలలో!

"చెన్నయ్యా! ఇడి పోయిందనీ వొంటరిదనీ మనువాడకముందే ఇప్పటినుంచే దానితో శృంగారమాడకు. మెడలో తాళి కట్టేవరకూ ఆడదాన్ని ముట్టుకోవడం తప్పే. ముప్పే. అది మరిచిపోక. మనువయ్యేవరకూ

మడిగా ఉండు. పో" అని అతన్ని పంపించడంతో పంచాయతీ ముగింపయిపోలేదు. ఆ తతంగం అంతవరకూ చూసిన మాధవ్ అప్రతిభుడే అయ్యాడు. అతనికమితాశ్చర్యంగా ఉంది జరిగినదంతా. నిజమేనా అనిపిస్తోంది. నమ్మకం చాలడం లేదు.

కోర్టంటూ వేరే ఎక్కడో కాక ఊరిలోనే న్యాయస్థానం. కాలమూ, ఖర్చూ ప్రయాసా అవసరం లేకుండా, తమలోనివాడూ, తమ బతుకుల నెరిగినవాడూ న్యాయమూర్తి. అవసరమయితే సలహాలిచ్చేందుకూ, సంప్రదించేందుకూ పెద్దమనుషులు.

ప్లీడర్లు లేరు- పచ్చబుద్ధాలూ లేవు.

భగవద్గీతలూ ప్రమాణాలూ లేవు- అసత్యాలూ లేవు.

ఫీజులు లేవు- సాక్ష్యాల ఏర్పాట్లు లేవు.

ఖర్చులు లేవు- కాలయాపనలు లేవు.

ఇక్కడ స్త్రీకి ఎంత స్వేచ్ఛ! స్వతంత్రం! నిర్భీతి. నిర్భయం! నిర్మొహమాటం. నిశ్శంక. నిజాయితీ నిర్లజ్జ...! సత్తెమమ్మ ఎంత నిస్సంకోచంగా తన మనసుని బహిర్గతం చేసింది!

విడాకుల కేసు ఎంత సూటిగా, సరళంగా, సత్వరంగా ముగిసిందిక్కడ! మరి నాగరిక సమాజంలో? న్యాయానికి సౌలభ్యముండదు. విద్య, నాగరికం మనిషినీ మానవ జీవితాన్నీ సుఖవంతం చేయక సంక్లిష్టమే గావిస్తున్నాయా?

"చెన్నయ్యా" పిలిచాడు పిలగోడు. "మీ తగవుకని తమ సమయం పనిపాట్లూ వొదులకునొచ్చాం మేమందరం. అందుచేత ఖర్చు ఇవ్వు. సత్తెమమ్మనెలాగూ మనువాడిబోయే మగాడివి కనుక దాని తరపునా నువ్వే ఖర్చు భరించు"

చెన్నయ్య డబ్బిచ్చాడు. దానితో పిలగోడు ధర్మాసనం మీంచి లేచాడు. అతని తరువాత పెద్దమనుషులు. ఆపైన మిగిలినవారు. తగవు తెంపులయింది. మాధవ్ మాత్రం కదలలేకపోతున్నాడు. అతని మెదడులో రవీంద్రుడి పద్యం- వేర్ ద మైండీజ్ విత్‌ఔట్ ఫియర్... మెదులుతోంది. ఈ చిన్న సమాజం. బుల్లి ప్రపంచం. రవీంద్రుడి ఆదర్శ ప్రపంచంలాగే తోస్తుంది తరచి చూస్తే. ఇక్కడంతా మంచి అని కాదు. మనుషులు కనుక బలహీనతలూ ఉన్నాయి. అయినా ఇక్కడెంతో వాంఛనీయమయిన జీవన సౌలభ్యం ఉంది. జీవన సౌందర్యముంది. కౌసల్య కనుక ఇటువంటి సమాజంలో ఉండి ఉంటే-

"ఏటలా గుండిపోనారు? ఊళ్లోకి రారేటి? " అంటూ వచ్చాడు కడలి.

మాధవ్ ఆలోచనలు తెగిపోయాయర్థాంతరంగా. "ఆ... వొస్తున్నాను. అలా సముద్ర పొడ్డుకి వెళ్ళివొస్తాను" అన్నాడు.

"సామీ! నా సెయ్యి జూసి జోస్యం చెప్పరూ? అందుకే మీ ఎంటెంటా తిరుగుతున్నాను" ఎంతో ఆశగా చూశాడు ప్రాధేయపడుతూ. తనకా శాస్త్రంలో ఏమీ ప్రవేశం లేకపోయినా ఆ అమాయకత్వం చూసి- "నాకు తెలియదు" అనలేకపోయాడు. చాలామంది కాషాయవస్త్రాలు చూసేసరికి స్వామో, సన్యాసో అని వీళ్లు తప్పకుండా జ్యోతిషం చెప్పగలరనే భావిస్తారు సహజంగానే.

"నీ కుడిచెయ్యి ఇటివ్వు" అంటూ అతని చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"అయ్యగారూ! నన్నంటుకున్నారా! తానం జేయండయితే"

"ఎందుకూ? "

"మా సేపలోళ్ల జాలర్లు వాడోళ్లూ అని ఉన్నాం. అవసరమయిన పనులకి కలుస్తాం గాని ఆళ్లసేతి నీళ్లు మేం తాగం, మా సేతి నీళ్లాళ్లు తాగరు. అలాటిది పెద్ద కులంవారు తమరు నా సెయ్యందుకున్నారంటే మైలపడరూ? "

"మనిషికి నిజంగా కులమూ ఉండదు, మైలా ఉండదు. నీ చేతులు పరిశుభ్రంగానే ఉన్నాయి కనుక నాకు మలినమూ అంటలేదు, ప్రక్షాళనమూ అవసరం లేదు. ఆc నీ

చెయ్యి చూశాను. మూడే ముక్కలు. ఆపైన నువ్వడక్కూడదు, నేను చెప్పకూడదు"

"సరే సామీ!"

"నీకు ముందు ముందు చాలా మంచిరోజులున్నాయి. మంచి మనసుతో తలపెట్టే ఏ కార్యమయినా నీ చేతిలో దిగ్విజయమవుతుంది. నువ్వు అదృష్టజాతకుడివి" అని చెయ్యి వొదిలేశాడు. ఇంకా ఏదో అడుగుదామని నోరు తెరవబోయి మాధవ్ పెట్టిన ఆంక్ష గుర్తు కొచ్చిందేమో, అంతలోనే నోరు మూసేసుకున్నాడు కడలి. "మరి నాకు సెల విప్పించండి" అని వెళ్ళిపోయాడు.

నడిచి నడిచి బస చేరేసరికి-

"రండి బాబూ! రండి. తమరెక్కడికెళ్ళారో? తమ కోసమే ఎదురు చూస్తున్నాం. గుర్తుపట్టనేదేటి మమ్మల్ని? పొద్దున్న దీవించారుగదా? మీ ఆసీర్వెచనం పండి, మా ఇద్దరికీ చెరో రెండొందలూ అందాయి ఏట మా చక్కగా పడి"

"ఓహో! రాములూ, సోములూ కదూ మీరు?"

"ఆc బాగా గుర్తెట్టుకున్నారు. తమరికి మా మీదెప్పుడూ దయుండాలి. మేము మేలు చేసినవారిని మరిచే యీనులం గాము. ఏదో ఉడతాబక్తిగా" అంటూ ఆకుల పొట్లాలందించబోయారు. వాటిలో చేపలు!

"నేను చేసిన పనికి ప్రతిఫలం కోరలేదు.- అదీకాక చేపలు తినను..."

"అయ్యో! మరెలా? అయినా సేపల్దింటే తప్పేటి బాబూ? తెలవకడుగుతాను. టొమాటోని కోస్తే రసం వొస్తుంది. సేపని కోస్తే రక్తమొస్తుంది. సొరకాయకీ కండే. సేపకీ కండే. ఏదయినా తిండే. తినేదానికి పాపమేటి?" అడిగాడు రాములు- అమాయకంగానే.

"ఆహారం కోసం చేసే జీవహింస పాపమూ కాదు, నేరమూ కాదు. కానీ రాముడూ! నువ్వు కాకరకాయ తింటావా?" మెల్లగా అడిగాడు.

"చస్! చేదుచేదు. నోరంతా సెడిపోతది. కాకరకాయూసనకండి"

"నీకు కాకరకాయ ఇష్టం లేనట్లే నాకు మత్స్యమాంసాలు సహించవు. అంతే తప్ప పాపమనో మరోటనో కాదు"

"మరీ మీ రుణం తీర్సుకోడమెలాగబ్బా" తల గోక్కున్నాడు సోములు.

"మీరు నాకు రుణపడితేకదా?"

"అది కాదు బాబూ... మా బాధ మీకర్థం కాదు. ఆc... తమరు పాల్దాగుతారు కదా?"

"ఊc"

"రేతిరికి పాలు గాచి పట్టుకొస్తాం"

"ఎందుకనవసరంగా శ్రమ పడతారు"

"శ్రమేటీ నేదుకానీ బాబూ మాక్కష్టమొచ్చినప్పుడల్లా తమరి పాదాలకాడకు లగెత్తుకొస్తాం. ఆసీర్వదించాలి"

"అలాగే" నవ్వాడు మాధవ్. వాళ్ళు వెళ్లారు. అంతవరకూ వాళ్లనీ మాధవ్‌నీ గమనిస్తూ నిలుచున్న అతను- "దండాలు బాబూ" అన్నాడు.

"నమస్కారం మీరెవరు?"

"సేపలోణ్ణి. నాకు నమస్కారాలూ మీరంటూ గౌరవాలూ ఏటి బాబూ"

"ఎవరయినా మానవులే, మాననీయులే. మీ పేరు?"

"మసేను-"

"మసేను! ఆc... ఆ చిన్న కోకిల సరస్వతి తండ్రి! రండి, కూర్చోండి. నేనే మీ వద్దకు బయలుదేరాలనుకుంటున్నాను"

"స్వాములు మీరు మాకాడకి రావడమేమిటి, మమ్మల్నీ మీ కాళ్లకాడికి రమ్మని కబురంపాలిగాని బాబూ! పొద్దున్నేదో జరిగిందట. మా బొట్టు తెలియక మాట తూలిందేటి? చిన్నపిల్ల. అబమూ సుబమూ ఎరగనిది"

"లేదు మసేనూ! మాట తూలలేదు. మధుర సంగీతం కురిపించింది మాటలలో. ఆ పాపని కన్న నువ్వెంత అదృష్టవంతుడివో. మసేనూ! నువ్వు అభ్యంతరపరచక

సహకరిస్తే సరస్వతి మీ ఇంటికే కాదు. ఊరికే వన్నె తెస్తుంది. ఆమె సంగీత సరస్వతి అవుతుంది"

"సేపలోళ్లకి సంగీతమా! ఏటి బాబూ మీరనేది? మాకందనూ అందదు, పొందనూ పొందదది. పిల్లదానికి సంగీతం సెప్పించడం మా వొల్లకాదు"

"నువ్వు పైసా ఖర్చు చెయ్యక్కర్లేదు. పాపని పొద్దుటోగంటా సాయంత్రమోగంట నా వద్దకు పంపు. కాదనక. అది చాలు"

అలాటి కంఠం అతి అరుదు. కంఠానికి కులంతోనూ జాతితోనూ నిమిత్తముండదు. నువ్వనుకునే పెద్దకులాలలో కూడా మీ పాప కంఠమంత తీయనిది వినిపించదు"

మాకేటి అనిపించదే ఎప్పుడూ వింటున్నా? "

"ఎప్పుడూ వింటూండడంవల్ల మీరు ఆమె ప్రత్యేకతను గుర్తించలేకపోవడం సహజమే. తినగా తినగా గారెలు కసరెక్కవూ? "

"గారెల్సంగతి నాకు తెల్దుకానీ ఎంత తిన్నా సేపలు మాత్రం సేదెక్కవు. మేం ముప్పూటా చేపలే దింటాం. అయినా ఎప్పటికప్పుడవి రుచే బాబూ! తమరు రాముణ్ణి సోముల్నీ ఆశీర్వదిస్తే బోలెడు సేపలు పడ్తాయికదా. నన్నూ దీవించరూ? "

"రేపు మీ పాపని తీసుకొస్తావుగా, వేటకెడుతూ? వెళ్లేముందు దీవిస్తాను. నీకు నాలో అంత నమ్మకముంటే" అని మసేసుని పంపేశాడు.

"సరస్వతికి సంగీతం నేర్పిస్తారా? " అడిగాడు గంగన్న మసేసు వెళ్ళిపోగానే.

"సంగీతమే కాదు సంస్కృతమూను" నవ్వాడు మాధవ్.

"తమరికి సంస్కృతమంటే మా చెడ్డిష్టం నాగుంది" అన్నాడు.

నవ్వేసి ఊరుకున్నాడు మాధవ్. గంగన్న వెళ్ళిపోయాడు. అప్పటికి చీకటిపడబోతోంది. సముద్రానికి సంధ్యావందనానికి వెళ్తూంటే కల్లుకీ, సారాయికీ వెళ్తున్న జాలరు లెదురయ్యారు.

అప్పుడు కల్లుపాకనుంచి తిరిగొస్తున్నాడు గరటయ్య. అతని బుర్రలో రాత్రి జరిగిన సంఘటనే మళ్ళీ మళ్ళీ మెదులుతోంది. మత్తులో... కల్లు మత్తుతో ఎర్రబడిన కళ్లు కోపంతో మరింత ఎర్రబడ్డాయి. తన ఆడదానిమీద కన్నేస్తాడా, ఆడెవడో, ఎక్కణ్నుంచొచ్చినవాడో. ఈ రేతిరాడు రావాలి, తనాడి పుచ్చెగరగొట్టాలి. తను గుడిసెలోకెళ్లడు. కాసింత దూరంలో దాగుని మాటేస్తాడు. దానికోసం ఆడొచ్చాడో చచ్చాడే.

చేతికర్రని సవరించుకున్నాడు. రాకేంజేస్తాడు? కాసుల్ది తక్కువందంకాదు. మజ్జాన్నం ఆళ్లు నడిరోడ్డుమీదే ఊసులాడుకున్నారుట కూడా. చూసినోళ్లు చెప్పారు. ఏటికెళ్లి గంగమీదుండి పోయాడు కానీ ఆ సమయంలో అదీ వాడూ అలా తన కంటపడితేనా బుర్ర రామకీర్తన పాడించేసేవాడు. కనీసం కాలో సెయ్యో దీసేసేవాడక్కడే.

ఆడూ అదీ సవుద్రపొడ్డున కలుసుకుందారనుకున్నారేమో. అలాగయితే కాసులు బయటకి రావాలి. అది బయటకి రాబోయినా ఆడు లోపలికెళ్లబోయినా సచ్చారే. ఈ రేతి రాళ్లిద్దరిలో ఎవరికి సావు మూడిందో?

తనకంతా కనిపించేలాగా తనెవరి కంటాపడకుండానూ తగిన జాగా చూసుకుని గుడిసె దగ్గరలో బైఠాయించాడు. ఎదురుచూడసాగాడు. కాలం గడుస్తోంది.

★ ★ ★

ఉప్పు దొరికితే చాలు ఊరగాయ పెట్టేసే రకాలే చాలామంది. మరికొందరు ఘనులు ఉప్పు కూడా దొరక్కుండానే ఊరగాయ పెట్టేస్తారు. నరసింహ ఆ కోవవాడే. దురదృష్టవశాత్తూ అతని భార్య స్థిరం తక్కువది. ఎప్పటికప్పుడే ఎవరిమీదనో మనసయిపోవడమూ ఆ రాత్రతనికి తన శరీరంతోనూ వయసుతోనూ విందు పెట్టెయ్య

డమూ ఆమెకలవాటు. అది నరసింహకీ తెలిసినా ఆమెతో పడలేక చూసీచూడనట్లూరుకుంటాడు. మనకి కరంటులేకపోతే పక్కింటికైన్నా ఉండకూడదని కోరుకునే కోవ మనది. అలాగే నరసింహకి తన భార్య తిరుగుబోతు కనుక మరొకడి భార్య కూడా తిరుగుబోతయితే తీపి తిన్నంత సంబరం. పరస్త్రీ మీద నిందెయ్యడం ఊర గాయకంటే కూడా రుచి అతనికి. ఆ మధ్యాహ్నం మాధవ్ కాసులతో మాట్లాడ్డం సరిగ్గా నరసింహ కంటనే పడింది. వాళ్ల మాటలు వినిపించేంత దగ్గరలో లేడతను. కాని వాళ్లని చూడగలిగే దూరంలోనే ఉన్నాడు. అలాటి దృశ్యం ఒక్కటి చాలదూ మిగలిందల్లుకుపోయేందుకు? చూసింది చిగురంతయితే చిలవలూ పలవలూ చేర్చి, గోరంతను కొండంత జేసి గరటయ్యా చెవిలో నాగస్వరమే ఊదాడు. నానా కూతలే కూశాడు. ప్రపంచంలో అన్నిటి కంటే అతిసులభమయినది భార్యమీద భర్తకు అనుమానం కలిగించడం. ఒక్క మాట చాలు. ఒక్క విషపు నవ్వు చాలు. నిప్పంటుకుందే. అసలే ముందే గరటయ్యా మనసులో అనుమానాగ్ని ఉంది. ఆపైన కడవలకొద్దీ ఆజ్యం నరసింహ పోశాడాయె. అందుకే అతనలా రాత్రంతా కాపలా కాశాడు. మాధవ్‌నో కాసులునో ఎవరు ముందు దొరికితే వాళ్లని వేటూ కాటూ వేసేసేందుకు.

భుక్తాయాసంతో... పాలూ పళ్లూ ఎక్కించిన పొట్టబరువుతో గాఢనిద్రలోకి ఇట్టే జారిపోయిన మాధవ్ కాల గమనమే మరిచాడు. అయితే అంత సుషుప్తిలోనూ అంతరాత్మ మారుమూలలలో అదురే.

మధ్యాహ్నం తను కౌసల్యతో మాట్లాడడం ఆమె భర్తకి తెలిసి ఈ రాత్రి కూడా అతనామెను దారుణంగా హింసిస్తాడా? తను పశ్చాత్తాపమూ దుఃఖమూ పడవలసివొచ్చేలా ఏ అర్ధరాత్రో కౌసల్య బాధామయ ఆక్రందనలు వినిపిస్తాయా? తన పొరపాటుకి ఆమె నిన్నటిలా యివాళ కూడా అతని చేతిలో దెబ్బలు తిని ఏడుస్తుందా? ఎప్పుడే క్షణంలో వినవస్తుందో ఆమె ఆర్తనాదం అన్న బెదురూ భయమూతోనే నిద్రపోవడంతో అతనికా ఆర్తనాదం వినిపించినట్లే అయింది. త్రుళ్లిపడి లేచాడు. అప్రయత్నంగా చేతిగడియారం మీద దృష్టి పడేసరికి ఐదుకయిదు నిముషాలే తక్కువ. అతను హడావిడిగా సముద్రానికి బయలుదేరాడు. అడ్డదారిన... గరటయ్యా గుడిసెమీంచి కాకుండా మరోదారిన.

అప్పటికింకా గరటయ్యా అలాగే పడున్నాడు. రాత్రంతా పట్టుదలగా పొంచిచూడాలనే అనుకున్నాడు కానీ కడుపులో కల్లు బరువూ... వొంట్లో మత్తూ, ఆ పైన చల్ల గాలీ, నిశ్శబ్దపురాత్రీ, వొంటరితనమూ, ఒకదానికొకటి తోడూ జోడై ఇబ్బడిముబ్బడిగా అతని కనురెప్పలని మూసేసి, గాఢనిద్రలోకి తోసి వొదిలేశాయి. అంతే ఇక అతను వొళ్లెరగడు. నిద్ర కొన్ని ప్రమాదాలనాహ్వానిస్తే, మరికొన్నిటిని నివారిస్తుంది, కొన్నివేళల.

"ఈడ పడుకున్నావేటి, కట్టుకున్న ఆడదీ, కట్టుకున్న గుడిసే లేనట్లు, లెగులెగు ఏటికేళయింది" అంటూ కాసులు గరటయ్యాని లేపుతున్నప్పటికి

కాలకృత్యాలూ, సంధ్యావందనాది అనుష్ఠానాలూ ముగించుకుని, మసక వెలుతురులోనే మహా ఆత్రంగా కన్నుల వలలు వేసి తీరాన్ని గాలిస్తున్నాడు మాధవ్. ముఖం తొలుచుకున్నా రెప్పలమీంచి నిద్రచాయలు వీడిపోలేదుకాబోలు, కళ్లు నులుముకుంటూ, వలలూ, వేట సామానూ పట్టుకుని ఒకరూ ఒకరూ బెస్తలు వొస్తున్నారు. కానీ... మాధవ్ దృష్టి గాలానికి వలసినవారు తగలకపోడంతో అతనటే చూడసాగాడు. అతని గుండె ఆత్రంగా కొట్టుకుంటూ వేగం పెంచుకుంటోంది క్షణక్షణమూ గడుస్తున్నకొద్దీ. నిముషనిముషమూ గడుస్తున్నకొద్దీ ఆశ

అడుగంటుతూ నిరాశ పెరిగిపోతోంది. నిరాశాభారంతో అతను పూర్తిగా క్రుంగిపోయేంతలో అటు సూర్యుడు సముద్రంలోంచీ, యిటు మసేను గుడిసెలచాటునుంచీ ఊడి పడ్డారు. అతని ఆనందానికి హద్దేలేకపోయింది సముద్రానికిలాగే.

"రండి..." అంటూ ఎదురెళ్ళి మరీ ఆహ్వానించాడు. "రామ్మా సరస్వతీ! రా...రా... మా బంగారు కొండవి. చిన్నారి కోయిలవి. చిట్టిపాపవి"

"అయ్యా" బిక్కచచ్చిపోయి బావురుమంది పాప భయపడ్డట్లు.

"భయంలేదమ్మా... ఇదుగో... ఈ చాకొలెట్ తిను. ఎంత బాగుంటుందో!" అని మాధవ్ ఆమెతో చెలిమిచేసుకునే యత్నంలో ఉంటే,

"మాస్టరుగారేనే... మరేటీ బయంనేదు. ఆరు సెప్పినట్లిని, ఉండమన్నంత సేపు స్థిరంగా కూచుని, పొమ్మన్నప్పుడింటికి పో" అని భుజాన వలలూ గాలాలతో పడవల వేపు సాగిపోయాడు మసేను.

"నీకేమీ ఫరవాలేదమ్మా, నేను నిన్నేమీ అనను. ఎందుకంటాను? నువ్వంటే నాకు ముద్దు. నువ్వు రామచిలుకవీ, రసకోకిలవీ, ఛాకొలెట్ బాగుందా? నీ గొంతంత తీయగా ఉందా? చూడు చిన్నారీ... స్నానం చేసి రావూ? మా తల్లివి కదూ... బుజ్జివి కదూ, నీకు మళ్ళీ బిళ్లలిస్తాగా?"

ఎలాగైతేనేం ఆమెచేత స్నానం చేయించి, తనే తువ్వాలుతో తలతుడిచి, యిసుకలో తూర్పుముఖంగా ఆమెని కూర్చోబెట్టి ఎదురుగా కూర్చున్నాడు తను.

"నేను చెప్పినట్లు అను ఏం? ఎంత బాగా అంటావో మరి"

అలాగే అన్నట్లు తలూపింది సరస్వతి.

"ఓం..." "కళ్లుమూసుకుని చేతులు రెండూ జోడించి దణ్ణంపెడుతూ అనాలి"

"ఓం" అతను చెప్పినట్లే కళ్లు మూసుకుని నమస్కరిస్తూ అంది.

అవతల బెస్తలు జీవన సంగ్రామం ప్రారంభిస్తున్న సందడి.

ఇవతల సన్నగా సముద్రపు హోరు.

రెండింటి నేపథ్యంలోనూ ఈ గురు శిష్యులాంద్ర ప్రణవనాదాలాపనలు.

అన్న ప్రాశన నాడే ఆవకాయ కూడదన్నట్లు ఓ పావుగంట ఓంకారాన్ని వివిధ స్వరాలలో పలికించి పాఠం ఆపాడు.

"ఐపోనాదా? బిళ్లలిస్తామన్నారు?" అడిగింది సరస్వతి.

"ఇదిగో" అంటూ రెండు బిళ్లలిచ్చి "పాఠం నీకు నచ్చిందా? రోజూ వొస్తావా?" అడిగాడు.

"ఓ" కళ్లెగరేస్తూ ఉత్సాహంగా అంది. "రోజూ బిళ్లలిస్తారామరి?"

"నువ్వు మంచి పాపవి. చూడూ... నువ్వు రోజూ వొస్తే నీకేం కావాలంటే అది కొనిస్తాను"

"పువ్వుల గౌను"

"అలాగే. బాగా నేర్చుకుంటూ రోజూ వొస్తే... గౌను కొంటాను. రేపొస్తావుగా. చాక్‌లెట్లిస్తాను"

"రేపు నాకు నువ్వుండలు కావాలి"

"తప్పకుండా" అంటూ నవ్వి- ఆమె నెత్తుకోబోయాడు.

"నిన్నింటి దగ్గరకి దిగబెడతాను"

"నేన్నడవగలను" అంటూ అతనికందకుండా జరిగి "నాకిల్లు తెలుసుగా" అంటూ తూనీగలా ఎగిరిపోయింది పరుగుతో.

ఈ చిన్న విజయానికే అతనికి కొండెక్కినంత సంబరమయింది. అతను పంచెలోంచి లాల్చీ పైజమాలలోకి మారి బసకి వెళ్ళి పంచె ఆరబెట్టుకుని హోటలుకి నడిచాడు. అతన్ని చూస్తూనే అప్పారావు "రండి" అంటూ ఆహ్వానించి వేడివేడి పాలు అందించాడు గ్లాసుతో. తాగి డబ్బులివ్వబోతే "చిల్లరగానూ రోజూనూ వొద్దు. ఒక్కసారే తీసుకుంటాను. మీరెలాగూ రోజూ మధ్యాన్నం భోజనం చేస్తారుగా. అదీ యిదీ కలిపి పద్దురాసుకుంటాను. నెలయ్యాక

యిద్దురుగాని" అనేశాడు. సరేనంటూ సాల్ట్ కంపెనీకి బయలుదేరాడు. అప్పటికి ఎనిమిది దాటి అరగంటే అయినా ఎండ తీవ్రంగానే ఉంది వేసవికాలం కావడంవలన.

"అయ్యో! నడిచివొచ్చారా!" అన్నాడు నాగ భూషణం చెమటలు తుడుచుకుంటూ వొచ్చిన మాధవ్‌ని చూసి. "ఆ కాఫీ హోటలప్పారావుతో నేను చెప్పానని చెప్పండి. అద్దెసైకిలేర్పాటు చేస్తాడు. అద్దె కంపెనీ ఖర్చులోరాయండి ఫరవాలేదు"

"ఎందుకులెండి. వాకింగీజ్ కింగాఫ్ ఎక్స్‌ర్‌సయిజెస్... అన్నారు. నడక ఆరోగ్యానికి అతి మంచిది. ఆ సిన్న చాలా మట్టుకు పని నేర్పారు. మిగిలింది యివాళ చెప్తే రేపటి నుంచి నేను చేసుకుపోగలను"

లాభనష్టాల కారణాలన్నీ ఆయన వివరించాక...

"నాగభూషణంగారూ! ఫరవాలేదుగానీ మీరు నిశ్చింతగా ఉండండి. ఇక్కడ నేనుండగా తెలియక నష్టం రావాలేమోకాని నాకు తెలిసి వొక్క పైసా కూడా కంపెనీకి నష్టం రానివ్వను. ఇది నా వాగ్దానమూ ప్రమాణమూ కూడా. అన్నట్లు నాకనకాపల్లిలో చిన్న పనుంది"

"నాతో రండి బండిమీద"

"థాంక్స్... ఈలోగా నేను భోజనం చేసి వొస్తాను"

"ఈ ఎండలో అంతదూరం వెళ్ళి రావడమెందుకూ? నాతోనే చేద్దురుగాని పదండి"

భోజనమయ్యాక పావుగంట విశ్రాంతి అనంతరం ప్రయాణం. నెహ్రూ చౌకులో మాధవ్‌ని దింపేసి తను ఎవరినో కలవాలని వెళ్ళిపోయాడు నాగభూషణం.

ముందుగా మాధవ్ పోస్టాఫీసుకి నడిచి కొంచెం కార్డులూ కవర్లూ కొని ఎలక్ట్రికల్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ షాపుకి వొచ్చాడు.

"అతి తక్కువ ఖరీదులో ఓ టేప్‌రికార్డరు కావాలి"

"ఇప్పుడు టేప్‌రికార్డర్ల ఖరీదు తగ్గిపోనే తగ్గిపోయింది. ఇది చూడండి, నాలుగు వందలు" అంటూ తీసి చూపించాడు. బాగానే ఉందనిపించింది.

"సూర్యస్తుతి, శివస్తుతి, వెంకటేశ్వర సుప్రభాతం, హనుమాన్ చాలీసా, మంత్రపుష్పం, నమకం, చమకం, గీత గోవిందం, క్యాసెట్లు"

"ఈ నాలుగు క్యాసెట్లలోనూ మీరు చెప్పినవన్నీ ఉన్నాయి. ఇంకేం కావాలి? " అడిగాడు షాపువాడు.

"సంస్కృతం నేర్చుకుందుకు, సంస్కృత ప్రచార సమితి వారు, తిరుపతి దేవస్థానం వారు, క్యాసెట్లు తయారుచేశారు"

"ఔను, ఉండాలెక్కడో, ఎవరూ అడగలేదింతవరకూ, ఏమూలనున్నాయో వెతకాలి"

"దయచేసి వెతకండి. అవి నాకు చాలా అవసరం"

"దేముడు దయచూశాడు. ఇవిగో మీరడిగిన క్యాసెట్లు"

"బిల్లు రాయండి. రికార్డర్‌లో కాని క్యాసెట్లలోకాని ఏమయినా లోపాలుంటే"

"అవసరాన్నిబట్టి సరిచేస్తాం. లేదా సొమ్ము వాపస్. గ్యారంటీ"

ఆరువందలయింది అన్నిటికీ కలిపి. డబ్బు చెల్లించి ఆ పెద్దప్యాకెట్‌ని సంచీలో పెట్టి బస్‌స్టాండ్‌కి చేరుకున్నాడు. అదృష్టం బాగుండి వెంటనే బస్సు దొరికింది. కూర్చుందుకు సీటూ దొరికింది. అనకాపల్లి పొలిమేరలు. బైపాస్ రోడ్డు దాటాక రోడ్డుకటూ ఇటూ చూస్తుంటే అతనికనుమానం కలిగి పక్కవాడినడిగాడు.

"ఇక్కడ భూములు చాలా సారవంతమయినవిలా ఉన్నాయే!"

"చెరకు పండే పొలాలు. చవగ్గా వొస్తయ్యా? ఎకరం లక్ష... కొన్నింకా పైనే పలకొచ్చు"

"ఓహో!" అని ఊరుకున్నాడతను.

బస్ దిగుతూనే బసకు చేరాడు. గంగన్న లేడు. అటువంటి సమయంలో ఉండడని మరిచిపోయినందుకు చింతిస్తూ మళ్ళీ వెనక్కి తిరిగాడు.

ఈ టేప్‌రికార్డరూ... కాసెట్లూ, బ్యాట రీలూ, వీటికోసమేనా తాళమేసుకోగలిగే ఓ గది అవసరం. ఇలాటివి లేకపోతే వరండాలోనూ, సముద్రపొద్దునా, రోడ్డుమీదా ఎలాగేనా బతికెయ్యొచ్చు. కౌపీన సంరక్షణార్థం అయం పటాటోపః అనుకుంటూ హోటలుకి చేరాడు.

"భోజనానికి రాలేదేం? " అభిమానంగా అడిగాడప్పారావ్.

"పనిమీద అనకాపల్లి వెళ్లాను అప్పారావ్! మీక్కొంచెం శ్రమయివ్వవలసివొస్తుంది. ఈ పాకెట్లని మీ ఇంట్లో ఉంచాలి. ఔనూ... నాకో చిన్నగది ఎంత చిన్నదయినా ఫరవాలేదు. చూసిపెట్టరూ? నా సంచీ, కొంచెం సామానూ ఉంచుకుందుకంతే చాలు"

"మా ఇంట్లోనే ఇవ్వగలను"

"నేను తెల్లవారుజామున వొచ్చి తీసుకుంటూ, మళ్ళీ పెడుతూ.. చీటికీ మాటికీ మిమ్మల్ని శ్రమపెడుతుండాలని సందేహిస్తున్నాను"

"మీకు నేనివ్వబోయే శ్రమముందిది చాలా తక్కువే. అయినా ఓ గది కేటాయింపుగా ఉంది. చిన్నగది. ఎవరి ప్రమేయమూ లేకుండానే ఎప్పుడు పడితే అప్పుడు ఎన్నిసార్లయినా వొచ్చిపోవొచ్చు ఇబ్బందుండదు"

"అద్దె"

"తరువాత చూద్దాంలెండి పదండి గది చూద్దురుగాని"

"భేషుగ్గా ఉంది" అని పాకట్లుపెట్టి, తాళం వేసి బయటకొచ్చాడు. అప్పటికి జాలర్లు వేట నుంచి తిరిగొచ్చేవేళ దాటిపోయింది. బస్‌స్టాండ్ నుంచి నడుస్తుంటే.

ఓ పెద్ద గొయ్యి. పైన అడ్డంగా పెద్ద మాను. గోతిలో ఒకరిద్దరూ, పైన ఒకరిద్దరూ రంపం. పెద్ద రంపంపెట్టి మానుని కోస్తున్నారు. చిత్రంగా అనిపిస్తే చూస్తూ ఆగిపోయాడు.

"దండాలు సామీ!"

"నువ్వా సోములూ!"

"ఏటి జూస్తన్నరు? కలప కోత? "

"మరే... ఇదేమిటి? వీళ్లేంచేస్తున్నారూ? "

"అక్కడయిదుగురో ఆరుగురో కాసుక్కూసున్నారు. మిమ్మల్నీడికి పట్టుకుని తీసుకరమ్మన్నారు"

"ఎందుకూ? " ఆశ్చర్యంగా చూశాడు మాధవ్.

"నాకేటీ తెల్దు. ఆల్లిందుకూ అన్జెప్పలేదు. కాని వాటం సూడబోతే మీ మీద్దండయాత్ర జేసేటట్లే ఉన్నారు"

"నామీద దండయాత్రా!" నివ్వెరపోయాడు మాధవ్. అతనికంతా అయోమయంగా ఉంది. తానెవరికేం అపకారం చేశాడూ? తనమీద ఎవరయినా దండయాత్రకి రావలసిన పరిస్థితేమొచ్చిందీ? ఆలోచిస్తూనే అతనితో నడవసాగాడు

"అదుగో... ఆళ్లే"

అటు చూశాడు మాధవ్. ఐదారుగురు బెస్తలు. వాళ్లకి కొంచెందూరంలో ఇసుకలో ఆడుకుంటున్న పిల్లలు కిందనే చేపతోకో, మాంసఖండమో ఉంది కాబోలు కాకులూ గెద్దలూ పోట్లాడుకుంటూ. ఇసుకలో నల్లగానూ నీళ్లు కారుతూనూ పడవలు.

మాధవ్‌ని చూస్తూనే వాళ్లు పరుగులాటి నడకతో ఎదురొచ్చారు. వాళ్లు వొస్తూనే "మీకిదేవీ న్యాయంగా లేదు బాబూ" అన్నారు కొంచెం కోపంగానూ బాధపడ్డట్లూ చూస్తూ.

"నేనేం అన్యాయం చేశాను? ఎవరికన్యాయం చేశాను? "

"ఆ మసేనుగోడి గొప్పేటి, మా తక్కువేటి? ఆడి పిలదాని ఎక్కువేటి, మా పిలకాయల తక్కువేటి? ఆ సరస్వతినెత్తుక్కుని ముద్దాడారుట. చాకులెట్లిచ్చారట, బిళ్లలిచ్చారుట. సంగీతం నేర్పుతారట. మా పిల్లలు మీకు ముద్దురాలేదా? దాన్ది బమిడి ముక్కూ మా పిల్లలవి సీవిడిముక్కులూనా? అది చలాకీదీ మావోళ్లు చవటలూనా"

ఫక్కున నవ్వేశాడు మాధవ్ "అదా! ఇంకా

మీ కోపందేనికో అనుకున్నాను"

"మా పిల్లలతో అదేటి సెప్పి ఊరించిందో, ఉడికించిందో, మేం ఏటినుంచి గుడిసెలకెళ్లే సరికి మా బొట్టిలొకటే రాగాలూ రబసా పిల్లలూ దేవుడూ అన్నారు. అందరు దేవుళ్లూ ఒకటే. అందరు పిల్లల్నీ వొక్కనాగే సూడాలి. అదే పెద్దరికం పెద్దతనం"

"నిజమే... మీ మాటలూ కోపమూ సహజమే. న్యాయమే. రేపట్నుంచి మీ పిల్లల్నీ పంపండి. మీతో తీసుకురండి. అందరికీ చెబుతాను. నేను కాదంటేగా మీరు కోప్పడడానికి? మీ పిల్లలకే కాదు, యింకా ఎందరు పిల్లలకేనా స్వాగతమే సుస్వాగతమే" ఆనందం పట్టలేకపోయాడు.

"మేం నెలకింతని బడికిలాగ డబ్బులు కట్టాలా? "

"అలాటిదేమీ అక్కర్లేదు. ఇది బడికాదు. డబ్బు చెల్లించనక్కర్లేదు"

"లాభంలేనిదే సెట్టి వరదలోకి పోడని సామెత. వుట్టిపున్నానికి మీరు మా పిల్లలకి సంగీతమెందుకు నేర్పాలి? "

"నేను నేర్పదలుచుకున్నది సంగీతం కాకపోవచ్చు ఊరికే ఎందుకు నేర్పాలంటే నాకదో తృప్తి, కాలక్షేపం. నాకీతరాదని నేర్పమంటే నిన్ననొక కుర్రాడు ఊరికే నేర్పాడు. డబ్బులిస్తానన్నా తీసుకోలేదు"

"ఈత నేర్పినందుకు డబ్బులేటి? "

"మీకీత ఎలాగో నాకు నా విద్య అలాగ. విద్యాదానం చేసి పుణ్యం సంపాదించుకుందామని నా తాపత్రయం" చిరునవ్వు నవ్వాడు. "ఏరీ మీ పిల్లలు? "

"అదుగో!... అక్కడాడుకుంటున్నారాళ్లే"

పిలిచి పేర్లడిగి తనని పరిచయం చేసుకుని తియ్యగా మాట్లాడి తెల్లవారకుండానే వొస్తామని వాళ్లనుంచీ, తీసుకొస్తామని వాళ్ల పెద్దలనుంచీ మాటతీసుకున్నాడు. అప్పుడు వాళ్లు వెళ్లారు. అతనికెంతో సంతోషంగా ఉంది. అప్పుడే ఆరుగురు పాపలయ్యారు. ఈ ఆలంబనలో తాను తన ధ్యేయం తప్పక సాధించి తీరుతాడు. అంతా ఆ భగవంతుని అనుగ్రహం అనుకుంటూ నీటివొడ్డున నిలుచున్నాడు.

అప్పుడొచ్చాడు నాగేశ్వర్రావ్. "ఏటి సామీ అలా నిలబడిపోయారు? నీళ్లల్లోకి దిగండి. ఈత నేర్పుతాను"

అతనికి జ్ఞాపకమొచ్చింది తను నేర్చుకోవలసిన పాఠం "మీకోసమే ఎదురుచూస్తున్నాను గురువుగారూ!" అంటూ నవ్వాడు.

"నీటొడ్డున్నిలుచుంటే ఈతొస్తదా? దిగితే కాని లోతూ తెలియదు, యీతారాదు, రండి రండి" అంటూ నీళ్లల్లోకురికాడు. మాధవ్ బట్టలు మార్చి అతన్ననుసరించాడు. ఇవాళ అతను కొంచెం బాగానే, నిన్నటి కంటె నయంగానే యీదుతున్నాడు. పీకలలోతు వరకూ వెళ్లాడు ధైర్యంగా. నాగేశ్వర్రావ్ సాయం ఎక్కువ సార్లు తీసుకోకుండానే యీదాడు. అరగంటయ్యేక వొడ్డుకి చేరారిద్దరూ.

"గురువుగారూ! నాకు బాగానే వొస్తుందా యీత? "

"ఫర్లేదు. బాగానే యీతకొడుతున్నారు. నేను మీకు గురువు నేటి? ఎవరేనా వింటే నవ్వుతారు. అలాగనకండి"

నవ్వి- "నాకు బాగా యీతొచ్చినట్లెప్పుడు లెక్క? " అడిగాడు.

"అదుగో... అటు సూడండి. పేద్ద బండ. చిన్నకొండలా అగుపిస్తోంది గదా. దాన్ని ఏనుగురాళ్లంటార్లెండి. ఈదుకునెల్లి ఇక్కణ్నుంచీదుకెళ్ళి ఆ బండని తాకి తిరిగి రావాల. అప్పుడీతొచ్చినట్లు"

ఏనుగురాళ్లనబడే ఆ చిరుకొండ సముద్రంలో వొడ్డునుంచి రెండుమూడు ఫర్లాంగులుంటుందేమో. నేలమీదలా నీటిమీద దూరాన్నంచనా వేయడం కష్టం.

"అన్నట్లు మీరు పొగరుమెట్ట చూసేరా? " అడిగాడు నాగేశ్వర్రావ్.

"పొగరు మెట్టా! ఏమిటది? ఎక్కడుంది? "

"లైటవుసుదాటుకునెళ్లాలి. రెండు కొండల నడుమ ఉప్పుటేరు. బీసీ ఎంత బాగుంటుందో! మీరిక్కడుండేవారేగా. ఎప్పుడేనా తీసికెల్తాన్లెండి. పొగరు మెట్ట దగ్గరా యీదులాడొచ్చు. సీకటడుతోంది. మర్నాకు సెలవిప్పిత్తారా? "

"రేపు కనిపిస్తావ్‌గా. ఓ తమాషా చూపిస్తాను"

"ఏటో ఆ సిత్రం? " ఆత్రంగా అడిగాడు.

"విచిత్రమే మరి. రేపే... ఇప్పుడు చెప్పను" నవ్వాడు మాధవ్.

"మీ దయ" అని వెళ్ళిపోయాడు వాడు. ఎలాగూ వేళయిందని అతను సంధ్యావందన కార్యక్రమం నిర్వర్తించుకుని బసవేపు నడవసాగాడిసుకలో.

అది సంధ్యావందనానికే కాదు, సారా కొట్టుకీ సమయమే అని గుర్తుచేస్తున్నట్లు, ఓ చిన్న గుంపు కూడా నడుస్తోంది. ఆ కల్లు గుంపు చేసే కబుర్లగోల వొద్దన్నా అతని చెవిన పడుతూనే ఉంది. ఆ పలకరింపులు, వాళ్ల బతుకులోతులని బయటపెట్టే మాటలలా అనిపించి అతను వారి వెనుకే నడుస్తూ వినసాగాడు.

"రొయ్యలడ్డట్టున్నాయొరే? "

"సిన్న రొయ్యలు. పాతికమ్మితే యిరవయొచ్చింది. మరికొన్ని మరీసిన్న వుండిపోతే గోంగూరేసి పులుసుకాచి మన్నానీరేతిరికి"

"అదురుష్టమంతుడివి. సారా తాగాక రొయ్యల పులుసంటే సామాన్యం కాదు"

"అక్కడికి నీకేటి తక్కువయిందీ? "

"నాకు నక్కునేదురా. నా దశ తిరగడం నేదు. రొయ్యలకోసం వొల విసిరితే ముళ్లపీతలు వల కొరికేశాయన్నట్లుందెవ్వారం. ఏం బతుకో ఏటో. కలలు కండమే ఔతుందిగాని సావుకారినవడం కనుసూపుమేరలో కాన్రావడంలేదు"

"నీయెప్పుడూ బీదరుపులే. సావుకారయిపోయి మాకందరికీ అప్పులిచ్చి రోజువోరీ వొడ్డీ లొసూల్జేసుకుంటూ కాలుమీద కాలేసుకుని కడుపులో చేపల పులుసు కదలకుండా దర్జాగా గడిపీయాలన్నీ ఆశే. కాన్నువ్వు కష్టపళ్లేని వొయసొచ్చేసిన ముసిలోడివికావే! వొయసులో ఉన్నావు. వొళ్లొంచమనే బగమంతుడు నిన్నిలాగుంచేడు" కిసుక్కున నవ్వాడు.

"నన్నే కాదు, నిన్నూనూ. తెప్ప కర్రవేపారం జెయ్యాలని తైతైలాడతావుగా? తేరగా కూచొని ఏలకేలు కొట్టేద్దామని నీ ఆశ. నీకు మాత్రం కాలొంగిందా, చెయ్యొంగిందా? నువ్వూ నా యీడు వాడివే. అందుకే నిన్నూ వొళ్లొంచి కష్టపడరా నా కొడుకా అని దేముడు నువ్వు తెప్పకర్రలేపారంవేపు ఎళ్లలేకుండా ఎప్పటికప్పుడు కాలడ్డ'వెడుతున్నాడు'కానుకో" బదులు తీర్చుకున్నాడు మొదటివాడు.

"మనిసికి మనలాటోడికి ముందు సూపుండాల. మహజాగర్తుండాలి. అయి మనకినేవు. దంచినమ్మకి బొక్కిందే కూలని ఏరోజొచ్చిందారోజే రేతిరికి కతమూ కాళీ జేసేస్తాం, కల్లుపాకలోనూ కూటికుండదగ్గరా. మనలో కొందరు మనాళ్లే కొందరు బంగారాలు కొండం లేదా, భూములు సంపాదించడంనేదా, బ్యాంకుల్లో సొమ్ములేసుకోడం లేదా వొందలూ ఏలూ? దేనికేనా స్టారుండాలిరా. సుడుండాల్రా. నక్కు పల్కితే నారిగాడు నారాయణరావూ సత్తిగాడు సచ్చన్నారాయణమూర్తీ అవడమెంతసేపు? " కలుగజేసుకున్నాడింకొకడు.

"నాకు లేదో అనేడిస్తే ఓ కన్ను పోయిందట. ఎదుటోడికుందో అనేడిస్తే రెండుకళ్లూ పోయాయట. ఎవరికెప్పుడెంతివ్వాలో ఆపైవాడికెరుకే. ఒకడిమీదపడేడవడంకంటే నాకూ యిమ్మని ఆ నారాయుణ్ణి పార్థించండెహె. మన గంగాపుత్రుల గుడిసెలు బంగారం సెయ్యి బగమంతుడా అని పార్థించుకొండి పలితముంతుంది" వాళ్లలో కొంచెం పెద్దవాడన్నాడు. "కన్నతల్లిలాటి గంగను కరుణచూడమనండి"

"వుప్పుడు మనకి కన్నతల్లి కల్లు కుండే. బీగా కల్లు పాకకి పదండి. కల్లుకుండట్టుకుని, దానిముందు సాష్టాంగపడి, అమ్మా తల్లీ, కన్నతల్లీ, కల్లు తల్లీ, మందు మాలక్ష్మి! మా బతుకులని బాగుసేసి బంగారం కురిపించు కల్లు తల్లీ అని యేడుకుందాం" ఎకసక్కెమా డినట్లే అన్నాడు.

అందరూ వొక్కసారి గొల్లుమని నవ్వారు వాడి మాటలకీ, నటనకీ.

మాధవ్‌లో వాళ్ల మాటలు ఆలోచనలే రేకెత్తించాయి.

వీళ్ల జీవితాలు చిత్రమయినవి. గుడిసె, గోచీ పాత తప్ప లేనివారికి పాతికేసి వేలు విలువజేసే తెప్పలుంటాయి! మరి వీరు పేదవారా? ఆస్తిపరులా? వీరి వృత్తికి పెద్ద ఎత్తునే పెట్టుబడి అవసరమన్నమాట-. పడ వకీ, వలలకీ, గాలాలకీ, తదితర పనిముట్లకీ. వీళ్లకీ జీవితంలో ఆర్థికపరమయినవీ అభి వృద్ధి పరమయినవీ ఆశలు, ఆశయాలు, కాంక్షలు, ఆకాంక్షలు, కోరికలు, కలలు, ఎన్నో ఉన్నాయి. వృత్తి చేసిచేసి వీరికీ విసుగే.

తెప్పకర్రల వ్యాపారం జేసి తేరగా సంపా దించాలి. అసలుకంటే వడ్డీ ముద్దు అయ్యే వడ్డీ వ్యాపారం చేసి బట్టనలక్కుండా బతుకు వెళ్లదియ్యాలి. భూములు కొనాలి. బంగారం ముద్దలు కూడబెట్టాలి. బ్యాంకులో నిలవలు పెంచాలి. నాగరికుడికీ, ఈ బెస్తకీ ఒకే రక మయిన ధ్యేయాలు! సామాన్యమానవుడెవ రికి మాత్రం యింతకుమించి భిన్నమైన కోరి కలూ, జీవితపు విలువలూ ఉంటాయి? ఉండగలవు?

"అన్నట్టు మరిసేపొయ్యాను. వొరేయ్ మనూరికి నిన్నోమొన్నో ఓ కాషాయస్వాము లొరొచ్చాడే. ఆయనది సచ్చివాక్కట. ఏజై బితే అది జరుగుతుందట. ఆయన నోరు తెరిచి ఆసీర్వాదిస్తే వలనిండా సేపలేనట"

"ఔనౌను. నేనూ ఇన్నాను. నా సెవినాప డిందీవార్త"

"ఆరు తుఫాను మేడలో ఉంటారట. పన్లో పని ఎల్లి ఆసీర్వాదింపించేసుకుని పోదా రేటి?"

"తోవలో తోవేగా. పదండి"

"పదండి"

తెల్లబోయాడు మాధవ్. త్రుళ్లిపడ్డాడు.

కాషాయవస్త్రాలతో మంచేకాక యిలాటి ప్రమాదంకూడా ఉందన్నమాట! మనుషులకి ఎలాటి చిత్రమయిన బలమయిన, నమ్మ కాలు. ఆ విశ్వాసాలకి మూలం కేవలమూ వారి హృదయమేనా? మరేమయినా కూడా ఉన్నాయా? సౌందర్యం చూడబడే వస్తువు లోకాక చూసే కన్నులో ఉంటుందన్నా సౌందర్య దర్శనమనే సమగ్ర కార్యానికి చూసే కన్నూ ఉండాలి, నిమిత్తమాత్రంగా అయినా చూడబడే వస్తువూ ఉండాలి విశ్వ సించడానికి.

"నీకు చేపలు పడతాయి" అని తానంటే అవి వొచ్చి వలలో వాలిపోవు. అలాటి ప్రతిభ తనకి లేదని తనకి తెలుసు. కాని వారికి తెలియదు. వారు నమ్మరు. ఈ క్షణంలో వాళ్ల కంట పడడం, చిక్కులోపడ డమే. అనవసరపు సందిగ్ధంలో పడడమే.

అతను వెనక్కి తిరిగి, కొంచెం పక్కకి, యిసుక తిన్నె వెనక్కి, చీకట్లోకి వొదిగిపో యాడు. వారి బారినుంచి తప్పించుకుం దుకు కాని మరో పదినిముషాలకి అతను బస చేరుకునేసరికి "రండి బాబూ! తమ కోసమే కళ్లు కాయలు కాసేలా సూత్తన్నాను" అంటూ పరుగెత్తుకుంటూ ఎదురొచ్చాడు గంగన్న.

"ఏమిటంత జరూరయిన పని పడింది నాతో?"

"నా బిడ్డకి ఏదో అయింది బాబూ. ఎల్లుండిలోగా అనకాపల్లి దీసుకెళ్ళి మూడొం దలు కర్చెట్టి పరీచ్చలూ వొయిజ్యమూ జేయించకపోతే పిల్ల బతికే ఆశె లేదని చెప్పే శాడిక్కడి వొయిద్యుడు. రేపు సాయంతరమే దీసుకుపోవాలనుకుంటున్నాను. కాని సేత

సిల్లిగవ్వనేదు. నా పిల్ల నాకు దక్కాలంటే రేపటికి నాకు మూడొందలందాలంటే ఒక్కటే మార్గం స్వామీ"

"ఏమిటి? "

"తమరు నోరారా మనసారా దీవించడమే స్వామీ! మీరు హోటలప్పారావింట్లో గద్దీసుకున్నారట. దేనికి స్వామి అద్దె దండగ. హాలు తాళాలు రెండున్నాయి. ఒకటి తమకాడుంచండి. మీ సామాన్లు హాలులో పెట్టుకోండి. కావాలంటే మీరూ లోపలే పడుకోండి" అంటూ తాళాలివ్వబోయాడు.

అవి ముందరికాళ్లకు బంధాలులా, లంచంలా కనిపించాయి. వాటినందుకోకుండా "చూడు జగ్గన్నా! నేను స్వామివారిని కాను. ఇది చాలా సార్లే చెప్పాను. మీ వాళ్లందరూ అనవసరంగా నామీద భ్రమలు పెంచుకుంటున్నారంతే తప్ప నాలో ఏ గొప్పతనమూ, మహిమలూ లేవు నిజంగా" అన్నాడు.

"నిండుకుండ ఎప్పుడూ తొణకదు. నిమ్మళంగా ఉంటుందంతే. మీలో మయిమే లేకపోతే రాములూ సోములూ లాటి సేతగాని సవటలకి కూడా రెండొందలేటె లాపడింది? నాకు మీ మాటమీద యిశ్వాసమూ, నమ్మకమూ, నిదర్శెనం కనపడనే కనపడింది. నా ప్రేర్దన కాదనకండి" కాళ్లు పట్టుకునేంత పని చెయ్యబోతోంటే వారించి వైదొలగాడు మాధవ్.

"నీకు రేపటికి కావలసింది మూడొందలు కదా? "

"ఊ"

"ఇప్పుడే యిస్తాను. అప్పారావ్ హోటలుకి పద. అక్కడ సంచిలో ఉంది డబ్బు"

"అప్పుగానో దరమంగానో యిస్తామంటారు? "

"ఔను ధర్మంగా కాదు. సహాయంగా"

"అలా నాకొద్దు. దరమం. దాన్ని మీరు సాయమే అన్నా, నాకొద్దు. ఇప్పటికే అప్పుల్లో కూరుకుపోయి వడ్డీలు కట్టలేక సత్తున్నాను. మీరు వడ్డీ వొద్దన్నా మీ దగ్గర అప్పు సెయ్యను బాబూ! మీకు దయనేదా? ఆసీర్వదించడానికి మీరేం శ్రమపడిపోవాలి? భారమూ బరువూ ఎత్తాలి? ఒక్కమాట, మీ సొమ్మేం పోతది? " దీనంగా, జాలిగా, పార్థిస్తున్నట్లే అన్నాడు గంగన్న.

ఇరుకున పడిపోయాడు మాధవ్. ఈ వూరు రాగానే ఆయన తొలి స్నేహితుడు యితను. ఆశ్రయమిచ్చాడు. అవసరాలు చూస్తున్నాడు. ఆప్తుడిగా, ఆత్మీయుడిలా మసులుతూ వొస్తున్నాడు. తాను చేసిన మేలుని గుర్తుచెయ్యడంలేదు. అతనిమాట సత్యమేకాని అర్ధసత్యం. ఆశీర్వదించడానికి తనేమీ ఆయాసపడనక్కరలేదు. కాని... తన ఆశీర్వచనానికిప్పుడిక్కడ రెండువేపులా పదునే. ఫలించినా ప్రమాదమే, ఫలించకపోయినా ప్రమాదమే. తన ఉద్దేశం సన్యాసిగానో, స్వామిగానో, సాధువుగానో, బాబాగానో చలామణీ కావడం ఎంతమాత్రమూ కాదు. ఈ అమాయకులు తన ఆశీర్వాదాలు ఫలిస్తే అలాగే తయారు చేసేటట్లున్నారు తనని బలవంతంగా. ఆశీర్వాదాలు ఫలించకపోతే తనమీద వారికి విశ్వాసమేర్పడుతుంది. అదీ ముప్పే. తాను చేయదలుచుకున్న సత్కార్యాలకి, తన జీవిత సాఫల్యాన్వేషణకి, ఇక్కడ చాలాకాలం గడపడానికి, తనకి వారి విశ్వాసం అత్యంత అవసరం. వారి విశ్వాసాన్ని చూరగొనకుండా తనిక్కడ అడుగు ముందుకెయ్యలేడు.

"సరే... నిన్నాశీర్వదిస్తాను. కాని వొక షరతు" అన్నాడు మాధవ్ ఎట్టకేలకు.

"ఊ అన్నారదే సాలు. ఒకటి కాదు, వంద షరతులు పెట్టండి. మీరితే సెప్పిచ్చొగ్గొట్టండి"

"నేనాశీర్వదించినట్లెవరికి చెప్పకూడదు"

"బేపనమ్మ తల్లిమీదా మీమీదా వొట్టు"

"నామీదా!" నవ్వాడు మాధవ్.

"మీ ప్రాణమూ బతుకూ నావాటి

కంటెంతో యిలువయినవీ, గౌరవమయినవీ. అందుకే ఎందుకూ కొరగాని నా ప్రానంమీన కంటే మీ ప్రాణం మీదొట్టేశాను" అతని కంఠంలోని భక్తికి మాధవ్ మనసార్ద్రమ యింది. అతనాలోచనలో పడిపోయాడు.

అప్పుడు వర్తమానమూ పరిస్థితీ గమనిం పుకొచ్చి "నీకు రేపు చాలా వేట పడాలి" అనే శాడు త్వరగా.

ఒక్కసారి గంగన్న ముఖంలో పుట్టెడు నిరాశ. బుట్టెడు ఆశాభంగం.

"అదేటిసామీ అంతసేపు మవునంగా ఉంటే యింకెంతో ఆసీర్వాదిస్తారనుకున్నాను. ఒక్కముక్కేనా? "

"నీ కోరిక ఆ మేరకే కదా? నీకు కావల సింది ఘనమయిన వేట. నేనాశీర్వదించిందీ అలాగే కాదూ? "

"అది కాదు బాబూ... తమరేదో చదివి, అదేటి, సంస్కురుతంలో సెబుతారే, అలాగ దీవించండి బాబూ ఇట్టిట్టా తేల్చీక"

ఒక అత్యంత విచిత్ర సత్యం వింటున్నట్లు విభ్రాంతుడయ్యాడతను. సంస్కృతంలో ఆశీ ర్వదించాలిట! తెలుగు దీవెనా- సంస్కృతాశీ ర్వచనమూ వేరువేరు గంగన్న దృష్టిలో. బహుశా బెస్తవాళ్లందరి దృష్టిలోనూ! తెలుగు దీవెన చాలదు. సంస్కృత ఆశీర్వచనానికే అగ్రస్థానమూ, పెద్దపీటా. భావమదే అయినా భాషనిబట్టి బలమూ, గౌరవమూ మారుతాయా? ఔననే అంటుంది గంగన్న ఉద్దేశం. సంస్కృతమని ఉచ్చరించలేనవారికి కూడా ఆ భాషపట్ల ఎంత భక్తి! ఎంత గౌరవం!

తన ఉద్దేశం, ఊహ, ప్రయత్నం నిశ్చ యంగా సరయినవే. అమోఘాలే. తన ధ్యేయాన్నీ అనుభవం సర్వవిధాలా సమర్థిం చింది. తను ధన్యుడయ్యాడు. తనివినిండిన మనసుతో, ఈసారి సంస్కృతంలో ఆశీర్వ చనం చదివాడు, పనసతోసహా. పనస చదివే తీరులోని చిత్రమయిన స్వర సంగీతా లకీ సంస్కృత పదాల విరుపూ వొంపూ మలుపూ మెరుపులకీ విన్నవారు వింత వివ శత్వానికి లోనయ్యారు! గంగన్న సంగతిసరే సరి. తేనె స్నానాలు చేసి అమృతంపానం చేసినట్లే.

"నా చెర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీ రుణం సాలదు సామీ!" అతనన్నాడే కాని ఏమో! రేపేమి కానున్నదో? వేట పడితే అతనితోపాటు తనకీ వెన్నెలే. కాని విధి వక్రించి అన్యవిధంగా జరిగిందో... అతనికి తనకీ కూడా అయోమయమూ అంధకారాలే. భగవంతుడా! యీ ఆశీర్వచన అగ్నిపరీక్ష నుంచి నన్ను గట్టెక్కించు ఈ వొక్కసారికీ.

రేపు... ఏం జరగబోతుందో?

ఎలా తెల్లవారబోతుందో?

ఏమి కానున్నదో? ఎదురుచూడవలసిందే తప్ప గత్యంతరం లేదు. కాలపు పొరని ముందుగా చీల్చి చూడగలగడం మానవ మాత్రులకసాధ్యం.

"వొస్తానుస్వామీ" అన్నాడు గంగన్న.

"ఎక్కడికి? " యధాలాపంగా అడిగాడు.

"ఇంకెక్కడికి? ఈ పాటేలయిందంటే యీతకల్లుకో, తాటికల్లుకో, ఆడకే" తలొంచు కున్నాడు.

"కల్లు మానితే వొళ్లూ బాగుపడుతుంది, ఇల్లూ బాగుపడుతుంది. మానెయ్యకూ డదూ? "

"నా తరంకాదు బాబూ! మీరంటే నాకు బక్తీ, గౌరవమే. మీరేం చెప్పినా ఇంటాను. ఏం చేసినా పడతాను. కాని మీరు కన్ను మీదా కల్లుమీదా కొట్టడం నాయం కాదు సామీ"

"అదికాదయ్యా, ఆరోగ్యం"

"కల్లువల్ల వొంటికి మంచే కాని సెడు జర గదు సామీ. కల్లు కష్టాన్ని మరిపిస్తది. మీకోటి ఎరుకా? పాములోళ్లు, పిల్లలు పుట్టి నకాణ్నించీ పురిటి కందునుంచీ, సుక్కా సుక్కా పామిషం పడుతూపోతారట. దాంతో ఆళ్ల శరీరం యిషానికలవాటడిపోయి తరవా త్తరవాతెలాటి పాము కాటేసినా ఆళ్లకేటీ

కాదుట. అలాగే మేం, గంగాపుత్రులం, పురిటి పాపడినుంచీ ఉగ్గుతోపాటు కల్లు సుక్కలు కూడా కలిపి పడతాం. అంచేత కల్లు మా రకతంలోనూ వొంట్లోనూ బాగమై పోయి మమ్మల్నీ మా ఆరోగ్యాలనీ ఏటీ సెయ్యదు. ఉపకారమే చప్ప మీలాటోరు ఉగ్గూ పాలూ తాగితే మాబోటోల్లు ఉగ్గూ కల్లూ తాగి పెరిగి పెద్దౌతారు. అంచేత మీరు పాల్దాగాలి, మేం కల్లు తాగాలి, పాలంటే గ్యాపకం వొచ్చింది. మీకు ఫలా రంకి ఏళవుతోంది. పళ్లు తినిరండి. పాలు దెచ్చిస్తది" అని మరో మాటకి తావివ్వ కుండా దొంగలా వెళ్ళిపోయాడు గంగన్న అతని ముందునుంచి.

మాధవ్ గడియారం చూసు కున్నాడు.

ఎనిమిదౌతోంది పది నిముషాలు తక్కు వగా.



ఉషోదయమవు తోంది. అప్పటికే సుప్తసముద్రాన్ని మాధవ్ సంధ్యావందనం మేలుకొలిపింది. గంగ బద్ధకం విదిలించుకుంటూ కెర టాలు సవరించుకుంటోంది. గంగాపు త్రులు బతుకుసమరానికి సాగర రంగంలో దిగేందుకు వేళ దగ్గరపడుతోంది. మాధవ్ గాయత్రీమంత్రం జపిస్తూనే తీరంవెంబడి చూస్తున్నాడు చీటికీ మాటికీ. తూరుపు దిక్కున ఆకాశం దానిమ్మ పువ్వులా, గులాబి మొగ్గలా ఎర్రగా విచ్చుకుంటూంటే తెలిలీ లపు నాగుపాములు తెల్లని పడగలెత్తి బుస లుకొడుతూ పరుగెత్తుకొస్తున్నట్లు, నీలి సంద్రపు కెరటాలు. తీరాన బెస్తలొక్కొ క్కరూ చేరుతున్నారు. వారి భుజాలమీద గాలాలు గాలికో వారి నడకకో కదులుతూ గలగలలు. ఇసుకలో పాదాల మెత్తని సడులు. అవతల సముద్రపు హోరు వీట న్నిటి మధ్యనుంచీ-

"కౌసల్యా సుప్రజా రామా- పుర్వాసంధ్యా ప్రవర్తతే...

ఉత్తిష్ట నరశార్దూలాః... కర్తవ్యం దైవమా హ్నికం"

ప్రభాతాన పవిత్ర గానం. శ్రీవెంకటేశ్వర సుప్రభాతం, వెన్నుతట్టి మేలుకొలుపుతూ కర్తవ్యనిర్దేశంగావిస్తున్నట్లే.

అది సంస్కృతం. అది సంగీతం. అది సంగీత సాహిత్యాల సమ్మేళనం. భక్తి యుక్తం వీనులకువిందు గొలుపుతూ సంస్కృత పదాల విన్యాసం. మన సుకీ మనిషికీ హాయిగొలిపే అద్భుత... శ్రావ్యరాగమా లికలవి.

తీరాన గంగాపు త్రులు ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ అటు చూశారు. అది వారికి కొత్తే. ఊరిలో ఎవర యినా వారికోసం యిలా సంగీతం పెట్టు కుంటారు కానీ ఇక్కడ తమ కోసం నీటొడ్డున సంస్కృతం పాటలెవరు పెడతారు?

"ఓ! కాషాయ సాములోరు! పాటలపెట్టె ట్టారు! ఎవరికోసవో? "

"మనకోసమే. ఎవరికోసవో అయితే కష్ట పడి యిక్కడికెందుకు మోసుకొస్తారు పెట్టెని? సౌండు నాసిగా ఉంది"

"మనకినపడుతోంది గదా! సాల్లే. సవుద్ర మ్మీదికెళ్లినా శానా దూరమేయినపడుద్ది"

"ఓ! ఇయాళ శనోరవన్నమాట! అందుకే ఏడుకొండలెంకన్న పాటెట్టినాడు సామి"

"ఎంకటేస్సర సుప్రబాతవంటారు అది"

"సినేవా పాట్లెడితే బాగుండేది"

"ఎప్పుడూ యినే గోలే గదరా అది? ఇలా టిప్పుడిలాటి కీర్తన్లే బాగుంటాయిండానికి"

"రేడియోలోనూ యిస్తారిది సెనోరం సెనోరం"

"ఇస్తారు ఇవ్వకేం? అద్దరాత్తిరికాడ అంకమ్మ శివాలన్నట్లు, సూరీడు పదిబారలా కాసె మెక్కేశాక అప్పుడు రేడియో సుప్రె భాతం! ఎర్రనెండలో, అప్పుడు మనం గంగ మీదుంటాం. పన్లోళ్లు పన్లోకి పోయాక, ఎవ రిండానికిరా అది? ప్రెబాతమంటే ఇలాటి యేళే. సుప్రబాతవంటే ఇట్లాంటి ప్రెబాతపే ళనే ఎయ్యాలి. బాపనయ్య మామంచి పన్జే స్తున్నాడు"

"రోజూ ఎడితే బాగుణ్ణిలాటివి"

ఒకవేపు సుప్రభాతం వింటూనే ప్రయాణ సన్నాహాలు చేసుకుంటున్నారు వాళ్లు. తెరకొ య్యలుకట్టి, వలలూ గాలాలూ సర్దుకుని, తెరచాపల చుట్టలు పడవలో సర్ది, చట్టితో మంచి నీళ్లెట్టుకుని, గంగకీ, సూర్యుడికీ దణ్ణాలు పెట్టుకుని పడవని ఇద్దరేసో ముగ్గురేసో కలిసి నీళ్లలోకి తోసి, బయలుదే రుతున్నామని కాబోలు సంబరపడుతూ కేకలు వేసి, నీటిలో అల్లంతదూరం వెళ్ళేవ రకూ వాళ్ల చెవుల్లో శ్రీవేంకటేశ్వర సుప్ర భాత సంస్కృతమూ సంగీతమూ వినిపిస్తూ వారి వీనులనూ హృదయాలనూ ఆనందప రుస్తూనే ఉన్నాయి. ఆహ్లాదపరుస్తూనే ఉన్నాయి. సుప్రభాతం సమాప్తమయ్యేసరికి తీరంలో సాగరపుత్రులెవరూ లేరు.

ఆరుగురాడపిల్లలు, సముద్రస్నానం చేసి వొడ్డున యిసుకలో మాధవ్‌కి దగ్గరగా కూర్చున్నారు. సరస్వతి వారికిలా చేయాలని చెప్పిందేమో, వాళ్లు కళ్లు మూసుకుని చేతులు జోడించి పద్మాసనం వేసుకుకూర్చు న్నారు మహబుద్ధిగా. వారి పేర్లు తెలుసు కుని, తనని పరిచయం చేసికొని, "ఓం..." ఓంకారనాదం... భిన్నభిన్న శ్రుతులతో, విభి న్నస్వరాలలో, తనాలపిస్తూ, వారిచేత ఆల పింపజేస్తూ సుమారొక గంట. అప్పుడు వారికి బిళ్లల పంపకం. ముద్దులాడడాలూ, ఆరుగురూ మెరికలే. మట్టిలో మాణిక్యాలే. సాధనతో మెరుగుదిద్దితే, సానపడితే ఆ ప్రకాశం పట్టడం ఎవరితరం? అదే అతని ఆశయం.

గంగాపుత్రులు నీటినుంచి మరలివొచ్చే వేళయింది. వాళ్లలో గంగన్న ఉంటాడు. అతనికి వేటపడితే రేపటి తన పని సుల భమూ సాధ్యమూ ఔతుంది. వేట పడక పోతే ఏం జరుగుతుందో చెప్పలేడు. ఊహిం చలేడు. ఈ గంగాపుత్రులు నిష్కల్మషులూ నిర్మోహమాటస్తులూ. మంచొచ్చినా పట్టలేం, చెడ్డొచ్చినా పట్టలేం. విశ్వాసానికి రెండం చులా వాడే. గంగన్నకి వేటపడిందో లేదో వేగంగా తెలుసుకోవాలనుకుంటూ త్వరత్వ రగా నడవసాగాడు పూడిమడకవేపు అడ్డదా రిన.

★ ★ ★

మిగిలిన గుడిసెలకు కొంచెం ఎడంగానూ విడిగానూ ఉన్న ఆ పాకలో...

నులకమంచంమీద వయసు మళ్లుతున్న చంద్రయ్య, చర్మం కాస్త వడలినా కాయకష్ట జీవి అయిన అతని దేహం మాత్రం దృఢం గానే ఉంది.

పాకలో ఓ మూల గూటిలో వెలుగు తున్న గుడ్డి దీపపు ఎర్రని వెలుగు బలహీ నంగా పరచుకుంటోంటే అతని మంచానికి కాస్త దూరంలో నేలమీద పరచిన ఈతాకుల చాపమీద ఈడొస్తున్న చక్కని చుక్క. అల్లో నేరేడు రసంలా ఆమెదదో వింతా విచి త్రమూ అయిన దేహవర్ణం. పంధొమ్మిదేళ్ల ఆ పడుచుపిల్ల నిద్రపోతున్నట్లూ కునుకుతీ స్తున్నట్లూ కళ్లు మూసుకుని ఉంది.

అతనొక్క క్షణం తదేకంగా ఆమెని చూశాడు.

"నువ్వాకాశానివి, నేను చందమామని. ఈ అందాల బొట్టి మనది. ఆకాశం- చంద మామ అమ్మా అయ్యా అయి కన్నబిడ్డ. ఏం పేరెడదాం పాపకి? చుక్కందామా?"

"నేనేమో సముద్రాన్ని. నువ్వేమో నాలో కలసిన నదివి. మన కలయిక ఫలమిది.

మన పాపనేమందాం? మాట్లాడు"

అప్పటికి నోరువిప్పిందామె. "నువ్వు సవుద్రానివి. నేను వొడ్డుని. ఇది మన బిడ్డ. మక్కువగా చుక్కా అనే పిలుసుకుందాం మావా"

ఆనాటి పొత్తిళ్ల పసిదే ఈ చుక్క. ఆప్యాయంగా చూసుకున్నాడతను. అతని హృదయం ఆర్ద్రమయింది స్మృతుల జల్లుకి. ఇక అతను మంచం మీద నిలవలేకపోయాడు.

మగాడికి

సుకమంటే ఆడది... బతుకంటే ఆడది.

అలాగ అతనెప్పుడూ అనుకుంటూనే ఉంటాడు. ఆ పరమ సత్యం అతనికి ఆలి చనిపోయాక మరింత అర్థమౌతూ వస్తోంది.

అతను మెల్లగా మంచం దిగాడు.

చడీ చప్పుడూ చెయ్యకుండా లేచి మూసిన తడక దగ్గరకొచ్చాడు. పిల్లిలా నిశ్శబ్దంగా, తప్పు చేస్తున్న వాడిలా కొంచెం తడబడుతూ తడక తోశాడు సాధ్యమయినంత తక్కువ సడిమాత్రమే అయ్యేలా. కానేం లాభం?

ఆ చిరు సవ్వడికే

"అయ్యా" అంటూ లేచింది చుక్క.

అతను ఆగిపోయాడు మంత్రమేసినట్లు.

"ఇంత రాత్రి పూట ఎక్కడికయ్యా? "

"కునుకుపట్టక" నసిగాడతను.

"వొద్దయ్యా. ఎవరేనా చూస్తే ఏమనుకుంటారు? "

అతనేమీ అనలేదు.

"ఎవరేనా ఎదురుపడి ఎక్కడికని అడిగితే జవాబు చెప్పగలుగుదువా? నిజం చెప్పగలుగుతావా? సిగ్గువిడిచి నోరువిడిచి చెప్పావేపో, నీ ముఖానే నవ్వరూ? ఇంత వయసొచ్చి ఇదేమిటని అడిగితే ఎదిరొచ్చిన కూతురినెట్టుకుని ఇదేం బుద్ధని అడిగితే ఏమని బదులాడతవ్? ఇంతదనుకా నలుగురికి మంచీ మప్పిదమూ సెప్పినోడివే తప్ప నొకరి చేత మెద్దులూ సుద్దులూ సెప్పించుకున్నోడివికావు. సిట్టసీకట్లో ఏదీ కానియేళ సవుద్రపొడ్డున ఎవరికంటేనా పడితే ఎలాగుంటదో నువ్వే ఆలోచించు"

అతను విసుక్కున్నాడు. "ఏటిజెయ్యమంటవ్? కునుకట్టి సావదు"

"నాకేదేనా కదసెప్పు, చెబుతూంటే నీకూ ఇంటూంటే నాకూ ఇద్దరికీ నిద్దరొచ్చేస్తాది"

ఒక్కసారతనికి కోపమంతా పోయి నవ్వొచ్చేసింది... ఉన్నట్లుండి సముద్రం మీద ఎండపోయి మబ్బు కమ్మేసినట్లు.

"నేనేటి కదలు సెప్పగల్నే? సదువుకున్నోడినా, సంతలకెళ్లేవాడినా? అదీగాక నువ్వా కదలంటే సెవిగోసుకుందుకు, వొళ్లు మరిచేందుకూ చిన్న పిల్లవీ కావు"

"నేను సిన్నపిల్లనికాక సావుకెదురుచూసే ముసిలిదాన్నా? " ముకం చిన్నబుచ్చుకుని నిష్ఠూరమే ఆడింది.

"సిన్నపిల్లవేనే! పొరబాటయి పరాకులో నోరుజారింది. చుక్కా! నువు సిన్నపిల్లవే. కాని నాకు దెలిసిన కదొక్కటేకదే. ఎన్నిసార్లని నేను చెబుతాను, ఎన్నిసార్లని నువ్వింటావు? "

"ఏం పర్నేదు. మా అయ్య బతుక్కద ఎన్నిసార్లన్నా నాకిష్టమే" తనని గడపదాటిపోనివ్వకుండా ఉండేందుకే ఆమె ఆ ఎత్తువేస్తోందని అతనికి తెలుసు. చుక్క తన కూతురు. మహగడసరి. అలాగిలా మాటలాడి అయ్యనే అదుపున పెట్టేగల్దు.

"గుడిసె ముంగల కూర్చుని సెప్పుకుందాం. లోపల నాకు బాలేదు" చుక్క గుడిసెముందు చాప పరిచింది.

గుడిసెలో అంతంత మాత్రంగానూ అణకువగానూ ఉన్న గాలి గుడిసెముందు విచ్చలవిడిగా చెలరేగిపోతోంది. కొంచెం మంచు కూడా పడుతూందేమో ఆ గాలి చల్లగా ఉంది.

సముద్రపొడ్డున ఎంత చిక్కని చీకటయినా పలచబడీ ఎంత పలచని వెన్నె

లయినా చిక్కబడీ ఉంటాయి కనుక,

అక్కడ చీకటి మసక మసగ్గానే ఉంది.

ఇద్దరూ కూచున్నాక చుట్టంటించాడు చంద్రయ్య. గుండెల నిండి పొగలాగి ఒక్క సారాకాశం వేపు చూశాడు. అంతలోనే తుపుక్కున ఉమ్మి... గొంతు సవరించుకున్నాడు.

అప్పుడు మహదానందంగా తన బతుకు కద మొదలెట్టాడు తనదయిన ధోరణిలో.

"చెప్పులు కుట్టేవాడికేగానీ చేపలు పట్టేవోడికే కానీ ఎవడికయినా బతుకుబతుకే. గొప్పోడికయినా గోసీగోడికయినా బతుకంటే బూమ్మీద పడిన కాణ్నుంచీ మళ్లీ బూవిలో కలిసిపోయేవరకే. సన్నాసులూ, సాములోర్లూ బతుకస్తిరమూ అసాస్వేతమూ అంటూ ఏటేటో మనకర్థం కానివి సెబుతారు కానీ నా మటుకు నాకనిపించేదేటంటే ఉన్నన్నాళ్లూ బతుకు తిరమే, సాస్వేతమే. జనమానికో సివరాత్రంటారుకదా! నా జనమకీ సివరాత్తిరొచ్చింది"

"ఎప్పుడొచ్చిందయ్యా? ఎలాగొచ్చింది? "

వినేవారుండాలే కానీ నోరున్న ప్రతి మనిషికీ హరికథో మరో కథో చెప్పెయ్యాలనే ఉంటుందనీ, శ్రోత దొరకాలేకాని ఎవరయినా వక్తగా విజృంభించేస్తారనీ ఈ సత్యం చుక్కకి తెలీదు. ఆమెకి తెలిసిందల్లా ఒక్కటే. అయ్యని మరిపించాలంటే అతగాడిని కద చెప్పమని తాను వినాల. ఊరికే నోరెళ్లబెట్టుకుని వినటం కాదు. మజ్యమజ్య పెశ్నలేస్తూ ఉంటేనే అతను మరింత ఉషారుగా కజ్జెబుతాడు.

"నేను కుర్రతనం దాటాననే నాకు తెల్దు. ఎప్పుడు దాటానో అసలు తెల్దు. కాని ఆ యేళ తూరుపిడకుండానే పడవేసుకుని సవుద్రంలో పడ్డాను వొక్కణ్నే. వల యిసురుతూ ముందుకి పోయాను. అదేవిటో సిత్రం, ఒక్క సేపా వల్లో పడదే! నాకు పంతవూ పౌరుసవూ వొచ్చేస్తున్నాయి. వొంటిమీద తెలివి మరిసి మరింత ముందుకి బోయాను. ఎంత ముందుకొచ్చీశానో చూడను, ఎంతేళయిందో పట్టించుకోను. వలవిసురుతూ పోతన్నానంతే పిచ్చి పట్టిన వోడిలాగ. ఒక్క సేపా పడనందుకు నీటితల్లి మీద నీలుగుగా ఉంది. సరిగ్గా సూరీడు నడినెత్తిమీది వాడటునుంచిటు మళ్లుతూంటే అప్పుడు బరువుగా లాగిందొల. గొప్ప సంతోసమేసింది నాకు. గరవమేసింది. వొలలాగాను. ఒకంతటరాదే! ఎంత సేపపడ్డదో ఏటో! బలమంతా పూని లాగాను. బయటపడింది సేప. ఎంత పెద్దదనీ! బారెడు మీనమూరెడు కంటే బారు. సందిటపట్టినంత సేప! చూసేతలికి ముద్దూ ముచ్చటా ఏసేసాయంటే నమ్ము. ఐతే ఆ సేప తక్కువ సందడి చేసిందా? ఓ పట్టాన లొంగిందా? "

మొత్తంమీద చేపనేసుకుని పడవను వొడ్డు వేపు మళ్లించాను. చేపన్జూస్తుంటే కడుపు నిండిపోతోంది. మనసుకి పండగే అయిపోతుంది. అంత పెద్ద సేప!

సిత్రం! వొడ్డునప్పటికే ఎందరో మూగిపోయున్నారు.

"రారా సెంద్రా రా... సెబాస్" మెచ్చుకుంటూ అరుపులు.

"పెద్ద సేపని పట్టేవటగా! సెబాసిరా బిడ్డా... బేసో"

"నువ్వు రా... మగాడివి"

అందరికందరూ సంబరంగా సేతులు సాపి నన్ను కావలించుకున్నారు. అప్పుడొచ్చాడు.

"ఎవరు? "

"సావుకారు"

"సరే, సావుకారొచ్చి? "

సేపన్జూసేడు. అతగాడి కళ్లు వొక్కసారి ఎలకన్జూసిన పిల్లికళ్లలా మెరిసేయి. "భేష్‌రా... మంచి చేపని పట్టావ్. వందరూపాయలట్టుకుపో" అంటూ అప్పటికప్పుడు అక్కడికక్కడ జేబులోంచి నూర్రూపాయలన్నోటు తీసేడు.

"అయ్యకివ్వండి" అన్నాన్నేను. అయ్యందుకుని కళ్లకద్దుకున్నాడు నోటుని. నిముషంలో చేపనెత్తించుకుని షావుకారెళ్లిపోయాడు.

"బొట్టుడువంటే నువ్వురా సెంద్రా! బతికి బట్టగట్టి వొందరూపాయల నోటు గురించిన డవే. కాని కళ్లసూడ్డమూ అంటుకోడమూ జలమలో ఇదే తొలిసారి. పదరా... ఇంటికి పోదాం. గెంజి తాగుదాం"

సావుకారు సేపనట్టుకుపోయేతలికి నా మనసేదోలా అయిపోయింది. ఎందుకో నాకు దుక్కమూ కళ్లనీళ్లూ వొస్తున్నాయి.

"వొస్తాలే. నువ్వెళ్లు" అని ఆడినంపేసి అక్కడే కూలబడిపోయానిసకలో. నా సుట్టూ ఎవరూ లేరు. సీకటడిపోయింది నల్లగా. కష్టపడి ప్రాణాలకు తెగించి పట్టిన సేపని సావుకోరట్టుకుపోయాడు, గెద్ద ఎగరేసుకుపోయినట్లు కొట్టుకుపోయాడు. మరోసారి మనసారా కళ్లారా జూసుకుందుకేనా లేదు నా చేప. అందుకే నాకు మరీ దుక్కంగా ఉంది. మంచి కలలా అయిపోయిందదంతా. నాకేమీ మిగలకుండా.

ఏడుస్తున్నాను, గుండె తేలికపడేలా దుక్కం తీరేలా.

సరిగ్గా అప్పుడు ఏ పడవెనకాల్నుంచొచ్చిందో...

నా భుజంమీద మెత్తని జెయ్యి "సెంద్రా!"

"ఎవరు?" తుళ్లిపడి... కళ్లు తుడుచుకడిగాను- కనపడక.

"నేను గగనాన్ని"

ఆ పేరు యిసిత్రం. దేముడివ్వగా ఆకాసెంనుంచూడి పడిందనేమో అలాటి పేరెట్టారామెకమ్మా, అబ్బా. నాకు తెలిసిన గుంటే. ఐతే ఎప్పుడు పట్టి పట్టి సూళ్లేదంతవరకూ. అప్పుడే చూశాను. ఆశ్చర్యమేసింది. ఎంత సక్కగా ఉంది! మొకమంతా కళ్లే. ఆ కళ్లు బొడిసె సేపలలాగ అతిసక్కనివి. నా వీప్మీద వొంగి నన్ను తగులుతున్న ఆమె యౌవనం వయసు, మనసు జలదరించి...

ఒక్కసారా స్పరిశెకు నాలోని మగతనం మబ్బులోంచి మెరుపులా ఉరికినట్లయి యిాడుకి కీడుజేస్తానేమో అని ఇదయి "ఏటే యిదీ? పరాయి మగాణ్ణి వాటేసుకుంటావా? పెళ్లికాని పిల్లవికదే? పెమాదం తెలీదూ?" అని దూరం కాబోయాను.

వొదలదే! కౌగిలి వొదిలెళ్లనివ్వదే. నాకయితే బాగానే ఉంది. మోగాణ్ణి మొల్తాడుగలోడినీ. కానీ అది ఆడదే. అన్నాయమైపోతదే!

"నువ్వు పరాయోడివీ పైవోడివీ ఎందుకవుతావ్? సెంద్రా! నువ్వంటే నా మనసుకు ఇష్టం. నా మనసూ మనువూ నీతోనే"

తెల్లబోయాను. నమ్మలేకపోయాను. ఒక్కసారి నా గుండె కుదిపేసినట్లయింది. నేను మనిసినీ మొగాణ్ణే ఐపోయానా?

"సర్లే... మనువవనీ"

"అదుగో ఆకాశం. ఇదుగో సవుద్రం. ఆటి సాచ్చిగా నువ్వూ నేనూ ఏకమవుదాం. సెంద్రా! అంత సేపన్దెచ్చిన నువ్వే మగాడివి, నా కంటికీ నా వొంటికీ. కాదనకు. ఇప్పుడే ఇంత గనకార్యం చేశావే, ముందు ముందింకేటి జేస్తావో" అంటూ వాటేసుకుంది మరింత గట్టిగా. జున్నుముక్కలాటి వొళ్లు. చేపల్లాటి కళ్లు.

వొయసిరగబడుతూంటే వొద్దనలేకపోయాను, వొల్లకుండానూ ఉండలేకపోయాను. మా మనసులకి మనువయిపోయింది.

ఇంటికెళ్ళేతలికి ఎర్ర నీళ్లు దిగదుడిసిపోసిందమ్మ.

"అందరి కళ్లూ నీమీనే. దిష్టి తగుల్తుదో ఏమో. నా బిడ్డ ఎంత సేప దెచ్చాడనీ!" అంటూ ఏడేడి బువ్వలో కమ్మకమ్మని సేపల పులుసేసి అందించింది గిన్నె.

అప్పుడిహ ఉండబట్టలేక చెప్పేసేను, గగనం సంగతి.

కాదనలేదాళ్లు. పచ్చుందిరక్కుండా పసుపు తాడు కట్టేశాను గగనం మెళ్లో. అచ్చంగా నాదాన్ని చేసేసుకున్నాను, పచ్చతోరణాల పందిర్లో. అలాగ మీయమ్మ నా ఆలయింది.

కాదులే నా ఆలయ్యాక కద నీ అమ్మ యింది? సుక్కా!

బదులు లేదు.

అతను మెల్లగా ఆమె దగ్గరగా జరిగి చూశాడు.

చల్లగాలికేమో చాపమీదే వొళ్లుమరచి నిద్ద రోతోంది.

కథ యింటూంటే కన్ను మూతపడిపో యిందేమో. ఇదీ ఒకందుకు మంచిదే.

అతను నిశ్శబ్దంగా లేచాడు.

నీటి అంచునే నడవసాగాడు. ఉండీ ఉడిగీ ఒక్కొక్క కెరటం అతని మోకాళ్లవ రకూ పాకి నీళ్ల నాలుకతో ముద్దెట్టుకుని అంతలోనే దిగి అందకుండా పోతుంటే అత నికి గిలిగింతలుగానూ అదో సుకంగానూ ఉంటూంది.

తన కోసం ఎదురుచూసే ఎవరినో కలు సుకుందుకిప్పటికే ఆలీసెం అయిపోయిందని ఆదుర్దా పడుతున్నట్లు అడుగులు వడివడిగా పడుతూ. అదే క్షణంలో హఠాత్తుగా మెలకు వొచ్చి చూసింది చుక్క. అయ్య లేడు! దుఃఖం వొచ్చింది. ఆ దుఃఖంలోనే ఆ దుర్ది నమూ జ్ఞాపకం రాసాగింది.

★ ★ ★

ఆ సాయంత్రం...

గుడిసె ముందునుంచి-

“చుక్కా!” దిక్కులు పిక్కటిల్లేలా అరుపు. అది ఆర్తనాదమే. అనంతజలధిని కూడా జలదరింపజేయగలిగే అరుపే.

ఏం కొంప మునిగిందో అని గుడిసె లోంచి పరుగెత్తిందామె.

గుడిసె ముంగిట-

తండ్రి ఒడిలో తల్లి!

గిరగిర గింగిరాలు తిరిగిపోతోంది. నోటి వెంట నురగలు!

నమ్మలేకపోయింది తననితానే. తన కళ్లే తనని మాయ జెయ్యడం లేదుకద?

నిముషం కాలేదు అయ్యొచ్చి పిలిచి.

ఏటినుంచొచ్చాడనీ ఏటేటి తెచ్చాడో అని సంబరంతో ఎదురు పరుగెత్తిందమ్మ ఎప్పటిలాగే.

ఇంతలో కింతలోనే ఇదేటి?

చనం కిందట పరుగుతీసిన అమ్మ అంత లోనే చాపచుట్టలా పడిపోడమేమిటి? నీట్నొంచిసిరేసిన సేపలా గిలగిల కొట్టుకోడ మేమిటి? నురగలు కక్కుకోడమేమిటి?

పక్కనే వల. దాన్లోంచొలకబోసిన చేపలు, చేపల బుట్టలు. కొన్ని చచ్చినట్లు పడుంటే మరికొన్నేమో కొనప్రాణంతో కొట్టుకుంటూ.

“అమ్మా!” అయోమయంగా అడిగింది చుక్క.

ఏమీ అనలేదమ్మ. కదలక మెదలక ఉండిపోయింది. ఊరకుండిపోయింది.

“ఏటయిందయ్యా? ” ఏడుస్తూ చూసింద య్యావేపు.

“నా సేతులతో నేనే... నా సేపలతో నేనే... మీయమ్మని, నాయాలిని చంపేసుకు న్నానే. మీయమ్మ సచ్చిపోయిందే”

“ఎందుకనయ్యా? ” దుఃఖంలోనే గొంతు పెగల్చుకుంది.

‘అదుగో... అటుసూడు. అదే”

చుక్క అటు చూసింది. ఇసుకలో జరజర పాకిపోతూ విషపురుగు!జరిగినదర్థమైపో యిందామెకు. అమ్మని విషప్పురుగు ముట్టింది. అమ్మ సచ్చిపోయింది. ఇంక రాదు. ఆ తలపుకి-

“అయ్యా!” అని అరిచింది హృదయవిదార కంగా.

అప్పటికే అతను లేచి పరుగెత్తి వొట్టి కాళ్ళతోనే ఆ పురుగుని కసాబిసా తొక్కే స్తూ. “మీయమ్మని, నా ప్రాణాన్ని చంపిన పురుగు బతికుండకూడదు” అంటూ కసి తీర్చుకున్నాడు. చంపేశాడు.

విషప్పురుగయితే చచ్చింది కానీ చచ్చిపో యిన మనిషి బతకలేదు. బతికిరాలేదు. నలుగురూ పోగయ్యారు.

అయ్య దిక్కులేనివాడిలా దిగాలుగా ఉండి పోయాడు.

కావలసిన కర్మకాండకి నలుగురూ నాలుగు చేతులూ వేశారు. ఓదార్పుతున్న కొద్దీ దుఃఖమెక్కువయిపోసాగింది చెంద్ర య్యకి.

సముద్రపొడ్డున బతికేవాళ్లకి సముద్రపొడ్డునే శ్మశానమున్నూ. ఆనవాయితీగా జరిగే చోటనే ఆమె శవమూ బూడిదయింది. అదంతా అయి అతనింటికొచ్చేసరికి సూరీడ స్తమించేసి చీకటొచ్చేస్తుంది. పక్క గుడిసెవాళ్ళెవరో చట్టిలో ఇంత అన్నం తెచ్చి ఇచ్చారు.

అన్నం- అయ్యకీ నోటికి పోలేదు. చుక్కకీ నోటికి పోలేదు. మంచి మాటలూ, మనసు చల్లని మాటలూ వాటి దారి వాటిదే అయింది. ఏళ్ళ దుఃఖం వీళ్లదే అయింది. చూసిచూసి వాళ్లు వెళ్ళిపోయారు- ఒంటరిగా వొదిలేస్తేనన్నా దుఃఖం తగ్గుతుందేమో అనుకున్నట్లు. నిజమే ఓదార్పుకొద్దీ దుఃఖం. ఐతే ఆ తండ్రీ కూతుళ్ల విషయంలో మాత్రం అలా జరగలేదు. ఓదార్పు మాయ మయినంతమాత్రాన విచారం మాసిపోలేదు సరికదా మరింత ఎక్కువే అయింది.

"సుక్కా! నేను సచ్చిపోతానే. మీయమ్మనా గగనం బూడిదయినకాడే నేనూ బూడిదయిపోతానే" అంటూ లేచాడు. అదాటుగా లేచి పరుగెత్తసాగాడు.

★ ★ ★

అతనేంచేసేవాడో ఎక్కడికి పరుగెత్తేవాడో కాని- అదేక్షణంలో "చెంద్రా!" అంటూ వొచ్చాడు పెద్ద.

ఆ పిలుపుకీ పలకరింపుకీ ఆగిపోయాడు.

పెద్దని పట్టుకుని బావురుమని ఏడిచేశాడు. గుండెదుఃఖాన్ని కండ్లకుండలతో వొంపుకోసాగాడు.

"ఏడవకురా సెంద్రా. ఏడిస్తే ఏటొస్తాది?" భుజంచుట్టూ చెయ్యివేసి పొదివి పట్టుకుని ఆప్యాయంగా శిరసు నిమురుతూ. కరుణగా కౌగలించుకుని జాలిగా అన్నాడు. "నీకొచ్చిన కష్టం చిన్నదీ చితకదీ కాదు. కాని బరించక తప్పదు. ఎందుకంటే మనమేమీ సెయ్యలేని మనుషులం. చుక్కా! చిన్నదానివి. నువ్వు వినకూడదు. మేం మాటలాడుకోవాలిగానీ నువ్వటుపో. ఊc. పోస్లే మేమే పోతాం. పదరా" అంటూ లేవదీసి పదిగజాలు నడిపించాడు. ఇసకలో కూర్చోబెట్టాడు చెయ్యట్టుక్కుని.

"కన్నీరెట్టకు. నేను చెప్పేది మనసుపెట్టి జాగర్తగా ఇనుకో. నిన్నోదార్చడానికని కాదు సెబుతుంట. ఈ కద మన కద. నువ్వు తెలుసుకోవాలని. ఇది పరమ రహస్యెం సుమా! పొరపాట్న కూడా ఎవరికీ చెప్పమాక. మన వృత్తి నాటిదీ నేటిదీ కాదు. మనవొంశమూను. నీరూ, బూమీ పుట్టినప్పటినుంచీ, మనిషి రూపు దిద్దుకున్నప్పటి నుంచీ మనమున్నాం. పురాణాల్లో ఉన్నాం. ప్రెపంచంలో బతుగ్గురించి బాగా తెలుసుకున్నది మన జాతే. బతుకులో ఉండే మతలబులూ, మంచీ తెలుసుకోబట్టే మన పెద్దల పూర్వీకులొక ఆచారం పెట్టారు. దానిలో యదార్థమూ ఉంది, ఏదాంతమూ ఉంది. ఆ ఆచారమేంటంటే...

మన కులపోళ్లు బిడ్డ పుడితే ఏడిచేవోళ్లు. ఎవరేనా చచ్చిపోతే నవ్వుతూ పండగలా, విందులా చేసుకునేవారు"

"అదేటి? అట్నించిటు జెబుతున్నట్లున్నావు" అనకుండా ఉండలేకపోయాడు చంద్రం- అంత విచారంలోనూ.

"లేదు. సరిగానే చెప్పాను. సాములోర్లు చెప్పినట్లే ప్రపెంచకమూ, జన్మా వొట్టి మాయే. ఎప్పుడు పగిలిపోతుందో తెలీని నీటిబుడగే. దీనిలో సుకం తక్కువా దుక్కమెక్కువా. చంటిపిల్లల కాడినుంచీ రోగాలూ, రొచ్చులూ, దరిద్రమూలాటి అనర్థాలతో నిండిన యీ పాడుబతుకునొదిలెయ్యడం. ఇది సంతోషం కలిగించే సంగతీ, ఆనందించవలసిన అంశమూ కదా? ఎవరు బాగుపడ్డా బాగుపడడమే. అందుకని ఎవరు చచ్చిపోయినా నలుగురూ వెళ్ళి వాళ్ళ (చనిపో

యినవారి) అదృష్టాన్నభినందించి నవ్వు ముఖాలతో శవాన్ని చూసి మరీ వొచ్చి వారు. మనిసి బతుకుని బాగా అర్థం చేసు కోగలిగితే ఈ ఆచారమే సబువయినదని పించి తీరుతుంది. కాని ఎందరుంటారలాటి జ్ఞానులు?

అందుకే క్రమంగా యీ ఆచారం ఉల్టా సీదా అయింది. పుడితే సంతోషించి, చని పోతే ఏడుస్తున్నాం. మనం ఏడుపులతోనూ, పెడబొబ్బలతోనూ, బాజాలతోనూ, మందు గుండు సామాన్ల పేలుళ్లతోనూ శవాన్ని సాగనంపితే ఇంక మృతులకి మనశ్శాంతేం మిగులుతుంది? ఎవరి శవానికి తక్కువ గోలతో పీడుకోలు లభిస్తుందో ఆల్లకే ఆత్మ శాంతి, మనశ్శాంతి ఉంటాయి పైలోకంలో. ఔనో కాదో నువ్వే ఆలోచించు. సబవూ బేస బవూ నువ్వే తేల్చు" అంటూ ఆ మాటా యీ మాటా చెప్పి తన ధర్మం నెరవేర్చి అతన్ని మళ్ళీ గుడిసెకు నడిపించి తాను వెళ్ళిపోయాడు గంగన్న.

చుక్క గుడిసెముందే కూర్చుంది ఒంట రిగా చీకట్లో.

అయ్యకెదురెళ్లి చెయ్యి పట్టుకుని తీసు కొచ్చి కూర్చోబెట్టింది.

"పెద్ద- ఏటిసెప్పాడయ్యా? "

ఆ ప్రెశ్నకి ఒక్కసారి అతనామె ముఖం లోకి చూశాడు.

అంతలోనే అతని మనసులోకేం ఆలోచ నొచ్చిందో ఏమో ఒక్కసారిగా లేచి పరుగు పెట్టసాగాడు.

"అయ్యా!" బావురుమంటూ వెంటపడింది చుక్క. నాలుగంగల్లో తండ్రినందుకుంది. చేయిపట్టుకుని తనవేపు తిప్పుకుని-

"నా ముఖం సూడయ్యా. అమ్మ పోయింది. నువ్వూ పోయి నన్ను అనాదను జేసేస్తావా? అమ్మా లేక అయ్యా లేక నాకు బతుకెలాగ? బయమెయ్యదూ వొంటరిదా నికి? నామీన్నీకు జాల్లేదా అయ్యా? "

"సుక్కా!" అతనామెని కౌగలించుకుని చిన్నపిల్లాడిలా ఏడిచేశాడు. ఇద్దరూ యిస కలో కూలబడిపోయారు.

"నీ మాట నిజమే. నీ బాద నిక్కంవే. నీ బయమూ నికరంవే. కాని మీయమ్మ లేకుండా నేను బతకలేనే. మీయమ్మ నా కంటికెలుగు, వొంటికి పేనం. గగనం లేని నేను ప్రాణం లేని కట్టెనే. నేనుండుపయో గమేటి? నన్ను కట్టిపడెయ్యకే నీ కన్నీ ళ్లతో. ఆ అమ్మని సాగనంపినట్లే నన్నూ సాగనంపేవే. నన్ను సచ్చి సుకపడనీవే బతికి బాదపడకుండా" అంటూ అంత వాడూ బావురుమన్నాడు.

అతని ఆవేదన కాధారం లేకపోలేదు.

అతని రోదనకు కారణం లేకపోలేదు.

అయ్యకి కొడుకుగా ఉన్నన్నాళ్ళూ అతని కలలూ కోరికలూ వేరు. మస్తుగా డబ్బు సంపాదించాల. డబ్బుతోటే ఉంది మజా. డబ్బుతోటే ఉంది బతుకూ, ప్రెపంచమూ. మనిషికి డబ్బుంటే అన్నీ ఉన్నట్టే. మరేది లేకపోయినా ముంచుకొచ్చేది లేదు. సొమ్ము తోనే సుకముంది. అలా అనుకునేవాడు, తన బతుకులోకి ఓ ఆడదొచ్చి తనామెకు పెనిమిటయ్యేదాకా. ఆమె వొచ్చాక అంతా మారిపోయింది. ఆలోచనలే మారిపో యాయి. వేటకెడితే ఎంతటంతటి తిరిగెళ్లి పోదామా అని తొందర. ఔను. తన కోసం ఆడది వొళ్లంతా కళ్లు జేసుకుని వొడ్డు నెదురు చూస్తుంటుంది. తన పడవ కంటి కానడమేమిటి. సంబరంతో ఎగిరి గంతులే వేస్తుంది. తను కాసిని సేపలే తెచ్చినా- "అమ్మో! ఓలమ్మో! ఎన్ని సేపలు కొట్టుకొ చ్చావో!" అంటూ ఆశ్చర్యమే, ఆనందమే. పడవలోంచి సేపలని అడావిడిగా బుట్టకె త్తేసి, బుట్టని నెత్తిమీదెట్టుకుని సేతికి సేయందించి నడిపించి అయినకాడికి సావు కారి కమ్మేసి గుడిసెకి తోవతీసేది.

ఆ గుడిసె తామిద్దరే కప్పుపడేసుకున్నది. ఒకరికిద్దరయినా తానింకా అయ్య గూటి లోనే ముడుసుకుపోతుంటే, ఆమే కనువిప్పు

కలిగించింది. "పడుచు జంట మనం. మందిమధ్యా ముసలోళ్ల మధ్యా మనమేటి మనసువిప్పుకుని మురియగలం? ఆళ్లకీ యిరుకే మనకీ యిరుకే. అదీకాక నీ అంత టోడివి నువ్వు. నీకంటూ ఓ గుడిసే గుట్టూ లేకపోతే ఎలా? పెళ్ళాన్ని నేనొచ్చానా, అలాగే రేపు పిల్లా పిచికా పుట్టుకొస్తారు. అప్పుడు మాత్తరం అవతలికి పోవొద్దా? అదేదో ఇప్పుడే చేస్తే ఆళ్లకీ సుకం, మనకీ సుకం. సేచ్ఛగా ఊసులాడుకోకుండా గుసగుసల కాపరమెన్నాళ్లు చేయగలం, చేసినా త్రుప్తేటుంటుంది, తనివేంతీరుతుంది? " అందామె. తనకీ నిజమే అనిపించింది. అమ్మా అబ్బా అదే మనలేదు సరికదా అంగీకారమే అన్నట్లు తలూపారు. అంతే. తాము గూడుకట్టుకున్నారు. గూడంటే గూడుకాదు. మంచిదే. అయితే అది గుడ్డాగుడుసూ పడేసుకుందుకూ, ముద్ద మింగేందుకూ, ఎప్పుడేనా పగటేల నడుంవాల్చేందుకూ అంతే. సీకటడిందో నాలుగు ముద్దలడావిడిగా నోట్లో కుక్కేసుకుని... ఇద్దరూ చెట్టాపట్లాలేసుకుని సముద్ర పొద్దుకి పోడమే. పారిపోడమే. ఇసికలో కూర్చుని ఊసులూ, ఉల్లాసాలూ సరసాలూ సల్లాపాలూ, మధ్యమధ్య-గగనం ఉడికించి తెచ్చిన అలసందలో, వేపి తెచ్చిన వేరుసెనగకాయలో, పలారం, ఇసకలో గుజ్జనగూళ్లు.

ఎన్నెన్ని కబుర్లు సెప్పేదో అది! చెప్పినూసు చెప్పకుండా చెప్పేది. సముద్రంలో సేపల్లా దాన్నోటినిండా కబుర్లే. చెలమలోకి నీళ్లూరినట్లు ఎప్పటికప్పుడే ఊసులూరిపోయేవి. అది సెబుతూంటే, తను వింటూంటే గడియలు గడిసేదే తెలిసేది కాదు.

ఇసకొడ్డున్జూసి సవుద్రంకంటే వెర్రెక్కిపోయేవాడిని. చిలిపి మాటలా, శృంగార చేష్టలా, పాటలా, పదాలా, ఒకటేమిటి? తెలీకుండానే తెల్లారిపోయేది పెతిరాత్తిరీ. చాటు కోరితే, కోరికయితే, పొద్దునే పడవలచాటు, పక్కనే పూలు పరిచినట్లు మెత్తని యిసుకా, అవి మరీ హుషారిచ్చేవి.

మనిషి సుకం ఆడదానిలోనే ఉంది, డబ్బులో కాదు. తను సుఖపడ్డానికి తెగకష్టపడీ డబ్బు సంపాదించీ రెక్కలు ముక్కలు జేసుకునీ, రేయీ పగలూ రాసి రంపానపెట్టుకునీ చంద్రం చెందర్రావవక్కర్లేదు. చెంద్రంగానే బలే మజా అనుబవించొచ్చు. కరీదయిన బట్టలు, వరి కూడు, పెద్దిల్లు, డబ్బు, వాటిల్లో కాదసలు సుకముండేది. కట్టుకున్న ఆడదానిలో, మగనాలిలో. అది తలుసుకోవాలేకాని పూరిగుడిసెనే యింద్రభవనం చేసేగల్దు. ఉప్పుసేపనే కోవాబిళ్ల చేసేగలదు. గెంజినే అమ్రుతంగా మార్చగలదు. మగాడికి రేకబాగుండి సరయిన మగనాలి దొరకాలే కాని యింక ఆడి జీవితం పట్టింది బంగారమే. బతుకంతా సంబరమే. తనకా అదురుష్టరేకుండబట్టే గగనం తోడయింది. ఇద్దరూ మూడుముద్దులూ ఆరు ముచ్చట్లూగా బతికారు బతికినన్నాళ్లూ. తమ మురిపాలూ మైమరపూజూసి ఏ దేముడికి కన్నుకుట్టిందో, ఏ పాపిష్టోడి పాడు కన్నుపడి దిష్టి తగిలిందో, అది తననొదిలిపోయింది. అంతా తన శని.

తోడుపోవడంతో తనకేమీ తోచక తెల్లమొహంవేసుకుని కూర్చునేవాడు మొదట్లో. ఏమీ చెయ్యబుద్ధికాదు. బతకబుద్దే కానోడికి మరేటి సేయాలనిపిస్తుంది?

"నన్ను సచ్చిపోనివ్వవే సుక్క, సిన్నదానివయినా నీ పాదాలకు మొక్కుతాను" అని కళ్ల నీళ్లతో ఏడుకునేవాడు.

"మతిపోయిందేటయ్యా అమ్మతో? ఏం మాటలవి? తండ్రి కూతురికాళ్లట్టుకోడమా! అవ్వ! ఎవరేనా వింటే నవ్వరూ? "

"నవ్వుకుంటే నవ్వుకోనీ. నా బతుకెలాగూ బగ్గంపాడే అయింది. భార్యలేనివోడి బతుక్కి ఏటుంటది వ్యద తప్ప? అమ్మా! నా బాధ రదంజేసుకోవే సిన్నదానివయినా. మీయమ్మంటే నా కొల్లమాలిన పేమ.

నువ్వు నమ్ము, నమ్మకపో. అది సనిపోయే సరికి నేను సంబాళించుకోలేకపోతున్నాను. అది లేనప్పుడు నేనెందుకూ బతికుండడం? ఏం బాముకుందామని? అందుకే... దాని కట్టెతోపాటు ఆకట్టెలసితిలోనే నేనూ సచ్చిపోవాలనుకున్నాను. అదెక్కడికెడితే దానితో పాటే నేనూ పోవాలనుకున్నాను"

"చూస్తా చూస్తా నిన్నెలా వొగ్గుకోగలనయ్యా? "

"నీకెందుకే నేను? ఓ... నీకు పెళ్ళీ పెటాకులూ చేసి నిన్నొక అయ్యచేతిలో పెట్టాలి కదా? లేకపోతే నువ్వొంటరిదానివై పోతావు కదూ? అది జ్ఞప్తేలేదు నాకు. రేపట్నించే సూత్తాను. ఎంతతొందరగా నిన్నోయింటికి పంపిస్తే అంత తొందరగా నేను ఆవిడ దగ్గరకెళ్ళిపోవొచ్చు"

"అయ్యా!"

"ఏటి? "

"సిన్నది... దీనికిన్నెలా తెలుసు? సిగ్గునేకుండా ఎలా సెబుతూందనుకోపోతే నాదో సిన్న మనవీ మాటా"

"కన్నతండ్రినే. ఇప్పుడు నీకు నేన్దప్ప ఎవరున్నారు? నాక్కాకపోతే మరెవరికి సెప్పుకుంటావు? నాముందు బయమెందుకు? నిస్సంకోచెంగా నీ మనసులో మాట చెప్పు"

"నా వొంటకి పెళ్ళీడొచ్చిందేమో కాని నా మనసుకి మనువు వయసింకా రాలేదు"

"మనసుకి మనువ్వయసా!"

"ఔను. నాకెవరి మీదా యిష్టం కలగలేదింతవరకూ. నేను నీకూతుర్ని. గగనమ్మ కూతుర్ని. నేనూ మీలాగే మనసయితేనే తప్ప మనువాడను"

"ఆ!" ఆశ్చర్యపోయాడతను తన అమ్మాయివంక చిత్రంగా చూస్తూ.

"ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా? అన్న సామెతను నిజం చేస్తున్నావే నువ్వు"

"కాదయ్యా. నువ్వూ అమ్మా ఎంత ప్రేమగా బతికారని! బతకడమంటే అదీ బతకడం! నాకూ మీలాటి బతుకేకావాలి. నా కోరిక తప్పా అయ్యా? "

ఏమనగలడా తిరుగులేని ప్రశ్నకి? "తప్పేమీ కాదులే" అన్నాడు మెల్లగా. ఆ జవాబుతో తననుతాను బంధించుకోడమే నని తెలిసినా.

"తరవాత మరోమాట. నా గురించి కాదులే. నీ గురించే"

"ఏమిటి? " చిత్రంగా చూశాడు, చిన్నదంత చమత్కారంగా అనేసరికి. ఈ చిన్నదానిలో ఎంత తెలివుంది! ఎన్నెన్ని ఊహలున్నాయి. ఎలాటాలోచన్లున్నాయి! యింత ఆరిందా ఎప్పుడయిపోయింది తన పిల్ల? ఏమీ ఎరగనట్లే ఉంటుందే పైకి!

"కట్టె కాలిపోడమంటే అమ్మ మళ్ళీ కొత్త జనమమెత్తిందనే. ఆ బతుకు భూమ్మీద కాక ఆకాశెంలో సర్గంలో"

"ఊ"

"అక్కడ మళ్ళీ ఆమె కొత్త జనమెత్తినట్లు. కనుక... నువ్వు మళ్ళీ ఆమె మనసులో పడాలి. అప్పుడే కలిసుండగలరు మళ్ళీ"

"అంటే నేను ఏటి సెయ్యాల? "

"మరో గనకార్యెం సెయ్యాల. అమ్మ మనసు చూరగొనాల"

"బెస్తోణ్ణి. నేనేం బెమ్మాండప్పనులు చెయ్యగలను? "

"అప్పుడు చేశావుగా? చేసి చూపావుగా? "

"అంటే నేను మళ్ళీ మరోసారి ఎవరూ పట్టుకోలేనంత పెద్ద శాపను పట్టి గనకార్యం జేస్తే స్వర్గంలో కూడా మీ అమ్మ మళ్ళీ నాదౌద్దంటావ్? "

"ఔనంతే. ఆనాడెలాగ సేపతో ఆమె మనసు దోచుకున్నావో, అలాగే మళ్ళీ మరో పెద్దసేపతో ఆమె మనసు దోచుకోవాలి. అంతవరకూ నువ్వు చావు తలపెట్టకూడదు. నువ్వు మరోలా సచ్చిపోతే అమ్మనందుకోలేవు"

అది బెదిరింపా అంటే బెదిరింపే. కాని లాలింపూను.

తియ్యని అబద్ధమూ అంటే అదే. అయితే జీవితసత్యమూను. ఏదయినా అతన్ని అసహజంగా మరణించకుండా ఉంచేందుకే, అతన్ని బతకురాటకి సాధ్యమయినంత కట్టి పడెయ్యడానికే.

అతని బతుకు కోరే తప్ప చావు కోరి కాదు.

సుక్క విసిరిన వలలో చేపపడింది.

ఆమె ప్రయత్నమూ ప్రయాసా ఫలించాయి.

అతను బొట్టె చేతిలో చెయ్యేసి మరీ మాటిచ్చాడు. "నువ్వు చెప్పింది నిజమే తల్లీ. సాహసం చేసిన మొగాడినే సైయంటుందా డది. అందుకు మేమే నిదర్శెనం. ఓసారి తెగించి ఆమె మనసు నాకట్టుకున్నాను. మళ్లీ అలాటిదే చేసి ఆకాశంలో ఆమెనందుకుంటాను. అంతే తప్ప మామూలు చావు చావను"

చుక్క మనసు కుదుటపడింది తుఫాను తప్పించుకుని వొడ్డు చేరిన నావలా.



★ ★ ★

ఆనాటినుంచీ చెంద్రయ్య ఆశయం పెద్ద చేప అతి పెద్ద చేప! అది జీవితాశయమనాలో మరణాశయమనాలో!

నడిచినడిచి అక్కడాగాడు చంద్రయ్య నేలమీద కూలబడి. "నా గగనమా! ప్రేనమా! ప్రేమా! బతుకా! నిన్నిక్కడే నా సేతుల్లోనే బుగ్గిజేసి, అగ్గెట్టి బుగ్గిజేసి ఆకాసెంలో కంపేశానే, నన్నూ తొందరగా నీకాడకట్టుకుపోవే. నువ్ లేనొంటరి బతుకు బతకలేకపోతన్నానే. సద్దావంటే పెద్దసేపొటొచ్చి పడింది నా ప్రేనానికి. తొరగా సేప దొరికేటట్లు సెయ్యవే" అంటూ ఏడుస్తూ అక్కడి మట్టీ ఇసుకా గుప్పిళ్లలోకి తీసుకువొదుల్తూ, ఆ మట్టి చేతులు వొంటికీ ముఖానికీ రాసుకుంటూ, "నిన్నగ్గీ బుగ్గీ జేసిన యీ కాడ మట్టిని ముట్టుకుంటే నిన్ను ముట్టుకుంటున్నట్లే ఉందే. నువ్వే నన్ను కావలించుకుంటున్నట్లుంటూందే గగనమా!" అని ఏడుస్తున్నాడు. అతని కథ తెలిసి, అతని విరహవేదనను కళ్లారా చూస్తున్న మాధవ్‌కి జతబాసిన మగకపోతమూ జంట వీడిన పురుషక్రౌంచమూ జ్ఞాపకం రాసాగాయి. విశృంఖలతకి తావుండే బెస్త వాళ్లలోనే పుట్టి పెరిగి మసలినా యీ వృద్ధుడు గతించిన భార్యకోసం ఎంత విశుద్ధ విరహవేదనను అనుభవిస్తున్నాడు. దాంపత్య వ్యవస్థకింత కంటే చక్కని హారతింకేం కావాలి? పెళ్ళి చేసుకున్న భార్యని యింత అపారంగా ప్రేమిస్తున్న యితనికి దేవదాసూ, మజ్నూ (ఖైస్) సలీంలయినా సాటిరాగలరా? వివాహం పురుషుడి ప్రేమని చంపేస్తుందనే అపప్రథకితను చెంపపెట్టూ గొడ్డలి వేటూ కాదూ?

ఏడ్చి ఏడ్చి చంద్రయ్య లేచాడు. అప్పుడు చూడగలిగాడు మాధవ్ అతన్ని స్పష్టంగా. చంద్రయ్య కొకచెయ్యి ఎడమ చెయ్యి లేదు! మణికట్టునుంచి దిగువ మరేమీ లేదు!

చంద్రయ్య లేచాడు. వెనుదిరిగాడు. అయితే అతను గుడిసెవేపు వెళ్లడంలేదు. నీటివొడ్డువేపు పడవలు నిలిపినచోటుకి.

ఈ వృద్ధుడు, యీ నిశీధిలో, వొంటరిగా.

ఏం చేయదలుచుకున్నాడు? అతని ఉద్దేశమేమిటి?

ఉత్సుకతో గమనించసాగాడు అతన్ననుసరి

స్తున్న మాధవ్.

★ ★ ★

చిన్నదే నావ. కాని వొక్క మనిషి దానిని ఇసుకలోంచి నీటిలోకి తొయ్యడం మాత్రం చిన్న పనికాదు. తేలికకాదు. చంద్రయ్య వొంటిచేత్తో కష్టపడుతుంటే ఊరికే చూస్తూ నిలుచో లేకపోయినట్లు, అతని దగ్గరకు వెళ్ళి సాయంచేశాడు. నావ నీట్లోకొచ్చింది. కటిక చీకటిలో కల్లోల తరంగిణిలా ఉంది కడలి. చంద్రయ్య నావ నీటిలోకి రాగానే కొంచెం దూరం తోసి దానిలోకెక్కాడు. మాధవ్ కూడా ఎక్కబోతుంటే.

"ఎవరు మీరు? కొత్తవారిలా ఉన్నారు. తెప్పమీద సంద్రంలో కెళ్లడమంటే కార్లో సికారెల్లినట్టుగాదు. కుదుపులు వొరుగులు, కడుపులో తెమిలేసుకొస్తుంది. తెప్ప అటూ యిటూ ఊగుతూంటే, అలవాటులేనోళ్లకి నీళ్లల్లోపడి సచ్చిపోతామేమో అని గుండె జారిపోతది. పగలే కూసోలేరు. అలాటిది యిలాటిరేతిలేళ" అన్నాడు చంద్రయ్య.

"మరి మీరెందుకెళ్తున్నారు? నాకు రాత్ర యితే మీకు మాత్రం పగలౌతుందా? రాత్రి వేళ చేపలు పట్టరని విన్నాను. తోడెవరూ లేకుండా మీరు మాత్రం ఎందుకూ సముద్రంలోకి వెళ్ళడం? మిమ్మల్ని వొంటరిగా వొదిలెయ్యలేకే తోడుగా రావడం"

"నాదారి యేరు" తెడ్డెయ్యకుండనే అన్నాడు.

"ఇప్పుడు మీదారే నాదారీ"

"నేనంటే ముసిలోణ్ణి. బతుకులో ఉచ్చాహం ఉడిగిపోయినవాడిని. నా బతుకెప్పుడో గోదారయిపోయింది. మీరుచిన్నోళ్లు. నాతో మీకు సాటేటి? ఎక్కుణ్ణించో వొచ్చిందీ గంగలో కలవడానిక్కాదు గందా? "

"మీరు పక్కనుండగా నేనెందుకు ప్రమాదంలో పడతాను? నాకేమీ భయంలేదు. నేను చిన్నవాడిని. నాకూ ఎవరూ లేరు. ఏమేనా అయినా బాధాలేదు. మీతోటే నేనూను"

"వొట్టి మొండోరినాగున్నారే! నా మాటిని ఎనక్కిపొండి. నేనందరిలా కాదు. శానాలో పలికెడతాను. పైగా సీకటీ, సిన్నతెప్పా. అటు వొరగనూ యిటు వొరగనూ కెరటాలకి. గుండెబేజారయి ఎనక్కి పోదామంటారు మధ్యలో. నావల్లకాదది" భయపెట్టాడు.

"ఎంతదూరం వెడతారేం నీటిలోపలికి? "

"నేలమీదయితే దూరాలూ అవీలెక్క. గంగలో దూరంకాదు ముక్యం. బార...బారంటే లోతు జెబుతుంది. మామూలుగయితే నలబైయాబై బార్లవరకూ ఎల్తారు. నేనలాకాదు. ఎనబై బార్లు కూడా దాటిపోతాను"

"ఎందుకూ? "

"పిండికొద్దీ రొట్టెలాగే. లోతుకొద్దీ సేప. పెద్దసేపలడాలంటే లోతుకెల్లాలే"

సముద్రపొడ్డున ఇసుక, నీటిలో కొంచెం మేరవరకూ చిరు కెరటాలు. ఆపైన చిన్న చేపలు. ఇంకా లోపలికెళ్లితే పెద్ద చేపలు, ఇంకాలోపలికి సొరలూ తిమింగిలాలూ. రత్నాలుండేది లోతయిన సముద్ర గర్భంలో. బడబానలముండేదీ సముద్రపు అతిలోతులోనే. ఔను లోతుకొద్దీ చేప! నిజమే.

"నదురయిన సొరసేప తారసపడాలేకాని ఏటగాడికి వొళ్లూ తెలియదు. లోతూ తెలియదు. అదెంతదూరం దీసుకెడితే అంతదూరమూ దానెంట బోడమే. అదో మనవో దేల్చేసుకోడమే, నేనలాటోడిని. సరయిన సొర ఎదురయిందో అది నా సేతినయినా ఛిక్కాల, నేను దాని నోటికయినా చిక్కాల. సగంసగం ఏట జేసి సవట్నాగ సేపనొగ్గేసి పొర్రావడం మన వొంశంలోనేదు"

"మీ ఎడమచెయ్యి మణికట్టుకింద లేదే? "

"ఎలాగుంటది? అప్పుడెప్పుడో ఏటకెడితే సొరసేపెదురుపడ్డది. మరీ పెద్దది కాదు కానీ బారెడుపైనే ఉంది. సేప సిన్నదే కాని

బవుటక్కరిది. సరికిసరి అంటూ నాతో సమరం జేసింది. పొట్లాటెట్టుకుంది. ఎంతకీ లొంగిచావదే! నేనూ వొక్కణ్ణే. అదీ వొక్కర్తే. నాకద్దీసిపోదు, దానికి నేను తీసి పోను. పోటాపోటీ అయిపోయింది. సివరి కది లొంగినట్లే లొంగుతూ వొక్కసారి సెయ్యందుకుంది. దానెత్తు గ్రయించి సెయ్యెనక్కిలాక్కునే లోగానే సివరందిపో యింది దాన్నోటికి. ఏళ్లూ, అరిసేతిలో సగమూ ఫలారం జేసేసింది. అయినా నేనొ గ్గలేదు. తెడ్డుతో బాది తేరుకోలేకుండా బాది తెప్పలో పడేశానొంటిసేత్తోనే. వొంటిగానే వొడ్డుకొచ్చాక నలుగురూ సివాట్లెట్టారు. సేప కోసం సెయ్యి దీసుకున్నావా! అని. కాన్నాకు పంతమంటే పంతమే. పౌరుసంపౌరుసమే. గచ్చాకూ పుచ్చాకూ వొయిజ్యం జేస్తే గాయం మానింది కానీ సెయ్యి మర్రా లేదు. ఎలా గొస్తది, సేపనోటిబడితే? అది యీ మొండి చెయ్యి కద"

"బాగుంది మరి వొంటిచేత్తో పడవెయ్య డమూ వేటాడ్డమూ కష్టంకాదూ? "

"దేముడు మనిషికి రెండు సేతులిచ్చాడు గనుక ఆటితో పనులు జేసుకోడం అలవాటు జేసుకుంటాం కాని మూడు సేతులివ్వలేదే మని మదనపడం. అలాగే వొంటిసెయ్యి యితే దాన్తోనే సులువు జేసుకుంటాం. పోయిందానికెంతేడిస్తే మాత్తరం అది తిరి గొస్తాదాయేటి? "

"గంగాపుత్రులు చీకటిపడ్డాక చేపలు పట్ట రుగా? పట్ట కూడదుగా? "

"నిజమే. గంగతల్లి నిద్దరోతుంది"

"గంగ... నీరు నిద్రపోతుందా! మరి యీ కెరటాలూ అవీ? "

"ఒక్కోరి నిద్దరొక్కోరకం. కొందరయితే కళ్లు సగం తెరచుకుని కోడికునుకు కునుకు తారు. మరికొందరు పుస్తకంలా బుద్ధిగా కదలకుండా పడుకుంటే మరి కొందరేమో అటు ఇటూ దొర్లేస్తూ దున్నేస్తూ అతలాకు తలం నిద్ర తీస్తారు. అలాగే గంగతల్లి పైన కెరటాలతో కదులుతున్నా లోపల నిద్దరో తుంది"

"ఓహో! మరి చేపలో? అవి నిద్ర పోవా? "

"అవీ నిద్రపోతాయి. చీకటడ్డాక ఏట కూడనిదే. గంగతల్లికపచేరమే. కాని ఈ గంగపుత్రుణ్నాయమ్మేటి అన్దు. అలీసెంగా అర్ధరాత్రిల్లు జేరిన కొడుక్కి అమ్మ తలుపు దీసి అన్నంపెట్టదూ ఆగ్రయించకుండా? అలాగే మా గంగమ్మకి నేనంటే ముద్దు. నన్నేటి అన్దు. అందుకేగా నీటిలోకి దిగే ముందు దణ్ణవెట్టీసుగున్నాను! ఔను ఇంతసేపు మాటలాడుతున్నా మీరెవరో చెప్పారుకాదు"

"పేరయితే మాధవ్. కాని నన్నిక్కడ కొందరు కాషాయస్వామి అనుకుంటారట"

"కాషాయసోములోరా! తమరేనా? సాములోరనగానే గెడ్డాలూ మీసాలూ పెంచి పేద్దజుత్తుతో ముసిలోరులావుంటారనుకు న్నాను. తవరి గురించినకేం? ఇన్నాను. శానామంది నోటే యిన్నాను. దరిశెనమే కాలేదింతవరకూ. పోల్లెండి. ఇప్పుడానోటూ తీరిపోయింది. దండాలు సాములోరూ"

"నేను స్వామినికాను, సామాన్యుణ్ణి. మీ వాళ్లూరికే అలా భ్రమపడుతున్నారంతే"

"లోతునీరు తొణకదు. గొప్పవారు మిడిసి పడరు. దయుంచొకటిజెప్పండి. నేన్జేసే యీ పయనంలో నా బతుకులో పట్టనంత పెద్ద సేప సిక్కుతుంధా, సిక్కదా? "

"చిక్కదు. ఎందుకంటే మిట్టమధ్యా హ్నమూ నట్టనడిరేయీ సవ్యమైనవీ, జయ ప్రదమయినవీ కావని విజ్ఞులంటారు"

"బయలెల్లేదిప్పుడే అయినా ఎనబై నూరు బార్ల లోతుకెళ్లేసరికదిగో ఇదుగో అని వేగు చుక్క పొడవనే పొడుస్తుంది. అప్పుడే సేప లలో సెలనమూ కలుగుతుంది"

అతని ఉద్దేశం అర్థమయింది మాధవ్‌కి. చంద్రయ్య సముద్రం మీదకెడితే ఒక్కొక్కసారి మూడు నాలుగు రోజులదాకా

రాడు. అన్నవూ ఆహారమూ లేకుండా పిచ్చి వాడిలా పెద్ద చేపో పెద్ద చేపో అంటూ నీటిమీద తిరుగుతాడట. ఒక్కడే నడపగలి గేందుకని చిన్నతెప్ప, కనక లోతున పనికి రాదు. బాగా ప్రమాదం. అయినా సరే లెక్క చేయడుట. పెద్ద చేపపిచ్చిలో ఇన్నా ళ్లుగా అతన్ని కేవలమూ అదృష్టమూ గంగా అవే కాపాడాయట.

"దేనికయినా ప్రారంభానికే ముహూర్తం. ఇది మంచి ముహూర్తం కాదని"

"సుబం పలకరా మంకెన్నా అంటే" విసు క్కుని "పదండయితే" అన్నాడు చంద్రయ్య. ఇద్దరూ వెనక్కి వొచ్చేశారు. ఇసకలోకి తెప్ప నీడ్వడంలో సాయం చేశాడు మాధవ్. అతను వద్దంటున్నా వినక.

"రేపు మీరు మంచి ముహూర్తమెడుదు రుగాని. తమకాడికొస్తాను" అని తన గుడి సెవేపు వెళ్లిపోయాడు చంద్రయ్య. మాధవ్ బసకి నడిచ్చాడు. నిద్రపోడానికాలస్యమ యినా లేవడం మాత్రం తొందరగా వేళకే లేవాలి అని తననుతాను హెచ్చరించుకు మరీ శరీరం వాల్చాడు. అప్పటికి చాలా రాత్రయింది.

అతను గట్టిగా కళ్లు మూసుకున్నాడు నిద్ర పోవాలని.

★ ★ ★

సాల్టు కంపెనీకి బయలుదేరాడు మాధవ్. అక్కడకు చేరుకునేసరికి తొమ్మిది గంటలయింది.

అతన్ని చూస్తూనే అకౌంటు పుస్తకాలు ముందుంచి "నిన్నటివి" అన్నాడు ధర్మా రావు.

"వెరీగుడ్" అన్నాడు మెచ్చుకోలుగా. ఒక అరగంటపాటు తనిఖీచేశాడు.

"మీరు మంచి తెలివయినవారు. ఎంత చక్కగా రాశారు ఏ పద్దుకవి! ఏ రోజు పని ఆరోజు చేసేసుకుని వాయిదా వెయ్యకపోతే పని తేలికగా ఔతుంది, పొరపాట్లూరావు. ఏమంటారు? "

ధర్మారావేమీ అనలేదు. పని వాయిదా వేస్తే రెండు ఉపయోగాలున్నాయి. మొద టిది లొసుగులాలోచించి, పట్టుబడకుండా కొంత సంగ్రహించవొచ్చు.

"మీరింకా బాధపడుతున్నట్లే ఉన్నారు. పద్ధతి మారినందుకూ, మీ పీకలమీదకీ స్వతంత్రం మీదకీ నేను దాపురించినం దుకూ. కాని నా మనసేం చెబుతూందంటే ఏదో వొకనాడు మీరు మీ స్వచ్ఛమయిన సత్యశీలమయిన పనికి, నిజాయితీకీ సంతృ ప్తికరంగా బహూకరించబడతారు. ఆ మంచిరోజుకోసం ఇద్దరమూ ఎదురు చూద్దాం. ఒక్కసారి లోడింగ్ చూసి నేనటు నుంచటే అనకాపల్లి వెళ్తాను. మీరు మీ పని చూసుకోండి" అని వెళ్లిపోయాడు.

మాధవ్ అనకాపల్లి వెళ్లి పనులు చూసు కుని పూడిమడక తిరిగివచ్చేసరికి నాలుగు దగ్గరగా ఔతోంది.

★ ★ ★

ఆ దృశ్యం చూస్తుంటే కడుపు నిండిపో యింది మాధవ్‌కి.

నలుగురు యువకులు కారమ్స్ ఆడు తోంటే ఇద్దరు పిల్లలు చూస్తున్నారు. ఇద్దరు పెద్దవాళ్లు (గుళ్లబోర్డు పిన్‌బోర్డ్) ఆడుతు న్నారు. నలుగురు చైనీస్ ఛక్కరులో మునిగి ఉన్నారు. ప్రపంచమే మరిచి ఇద్దరు చదరం గంలో లీనమయ్యారు.

పదిహేను రోజులలో ఎంత మార్పు. ఎంత అభివృద్ధి! మొదట ఆటసామగ్రిని సముద్రపొడ్డున పెట్టి చిన్న పిల్లలనాకర్షించి ఆటలు నేర్పాడు. నలుగురు పోగవడంతో పెద్దవాళ్లూ, యువకులూ అదేమిటో చోద్య మని చేరారు. ఆటలో ఉండే లక్షణం చూస్తుంటే చాలదు. ఆడాలి, పాల్గొనాలి, స్త్రయికరుతో పిక్కని కొడితే అది వెళ్లినట్లే వెళ్లి వెనక్కి రావడం, తనయితే బాగా వెయ్యగలననిపించడం, పిల్లలని లేపి యువ కులూ పెద్దలూ కూర్చోడం,

అలాగే పులీమేకా ఆటతో పోలికలున్న ఛెయినీస్ చెక్కర్ ఆట. పేరుకి పిల్లలు కూర్చున్నా "అలా కాదిలా నడుపు" అంటూ యువకులు ఆటలో దూరిపోడం, చదరంగం మాత్రం పెద్దలకే పరిమితమౌతోంది. పిన్ బోర్డులో స్కోరు కావాలి అంటే అంకెలు తెలియాలి. కూడికలు రావాలి. అందుచేత ఆడవాళ్లతోపాటు లెక్క తెలిసినవాడొకడుం టున్నాడు.

"నువ్వాడి పచ్చమై అన్నాయం జెయ్యకేం? "

"అలాటనుమానాలుంటే నువ్వే లెక్కజూ సుకో"

"నాకు అంకెలూ, లెక్కలూ రావుగా? "

"ఐతే నేర్చుకో. లేదా గమ్మునపడుండి సెప్పినట్లినుకో"

ఆ మాటతో పౌరుషాలొచ్చి అందరినీ పర్యవేక్షిస్తూ దూరంగా నిలుచున్న మాధవ్ దగ్గరకొచ్చి "ఆడికే అంకెలొచ్చినని ఇర్రయీ గుతున్నాడు. అదేటన్నా బ్రెమ్మవిద్యా? మేం నేర్చుకోలేమా? చెప్పండి సామే"

"అదేమీ బ్రహ్మవిద్యకాదు. పట్టుమని పది రోజుల్లో ఆటకవసరమయ్యే అంకెలూ లెక్కలూ మించే నేర్చుకోగలరు. పట్టుదల ఉండాలంతే"

"వచ్చేవరకూ వొదలం. ప్రెమాణం. ఎప్పు డారంబిస్తారు? "

"రేపటినుంచి రాత్రేడునుంచీ ఓ గంట"

"అది మాకు కల్లేళకదా? "

"గంటేగా? వెలుగున్నంతసేపూ ఆటలు. చీకటిపడగానే చదువు కావాలంతే. తరవా తనే మరే పనయినా. నా వీలు కూడా ఆలో చించాలి"

"సరే అలాగే మాకు పలకలూ బలపాలూ అట్టుకురండి. అన్నట్టు మరి దీపాలో? బుడ్డిదీపాలు సముద్రపొద్దున గాలికారిపో తయే"

"తుపాను షెల్టరుకి కరెంటుంది. కూర్చుం దుకు వరండా ఉంది"

"సరే పలకల్లబ్బులు మేమే ఎట్టుగుంటాం. మీ దరమమా అని ఈ ఆటలు దెచ్చి పడే శాక మేం పేకముక్కలు మానీశాం. చీట్లాట లేకపోడాన డబ్బులు బాగానే మిగులుతు న్నయి"

"కల్లు కూడా మానేస్తే కోటీశ్వరులే ఐపో తారు మీరు పడేకష్టానికీ ఆర్జించే సంపాద నకీ" నవ్వాడు మాధవ్.

"మీకు తెల్దు. కష్టపడ్డోడు కల్లుతాగితే కష్టం మరుపున పడిపోతది. మర్నాడు మళ్లీ కష్టానికి తయారీగా ఉంటాడు"

"కల్లు కష్టం మరిపించే మాట నిజమే. కాని అది ఆరోగ్యాన్ని మెల్లమెల్లగా హరించే స్తుంది. కల్లు తాగకపోతే మొదట్లో కష్టంగా తోచినా తరవాత ఆరోగ్యమూ బలమూ పెరిగి ఎంత కష్టపడినా కష్టమే తెలియదు. నా మాటలు నిజమో కాదో తేల్చుకోవాలంటే ఓ నెల చూడండి కల్లు మానేసి. మీకో పందెం పెడతాను. ఎవరయినా మీలో నెల పాటు కల్లు మానేస్తే వారికి నేను వంద రూపాయల బహుమానం ఇస్తాను"

"మేమోడిపోతే? "

"ఏమీ ఇవ్వక్కర్లేదు. కాని గెలవగలిగే వరకూ ప్రయత్నించాలి"

"అంటే మేం గెలిస్తే తప్ప ఓడిపోతే మీకేటి నాబముండదు"

"మీరు నా వాళ్లు. మీరు గెలవడమే నాక్కావాలి. వంద రూపాయలకంటే చాలా ఎక్కువ ఆ ఆనందం విలువ"

వాళ్లు అప్రతిభులే అయ్యారాతని మాట లకి. "ఏడనుంచో వొచ్చారు. ఈడున్నారు. నెలకిందట మీ ముకం మాకు తెలదు. మా ముకం మీకు తెల్దు. దీనికి పైసా దీసుకోరు. మా కోసం ఆసీర్వదించడమా, ఆటొస్తువులు దేవడమా, మా పిల్లలకి సంగీతం సెప్ప డమా, పొద్దుటేల బక్తిపాటలెట్టడమా ఎన్నెన్నో చేస్తారు. ఎందుకని బాబూ? " ఎవరో అడిగారు. అలా అడుగుతుంటే ఆర్ద్ర మయిన కళ్లు.

"ఎందుకంటే నా ఆనందంకోసం. మీ బిడ్డ లేదయినా ఘనకార్యం చేశారనుకో. మీ కుఱ్రాడు మూడేళ్లయినా నిండనివాడు వొడ్డునే ఏ చేపనో పట్టుకొచ్చాడనుకో.."

"అయ్యకి చక్కనే. అమ్మకి పొంగే"

"నాకూ అంతే! మీరు బాగుంటే, ఘన కార్యం జేస్తే. సరే రేపటినుంచి చదువు మొదలుపెడుతున్నట్లేగా? "

"ఓ... మా పలకలూ బలపాలూ మేమే తెచ్చుకుంటాం"

సముద్ర స్నానమూ సంధ్యావందనమూ ముగించి అతను సెంటరుకి బయలుదేరాడు.

భోజనం ముగించి మళ్లీ సముద్రతీరం వైపు నడక సాగించాడు. తననెవరో అనుసరిస్తున్నారని గమనించని మాధవ్ వెనుదిరిగి చూడలేదు.

చీకటి రాత్రులు కాకపోయినా ఎందుకనో వెన్నెల రాలేదు. ఆకాశం మబ్బులేసి అంతా మసకమసగ్గా ఉంది. సముద్రం నిద్రకుపక్రమిస్తుంది.

ఇసుకలో నడుస్తున్న మాధవ్ ఒక్కసారి తుళ్లిపడి వెనుతిరిగి చూశాడు.

"ఎవరది"

"నమస్కారం స్వామీ! నా పేరు విశ్వేశ్వర్రావ్. అమ్మా అయ్యా పెట్టిన పేరిసకయ్య"

"ఇసకయ్యా"

"పుట్టిన బిడ్డలందరూ చచ్చిపోతుంటే నేను పుట్టగానే ఇసుకలో పారేసేరుట. అలాగయితే బతుకుతానని. అందుకని నాపేరిసకయ్యని పెట్టారు. బాగులేదనీ, నలుగురూ నవ్వుతున్నారనీ నాకు నేనే ఇశ్వేశ్వర్రావని పెట్టుకున్నాను? "

"బాగుంది. నీకేం కావాలి? "

"తమరి సాయం. మాట సాయం, మనసు సాయం. మీరు దొడ్డవారని నలుగురూ చెప్పుకుంటున్నారు. మీకీడ ఎంత మంచి పేరుందంటే ఎలచ్చన్లలో నిలబడి సారా పోయించకపోయినా పేటోళ్ల వోట్లన్నీ గుత్తంగా మీకే పడిపోతాయి. వాడలోనూ శానామందికే తమరంటే గురి, గౌరవం. తమరు దయుంచి నా బతుక్కో తోవ చూచించాలి. చక్కని తోవ"

"ఏమిటి చెయ్యాలో చెప్పు. మంచిదయి చేయగలిగితే మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తాను"

"చుక్క మీకెరికే. చంద్రయ్యకి మీరంటే బక్తి, గౌరవం"

అదేమో అతనికి తెలియదుకాని పదిరోజుల కిందట ఓసారి చంద్రయ్య కలిశాడు.

అతను నమస్కరిస్తే తనూ నమస్కరించాడు. అతనేదో చెప్పబోయి ఆగిపోయాడు. మరి అతని మనసులో ఏముందో?

"నేను వాడోళ్ల కుఱ్రాడిని. అంటే వాడబల్జీని. మీకు తెలిసే ఉంటది. మాకూ జాలార్లకీ సంబంధాలు లేవు. ఉండవు. అత్యవసరమయినప్పుడు కాని పనులకోసం తప్ప ఆచార యెవహారాలలోనూ సంబంధాల్లోనూ మేం కలవం. అంటీ ముట్టనట్లుంటాం. ఆళ్ల కూడు మేం దినం, మాకూడాళ్లు తిన్రు. చుక్క చక్కనిది. దానందమనండి, మరేమనండి నన్ను గాలమేసిదాని వేపుకి లాగేసుకుంది. నేను దాన్ని పేమించాను"

"మరి ఆమె? "

"చుక్కకీ నేనంటే మక్కువే. శానా ఇష్టవే. ప్రేణమే ప్రేమే"

"ఎలా చెప్పగలవు? మీరు మాట్లాడుకున్నారా ఉభయులూ? "

"చెప్పానుగా వాడోళ్లూ జాలార్లూ ఉప్పూ నిప్పూ అని. ఐనా మేం ధైర్యంచేసి ఒక ట్రెండు తూర్లు రహస్యంగా మనసు విప్పుకున్నాం. మాట్లాడుకున్నాం. ఊసులెప్పుకున్నాం. ఐనా మనసు తెలుసుకుందుకొక్క చూపుచాలదూ? సందేహంలేదు. మేమిద్దరం పేమించుకున్నాం"

"మరి మీ జాతులు రెండిటికీ కలవదని నీకే తెలుసుగా? "

"తెలుసు. తెలిసినా మా మనసులు లెక్క

చెయ్యలేదు. ప్రేమకి కులాలడ్డురాలేదు"

"కాని పెళ్లికడ్డు పడతాయిగా? "

"అలా పడకుండా సూడమనే తమర్ని ప్రార్థించడానికొచ్చాను" చటుక్కున అతను మాధవ్ పాదాలమీద పడిపోయాడు.

"వొద్దు తప్పు లే పాదాలు పట్టుకుందుకు నేనేమన్నా పరమాత్ముడినా? మీకట్టు బాట్లతికఠినం. వాటిని తప్పించి మీరిద్దరూ అంటే నాకెంత సానుభూతున్నా మిమ్మల్ని దంపతులను చేయగలిగే శక్తి నాకుంటుం దని అనుకోను. కాని అవకాశమే వొస్తే నేను శాయశక్తులా ప్రయత్నిస్తాను. అంతవ రకూ..."

"ఎంతవరకూ అయినా ఎన్నాళ్లయినా చుక్కకోసం నేనుంటాను. నాకోసం తనూ ఉంటుంది. మా ప్రేమకున్నవి రెండేదార్లు. ఐతే ఇద్దరమూ లేచిపోయి ఎక్కడికో పారి పోవాల. లేదా ఇద్దరమూ కలిసి ఈ సవు ద్రంలోనే కలిసిపోవాల. ఏజ్జేసినా ఎనకోళ్లూ పెద్దోళ్లూ గుండెల్లో చిచ్చే"

"అందుకే సమస్యని సామరస్యంగా పరి ష్కరించడం సాధ్యపడుతుందేమో అవకాశం కోసం వేచిచూద్దాం. అంతవరకూ నువ్వూరికే ఉండకు"

"ఏటిజేసేది? "

"చంద్రయ్య మెప్పు పొందేందుకూ మనసు చూరగొనేందుకూ మిగిలిన కుర్రా ళ్లలా చదువుకో. ఆటలాడు. పెద్ద చేపని పట్టితే..."

"మాదాపనిగాదు. పడవల తయారీయే"

"సరే, నీపనిలో పేరొచ్చేలా కృషి చెయ్యి. దేముడు పవిత్ర ప్రేమనెప్పుడూ ఆశీర్వది స్తాడు"

"అదే... ఆ ఆసీర్వాదంకోసం వొచ్చా న్నేను. వాడోళ్ల కుర్రాడికీ జాలారోళ్ల కుర్రదా నికీ మనువు అసంబవమే. అసాజ్జెమే. మిన్నిరిగి మీదపడిందే. అదే జరిగిందంటే మీరు మరో దేముడే. దయుంచండి" అని దణ్ణంపెట్టి వెళ్లాడు అతను.

నీటిలో కలకలమయితే అటుచూశాడు. మసక వెలుగులో చంద్రయ్య. పడవని తోసి, నీట్లోకి వెళ్లిపోబోతున్నాడు!

"చంద్రయ్యా! ఆగు" పరుగెత్తుకెళ్లాడతని వద్దకి. విసుక్కుంటూ చూశాడతను.

"మళ్లీ తగలేరా నాకు! నన్ను పోనివ్వండి సామీ, మీకు పున్నెముంటుంది"

"నువ్వెందుకీ రాత్రి వెళ్తున్నావో నాకు తెలుసు. పెద్ద చేప రూపంలో మృత్యువుని వెదుక్కుందుకు. ఔనా? కాని... చంద్రయ్యా! నువ్వు నీ బాధ్యతని మరిచిపో తున్నావ్. నాకెవరూ లేకపోయినా నేను బ తుకుతూంటే, నీకు చుక్క ఉండి కూడా చని పోవాలనుకుంటున్నావ్. పిల్లల్ని కనగానే సరికాదు. వాళ్ల బతుకులకో తోవ జూపి వాళ్లు కుదుటపడేదాకా ఉండడమూ మనిషి విధే. ఆలోచించు. నీకు మనవడినెత్తుకోవా లనిలేదూ? అచ్చంగా నీ భార్య పోలికలు పుణికిపుచ్చుకుపుట్టే మనమడో, మనమ రాలో..."

"అందుకు ముందు, సుక్క మనువాడా లిగా? "

"చుక్క మనువు నువ్వే చెయ్యాలి, ఉన్న వాడివీ తండ్రివీ నువ్వే కనుక. ఆమెకి పెళ్లి చేసి పంపేవరకూ నీ జీవితం మీద అధి కారం నీకు లేదు"

వారి వెనుక సముద్రం గర్జిస్తోందెందుకో కోపంగా.

"ఏనాట్నుంచి యత్నంచేస్తూ వొస్తున్నాను! కులవృత్తి జేస్తూ... చేపలు బాగా పట్టగలిగే మెరికల్లాటి కుర్రోళ్లు ముగ్గురడిగారు. సుక్కేమో వొద్దూ, వొల్లకాదూ అని ఎప్పటిక పుడే మొండికేసేసింది. ఇష్టంలేని మనువు సెయ్యలేనుగదా? కుర్రాడు మెరికే కావొచ్చు కాని కుర్రదిస్టపడకపోతే ఆ సంబందం కూడదు. బంగారం కత్తని పీక తెగ్గోసుకో లేమే"

"చుక్కకి ఎవరూ ఎందుకు నచ్చలేదు? "

"ఏమో. దాని మనసులో ఏ పురుగు

దూరి దొలుస్తూందో"

"కన్య మనసులో దూరేది పురుగుకాదు ప్రేమ, పురుషుడు. మొన్ననామె ముఖం చూస్తే ఆమె మనసులో ఎవరిమీదో ఇష్టం పెట్టుకున్నట్లుంది"

"ఆ విషయం నాకు సెప్పొచ్చుగా? ఇప్ప టికే యీడుదాటిపోతూంది"

"చెబితే నువ్వు కాదంటావని జంకుతోం దేమో"

"నేనెందుక్కాదంటాను? "

"కారణం ఏదయినా కావొచ్చు. మాటవరు సకి అతను మీ తెగవాడుకాక ఏ వాడబల్జీనో అనుకో..." భయపడుతూనే అన్నాడు మాధవ్.

"అలాటివేసాలు మనదగ్గర కుదరవ్. ఆడిని నరికి పోగు వెడతాను. కూతుర య్యేది కొడుకయ్యేది కులమూ కట్టుబాటూ తప్పితే నేనొల్లను" కచ్చితంగా- కఱ్ఱ విరిచి పొయ్యిలో పెట్టినట్లే చెప్పాడు చంద్రయ్య.

ఆ జవాబుకీ దానిలోని గంభీరతకీ గతు క్కుమన్నాడు మాధవ్. ఒక నిముషం మౌనంగా ఉండి "చంద్రయ్యా! నువ్వు ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు కాదూ? " అని అడిగాడు మెల్లగా.

"మనువాడాకే మరీ ప్రేమించాను"

"నీది వెనకటితరం. పెళ్లిచేసుకున్నాక కూడా ప్రేమించగలరప్పటివాళ్లు. జీవితమూ ప్రేమా బాగా తెలిసినవారు కనుక. కాని- ఇప్పటి కుర్రాళ్లదంతా తొందరే. ముందే ప్రేమించేస్తారు. ప్రేమించిన వారిని తప్ప పెళ్లాడరు. పెళ్లయ్యాక ప్రేమించుకుంటారో లేదో ఆ పరమాత్ముడికే ఎరుక. మనమూ కాలాన్నిబట్టి పోవాలికాని కులాన్నిబట్టి కాదు. ఏమంటావ్? " అనునయంగా అడి గాడు.

"ఏటంటాను? అలాటి మాటలు నాకాడ అనొద్దంటాను. సెమించండి" అనేసి చరచర వెళ్లిపోయాడక్కడినుంచి.

విభ్రాంతుడయ్యాడు మాధవ్.

వీరిలో వివాహమూ విడిపోవడమూ ఎంత సులభమో- కులాంతర వివాహమంత కష్టం. కష్టమేమిటి, అసంభవమూ, అసా ధ్యమే. తీరాన్నుండే సముద్రం ఎలాగ చెలి యలికట్ట దాటదో, వీరూ అలాగే కులకట్టు బాట్లు తప్పరు. సమాజమేదయినా దానిలో కొన్ని రకాల స్వేచ్ఛలుంటే మరికొన్ని రకాల కట్టడులూ తప్పవేమో. చుక్కా, విశ్వేశ్వరరా వుల ప్రేమ చివరికెలా ముగియనుందో? వివాహంగానా, విలయంగానా? పెళ్లిగానా, ప్రళయంగానా?

ఉహుఁ, తన ప్రాణం ధారపోసయినా వీరిప్రేమకు పెళ్లిచేయాలి.

నిద్రపోతోంది నీలిసముద్రం. సప్తరాగాలా లపిస్తూందేమో సప్తస్వరాలకీ అతీతంగా! ఆ రాగాల లోతులు రాయగలవాడెవడు?

"సామీ! మీకు దేవుడు ప్రెత్యచ్చమౌతాడు కదా, మీరూ అతనూ ఏం మాటాడుకుం టారు? మా గురించి మా బతుకుల గురిం చేనా? " అమాయకంగా అడిగే గంగాపు త్రుడు "అవసరమయితే తప్ప దేముడు మాట్లాడడు" అనేస్తాడు తను పరిస్థితిని రక్షించేందుకు. వాళ్లు అమాయకులా? సందే హమే. మొన్న విద్యాగంధం కార్యక్రమ మంటూ అనకాపల్లె నుంచి టీచర్లూ స్టూడెంట్లూ వచ్చి ఉచితంగా చదువు చెబు తామంటే "దానికేం? అలాగే నేర్చు కుంటాం. కాని మేం పస్లు మానుకుని పాటాలు సదువుకున్నందుకు గంటకెంత లెక్కనిస్తారేం? " అంటూ అడిగారట! అంతటి జాణలు. మళ్లీ వీళ్లకేమీ చెప్పలేక వొచ్చినవాళ్లు తెల్లమొహాలేసుకుని వచ్చిన దారినే వెళ్లారట. మనిషి మీదా మంచితనం మీదా గురికుదిరితే తప్ప ఎవరినీ నమ్మరు. ఏదీ వినరు.

ఐనా ప్రభుత్వానికుపాధ్యాయుడంటే లోకువ. గౌరవం లేదు. గుర్తింపులేదు. సెలవు లెక్కువంటూ జనాభాలెక్కలూ పశు వుల పంటల అంకెలకూ, ఎన్నికలకీ,

కుటుంబ నియంత్రణ ప్రచారానికీ దేనిక యినా ఉపాధ్యాయుణ్ణి రాసి రంపాన పెట్టే డమే. టీచరుకీ ఆ పనులకీ ఏం సంబంధం? పనిచేయించుకునీ తగిన ప్రతి ఫలం ముట్టజెప్పరుట. దేశంనిండా ఎందరో నిరుద్యోగులన్నారే. ఇలాటి పనులకి వారిని వినియోగించుకోకూడదూ ఉభయతార కంగా. ఉపాధ్యాయుడంటే బడిలో పాఠాలు చెప్పడానికా, ఊరిమీద పడి ఎక్కే గడపా దిగే గడపగా తిరగడానికా? ఇలా అయితే విద్య ఏం సాగుతుంది? ఆలోచిస్తూనే నివాసం చేరాడు మాధవ్.

★ ★ ★

ఆదివారం పూడిమడక సంతరోజు.

గంగాపుత్రులు వేటనుంచి తిరిగొచ్చి చేప లమ్ముకుని కూళ్లుతినొచ్చేసరికి సంత బాగా కూడింది. చిన్నచిన్న దుప్పట్లో గుడ్డలో పరిచి ఒకదానితో నొకటి అంటుకుని ఉన్న ట్లుమర్చబడ్డ ఆ గుడ్డలమీద అక్కడక్కడ కూరగాయలు, టమాటాలు, ఒక్కోదాని మీద కోడిగుడ్లు, పెట్టెతో తెచ్చిన జాకెట్ గుడ్డలూ రెడీమేడ్ దుస్తులూ పరిచారొకరిద్దరు. రెండుమూడు గుడ్డలమీద పొందికగా అమ ర్చబడిన అద్దాలూ, గాజులూ, పూసలూ, దండలూ, పౌడరుడబ్బాల వంటి అలంకరణ సామగ్రీ, చాలా వాటిమీద చేపలు. అక్కడ క్కడ మాంసం అమ్మకాలు. బనీన్లూ, చేరు మాళ్లూ, తువ్వాళ్లూ, దుప్పట్లూ ఒక గుడ్డమీద చొక్కాబట్టలు. పక్కనే దువ్వెనలు, మొల తాళ్లూ.

పేరుకి పెద్దయినా ఊరికి చిన్నదే పూడి మడక. సెంటరంటే బస్సాగేచోట కొంచెం విశాలమయిన జాగాయే. దానిచుట్టూ కిళ్లీ కొట్లూ బ్రాందీదుకాణాలూ, సైకిళ్లూ పెట్రో మాక్సు దీపాలూ బాగుచేసే కొట్టు. మరో వేపు కాఫీ హోటల్ అప్పారావుది. దాని తరువాత చిన్నచిన్న టీ బడ్డీలు. అవన్నీ కిటకిటలాడుతున్నాయి. ఆ సెంటరునుంచి ఎదురుగా కనిపించే సముద్రం వేపు రోడ్డున బడే అస్తవ్యస్తపు బాటమీద పదడుగులు వేస్తే సంత తగిలింది. మొదటిగా ఎదుర య్యేది నేలమంగలి షాపులు. అక్కడ ఇద్దరు ముగ్గురు క్షురకులు జాలారి వారిని కింద నేలమీద కూర్చోబెట్టి చేతికద్దమిచ్చి క్షురకర్మ, గెడ్డాం గీకుడూ కానిస్తున్నారు. ఆ పక్కనే కూల్‌డ్రింక్ బండీ. ఈ దేశంనుంచి వస్తు మార్పిడి విధానం పూర్తిగా అంతరించకుండా కాపాడుతున్నామంటూ బెస్తలందించే చేప లకి ఉప్పూ అగ్గిపెట్టెలూ ఇస్తున్నారు కొందరు. సంతంతా చేపలవాసన. అయినా కుతూహలంగా తిరుగుతున్నాడు మాధవ్. మనిషిని మనిషి రాసుకుంటూ నడవవల సిందే. ఇరుకుగా ఉంది సంత. అద్దాలూ పూసలూ గాజులూ ముందు జాలారి స్త్రీలు గుమిగూడి ఉన్నారు. చుట్టపొగ ఆవరిస్తూ సంతలో ఊపిరి సలపనివ్వడంలేదు. ఎక్కడ చూసినా చెత్తాచెదారమూ. దానిని తొక్కు కుంటూనే జనం కదలికలు.

"పాకుండలుకొనే" చిన్నపిల్ల ఏడుపు.

"బూరా బిగిలూ (విజిలూ) కొనవే" కుర్రాడి మారాం.

అది సంత కాదు, గోల.

"ఈ అద్దమూ, దువ్వెనా, దండా, కాటుక బొట్టూ- కలిపి ఎంత? " వాటిని చేతిలోకి తీసుకుని అడిగింది.

చటుక్కున ఆగిపోయాడు మాధవ్. అది కౌసల్య గొంతు.

ఆమెని చూసి చాలా రోజులయిపో యింది.

లెక్కకట్టి చెప్పాడు దుకాణంవాడు. "పన్నెండు రూపాయలు-"

"అమ్మో! నాకాడంత సొమ్మునేదు"

"పోనీ పదిరూపాయలివ్వు. అంతకి తగ్గేది లేదు"

"ఆర్రూపాయలే ఉన్నాయ్"

"అద్దమొకటే అట్టుకెళ్లు-" నిర్లక్ష్యంగా అన్నాడు షాపువాడు.

"అక్కర్లేదు కౌసల్యా! నీకేం కావాలో అన్నీ

తీసుకో. డబ్బులు నా దగ్గరున్నాయి"

ఆమె ఒక్కసారతని ముఖంలోకీ కళ్లల్లోకి చూసింది. "నిజంగానా?"

"ఊc..."

"ఆర్రూపాయలు నేనిచ్చేస్తాను. మిగిలిన్నాలుగూ మీరివ్వండి. తరవాజ్జూసుకుందాం" అనేసి ఆ సామాను తీసుకుని వెళ్లిపోయింది. ఎదురుగా ఉండి అంతా గమనిస్తున్న నరసింహకి మళ్లీ తిండీ అవకాశమూ దొరికాయి, కడుపు నింపుకుందుకు. అభినవ కలహభోజనుడి కంతకంటే మంచి భోజనం మరేమిటి?

నాలుగు రూపాయలూ చెల్లించి ముందుకు కదిలి- ఓ తువ్వాలు కొనుక్కున్నాడు మాధవ్, సంతలో ఏదయినా సరదాగా కొనాలనిపించి. అతనికి మహదానందంగా ఉంది. ఇన్నాళ్లకి కౌసల్య తనని చూసి బెదిరి పారిపోకుండా ఉండడమేకాక ఓ మాటా మాట్లాడింది, తను కొనిచ్చినవి తీసుకోనూ తీసుకుంది! కాని దీనికీ రాత్రికి విషపరిణామాలెదురు కావు కద?

ఆ ఆలోచనకే ఒణికిపోయాడు.

**అ**తను వొచ్చేసరికి తుపాను షెల్టరు వరండా కలకల లాడుతోంది. క్యారమ్స్, చదరంగం, పిన్‌బోర్డు ఆడుతూనే వాళ్లు కుశలాలూ అడుగుతున్నారొకరినొకరు.

"ఇవాళ మీ ఇంట కూరేవిటిరా?"

"అదేటో... వలనిండా నెత్తలే పడ్డాయి. సంతయినా కొన్నుండిపోయాయి. నెత్తలే పుడే యీ రాత్తిరికి"

"నాకు కానాగడ తడింది"

"నాకు సారవలూ మొరవలూ కుమ్మేశాయి. రేతిరి కాటిపులుస్జేస్తానంది మాయాడది"

"ఎప్పుడూ నేదు, నెవలెలుకడింది నాకు"

"నెవలెలుక్కి గొప్పయిపోకు. బులకొక్కడింది నాకు" గర్వంగా చెప్పాడతను.

"టేకి సేపనట్టేన్రా పిట్ట కొంచెం, తోక బారెడూ అన్నట్లు సేప చిన్న తాబేలంతుంటే తోక మూరెడుంది"

"నీకు తాబేలునాటి టేకి సేపడితే నాకు తాబేలే చిక్కిందొలలో. రేతిరికి మాకు తాబేలు మాంసమే. డిప్పని నీటికాయ జేసుకోవాలి"

"ఇయాళ తెప్పమీదిద్దరమే అయిపోయాం, సోములుగాడూరికి పోడంతో బలే కొమ్ముకోనాం కంటపడిందిరా. సేప శానా పెద్దది"



"పట్టావా?"

"నేను పడతాననే అన్నాన్రా. జతగాడు వొద్దనసేడు. కొమ్ముకోనాం ఎగురుతుంటే మనిసిమీద పడితే దాని కొమ్ము తగిలి ఎంతమనిసయినా అరీ అనేస్తాడూ అంటూ పిరికిమందోసేసి నా చేతులు కట్టేశాడు. అధైర్యపెట్టేశాడు. వాడు సయ్యన్నాడో కొమ్ముకోనాన్ని కొట్టుకొచ్చీవాడినే. సైకలు షాపోడు శాన్నాల్ల నుంచీ అడుగుతున్నాడు కూడాను. ప్యాచీలేసుకోవాలి, కోనాంసేప కొమ్ముదెచ్చివ్వరా అని. ఏట్నాబం? చూస్తా చూస్తా చేపనొగ్గీసుకోవలసొచ్చిందా పిరికాడి పున్నెమాని" ఒకవేపు ఆటా... మరోవేపు మాటలూ వాటికంత మున్నట్లనిపించక.

"విశ్వేశ్వర్రావేడీ?" అడిగాడు మాధవ్.

"విస్సిగాడా? ఆడు పరుగెత్తుతానని బయటకు పోయాడు"

"మీరు పొమ్మనలేదుకదా?"

"తమరలాకూడదని, ఆటలలో అంతా

ఒకటి అనీ ఆవేళంతగా చెప్పాక తమరి మాట జవదాటతామా సామీ? ఇంతవరకూ మాతోనే ఆడి అరగంటవుద్ది పరుగెత్తి వొస్తా నని పోయాడు. ఆడికి బవుమతిపిచ్చుట్టు కుంది"

"ప్రమాదం లేని మంచి పిచ్చేగా" నవ్వాడు మాధవ్.

"సామీ! మీరొచ్చేముందు మేమందరమూ ఓ యిషయమనుకున్నాం"

"ఏమిటి? "

"మేమూ సదూకోవాలని"

"చాలా మంచిది" ఆనందం పట్టలేకపో యాడు.

"కాని... సరస్వతిలా సంగీతవూ, సంస్కృ తమూ కాదు"

ఆశ్చర్యంగా చూశాడు. "మరేమిటి? "

"ఇంగిలీసు. మొన్న మీరెవరితోనో గణా గణా మాటాడేసేరే. అలాగ మేంవూ మాటా డగలగాలి"

"అలాగే. మీకొక్క ఇంగ్లీషే కాదు. మూడు భాషలు నేర్పుతాను. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషూ ఒక్కసారే"

"కాని... మా పీకలమీదకి మొయ్యలేని బరువైపోదూ? అసలే మాయి మొద్దుబు ర్రలు. సదువ్వయసు దాటినోళ్లం"

"చదువుకోవాలన్న అభిలాష ఉండాలి కానీ చదువుకి వయసడ్డుపడదు. పట్టుద లతో చదవాలి. అంతే. మీవి మొద్దుబుర్రలు కావని మీకే తెలుస్తుంది" ఓసారాగి "అస లలా మూడూ నేర్చుకోవడమే సులభం కూడా" అన్నాడు.

"ఔనా!"

"భాషలు అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూలా టివి. ఒకటి క్షుణ్ణంగా వొస్తే మిగిలినవి సులభంగా వొస్తాయి. పరస్పర సబంధ బాంధవ్యాలు కలవి కనుక. మీరే చూస్తా రుగా? " ఆశ పెడుతున్నట్లే అన్నాడు.

"రేపట్నుంచీ మొదలెడదాం. చీకటడేవ రకూ ఆటలు. ఆ తరవాత గంటో ఎంతో సదువు. మా కుర్రాళ్లం. ఒకళ్లతో ఒకళ్లం. ఎవరీగిపోతే ఆళ్లు రెండోవాళ్లకి వంద రూపాయలు జరిమానా కట్టాలని పందేలేసు కుని కల్లుకెళ్లడం మానేసేం. కల్లు యేళలో చదువుకున్నా చాలు"

మెచ్చుకోలుగా ఆనందభరితుడై చూశాడు. "మీరెంతో మంచి పనిచేశారు. ఆ మంచే మిటో ముమ్ముందు మీకే తెలుస్తుంది"

"ఇప్పటికే తెలుస్తూంది సామీ. రోజూ అయ్యే కల్లు కర్చు మిగులు. తాగొచ్చి గొడ వలూ గోలా కొట్టుకోడాలూ లేవు. నాల్డ బ్బులు జేబులో ఉంటున్నాయి. ఇంతకంటే మంచేం గావాలి? ఏటేటో అనేసుకున్నాం గాని కల్లు మానేసినా కొంపేమీ మునిగిపో లేదు సామీ"

"చెడ్డపని మానడంవల్ల కొంప మునగదు సరికదా తేలుతుంది"

"మా బాగా సెప్పారు"

అంతలో లెక్కలవాళ్ళొచ్చారు పలకలు పట్టుకుని. ఈ పది పదిహేను రోజుల్లోనూ వాళ్లు చాలావరకే వొచ్చారు. అంకెలు వెయ్యి వరకూ వెయ్యగలుగుతున్నారు. కూడికలూ తీసివేతలూ నేర్చారు. గుణకారాలూ ఫరవా లేదు. కాని భాగహారాలతోనే కొంచెం చిక్కుగా ఉంది. ఎక్కాలు బట్టీ పెడుతు న్నారు. పెద్దవాళ్లు కనకా, పట్టుదలతో నేర్చు కుంటున్నారు కనుకా చకచక ముందుకి సాగగలుగుతున్నారు. లెక్కలకి నిత్యజీవితం లోని ఆర్థిక వ్యవహారాలలో చాలా అవసర ముందన్న విషయం వాళ్లు గ్రహించడంతో గుళ్లబోర్డూ, క్యారెమ్‌బోర్డూ స్కోరు కవసర మయిన వాటికంటే ఎక్కువ నేర్చుకుంటు న్నారు. సులువులతో సులబ మార్గాలలో నేర్పడం ఒక కారణమయితే- లెక్కలలో ఉండే సహజాకర్షణ శక్తి మరొక కారణం ఔతూ వారిని తనతో ముందు లాక్కెడు తోంది గణితం. పగలు పడేది కాయకష్టం కనుక వారికీ విద్యాభ్యాసం- విరామంగానే తప్ప విసుగుగా అనిపించడంలేదు. ఆనం

దంగానే తప్ప అలసట కావడంలేదు. లెక్క సరిగా చేసి మాస్టరు రైటు పెడుతూంటే అంతటివాళ్ళూ చిన్నపిల్లల్లాగే సంబరపడుతు న్నారు. దానిని విద్యానందం అనాలేమో.

"సామీ! నిజం మనసులో మాట చెబుతు న్నాను. ఆ కల్లు కంటె యీ లెక్కనే ఎక్కువ నిసాగా ఉన్నాయి సామీ"

జన్మ ధన్యమైపోయిందనిపించింది మాధ వ్‌కి.

"ఈ అంకెలూ లెక్కల్లో పడితే కల్లేటి, వొల్లూ తెలియడంలేదంటే నమ్మండి. నా మాట నిక్కం సామీ"

"ఔను సామీ. పలకమీద అంకే వేస్తూంటే బొమ్మలేసినట్లే బలే సరదాగా ఉంటూంది. ఇప్పుడు నా రాతా గీతా బాగుంటుందా! ఒక్కో అంకే వందేసిసార్లు దిద్దాను. ఇంకా ఎక్కువమార్లే. ఇసకలో తెప్ప కర్రమీద వేలు నీళ్ళలో ముంచి, గుడి సెలో నేలమీద మసిబొగ్గుతో"

"అందుకే ఎంతో అందంగా ఉన్నాయి నీ అంకెలు" అభినందిస్తున్నట్లే అన్నాడు.

"చాలు సామీ, మీరు బాగుందన్నారు. నాకదే చాలు"

"మా అంకెలు బాగునేనా? "

"అందరివీ బాగున్నాయి. ఎక్కాలు బాగా వేశారందరూ. పాఠం మొదలు పెడ దామా? " అంటూ పుస్తకం అందుకున్నాడు మాధవ్.

★ ★ ★

వాడకి ఆ వారగా కల్లుపాక.

పాక చిన్నదే కాని చుట్టూ బోలెడంత కాళిజాగా. ఇసుక పరచి చదును చేయబడి ఉంది. వర్షాకాలంలో పందిరె వేస్తాడేమో. ఇప్పుడు మాత్రం పైన ఆకాశమే. పదిహేని రవైరోజుల కిందటివరకూ ఆ పరిసరాలు పెళ్లి వారిల్లులా కలకలలాడిపోయేవి. ఎక్కడ చూసినా మనుషులూ... చేతుల్లో కల్లు కుండలూ, సారాసీసాలూ, గోలగో లగా... గుంపులు గుంపులుగా ఇసకలోనో గెనెవేసుకునో కూర్చుని కల్లు తాగుతూ చీకులు తింటూ గారెలో మిరపకాయ బజ్జీలూ నములుతూ ఎక్కువమంది గంగ పుత్రులు. నవ్వులు... దెబ్బలాటలు, కబుర్లు, కల్లుపందాలు. పెట్రోమాక్స్ లైటు వెలుగు. అలా ఉండే కల్లుపాక ఇప్పుడు వెలాతెలాపోతోంది.

అప్పుడక్కడ కల్లమ్ముతూ కనకమ్మ కూర్చునేది. కనకమ్మంటే కల్లుతాగే వాళ్ళ మారు పేరులో "బొగ్గుల బస్తా" నల్లగా చింతమొద్దులా ఉండేది. ఏ కండ ఎక్కడిదో తెలియకుండా శరీరమంతా ఏకాండి కండే. ఆమెకి నేలమీద కాలూ నిలిచేది కాదు. మెడకింద పైటా నిలిచేది కాదు. కల్లందిస్తూ కళ్లతో కైపుగా చూసేది. వేలో చెయ్యో తాకించేది. వెకిలినవ్వు నవ్వేది. ఎక్కువ తాగనివాడిని ఎక్సక్కెమాడేది. తాగేవాడిని రెచ్చగొట్టి మరింత తాగించేది. కుర్రకారుకి కనకమ్మ కల్లంటే హుషారూ, వెర్రీ, పిచ్చీ ఆ కొట్టు యజమానయిన కల్లు సూరిగాడికి కనకమ్మంటే ఎంత కల్లునేనా కరకు రూపా యిలుగా మార్చి అందించే కామధేనువూ, కల్పవృక్షమూ. కాని ఇప్పుడు అక్కడ కన కమ్మ లేదు. సూరిగాడు తలపట్టుక్కూర్చు న్నాడు దిగులుగా. కల్లు తాగేవాళ్ళు పట్టు మని పదిమంది కూడా లేరు. ఆ పదిమం దిలోనూ గరటయ్యొకడు. ఇవాళ అతనికి వేట సరిగా పడలేదు. దానికితోడు వొచ్చినం తమేరకు అమ్ముకుని వొడ్డున నడుస్తూంటే నర్సింహ చెప్పిన సంతలో కాసుల కథ. వొళ్లు మండిపోతూంటే కల్లుపాకకొచ్చాడు.

సాయంత్రంవరకూ వేటాడినా తనవొంతు పాతికేనా రాలేదు. శ్రమే మిగిలింది. కాసు లేమో మళ్లీ వాడితో మాటలూ మంత నాలూ. గుండెమంటని తీర్చుకుందుకు కుండలకొద్దీ కల్లు తాగుతున్నాడు.

"అలాగున్నావేం సూరీ? " మరో కుండ కోసం వొచ్చి అడిగాడు గరటయ్య.

"మరెలాగుండను? అదేటి సిత్రమో

మరేటి శాపమో, పదే(స్రో)జులనుంచీ యాపారం డౌనయిపోయింది. మునుపు రూపాయమ్మితే ఇప్పుడు ముప్పయి పైసల మ్మకాలు లేవు. ఎలాగుంటాయి? ఎవరో నీలాటి శ్వాసం గలోళ్లు తప్ప కుర్రకారు రావడం మానేశారు. అంతకీ కనకమ్మ ముసిలిదీ పాతదీ అని మోజు తగ్గిపోయిం దేమో అని అదుగో సెంద్రమతిని, పిటపిట లాడే సిన్నదాన్ని తెచ్చుంచాను కొట్టులో. అయినా నాబంలేకపోతోంది. కుర్రోల్లు రావ డంలేదు"

"వాళ్లు సదువులూ సంగీతాలూ, ఆటలూ మరిగారులే. ఆ సాములోడు దొంగసాము లోడు లేడూ? ఈళ్లని వెర్రివాళ్లని జేసి ఎన కదిప్పుకుంటున్నాడు. వీళ్లకి బుద్ధి నేక కుక్కల్లా వాడెంటపడుతున్నారు. వాడేం జెబితే అదే వేదం అయిపోయిందీ పిచ్చెదవ లకి"

"ఆ స్వామి దొంగసాములోరా?" ఆశ్చ ర్యంగా చూశాడు సూరి, కొత్త విషయం వింటున్నట్లు కళ్లింతజేసి.

"కాక? మరోడి పెళ్లాం వెంటపడేవోడు మహాత్ముడూ మహానుబావుడూ ఔతాడేటి?"

"ఆయనెవడి పెళ్ళాం వెంటపడ్డాడు?" ఆత్రంగా అడిగాడు.

"అది నేన్జెప్పను. నన్నడక్కు. కల్లుమీద ప్రెమాణికం జేసి చెబుతన్నాను. నేను చెప్పింది నిజమూ నిక్కమే"

"అదెవరో చెప్పు... కల్లుకుండ ఊరికే ఇస్తాను"

"పోరా... సెప్పనన్నానుగా? సెప్పనంటే సెప్పనంతే. మనదొకటే మాట, శ్రీరాముడి దొకటే బాణం. ఆడుమాత్రం దొంగ సన్నాసే, అంతే"

గరటయ్యకి కల్లు పోసి ఆలోచనలోప డ్డాడు సూరి.

"కన్నుమీద కొట్టు, చూపేపోతది. కల్లు మీద కొట్టకు, మనిసూసేపోతది" ఎవరో పాడుతున్నారు నోటికొచ్చినట్టు.

గరటయ్య గబగబ తాగేశాడు కల్లుని. అసలే కోతి. ఆపైన కల్లు తాగింది. నిప్పుతొ క్కిందన్నట్లు, ఎదురుగా లేకపోయినా కాసు లుమీద అగ్నిహోత్రుడైపోతున్నాడు. అయినా మళ్ళీ కల్లు దొప్పకోసం వొచ్చాడు పాకముందుకి.

సూరిగాడికొక్కసారి మెదడులోకేదో ఆలో చన వొచ్చినట్లుంది. హటాత్తుగా మనిషి హుషారైపోయాడు "సెంద్రమతీ! ఆడికి కావ లసినంత కల్లుబోసి యిటురా" అన్నాడు.

"ఊ" అంటూ వొచ్చిందామె.

"మనేపారం బాగుంటేనే మనం బాగుం డేది. యాపారం బాగుండడమంటే నలు గురూ వొచ్చి పూటుగా కల్లుతాగడం"

"ఔను కాని నేనేటి సెయ్యగల్ను? అంతకీ ఊళ్లోకెల్లి నన్ను కన్నెత్తి చూసిన వాడికల్లా కల్లు దుకాణంలో ఉంటానని చెబుతూనే ఉన్నాను"

"ఔన్లే. అది కాదు, నువ్వు తక్కువ కష్టప డుతున్నావనికాదు. అందమైన దానివీ, వయసులో ఉన్నదానివీ. నువ్వే మన సమస్య తీర్చగలవు"

"నేనేటి సెయ్యాలో చెప్పు"

సరిగ్గా అదే సమయంలో తూలుకుంటూ వాళ్ల దగ్గరకొచ్చాడు గరటయ్య.

"నేనుపోతన్నాను. సూరీ! ఒకటి మనసు లోపెట్టుకో. ఆ దొంగసాములోడు నీకే కాదు నాకూ శ్రెతువే" అని చెప్పేసి వెళ్ళిపో యాడు.

కల్లు సారాలు సూరి వ్యాపారం. అతని బతుకూ బాగూ వాటిమీదాధారపడున్నాయి. కల్లు సారాలు జాలరివాళ్ల జీవితంలోనూ దినచర్యలోనూ ఊహించలేనంత ప్రాధాన్య తనూ సంతరించుకుని ఉన్నాయి.

కల్లు, ఒకడి జీవితాన్ని ఉద్ధరిస్తే పది మంది బతుకులును పాడుచేస్తుంది. వేసవి కాలంలోనే కల్లమ్ముడు పోకపోతే శీతాకా లంలో సారా ఏం చెల్లుతుందని సూరిగాడి భయం. అందుకే అతనేం చేయడానికయినా

సిద్ధపడుతున్నాడు. మంచయినా చెడు అయినా వాడి జీవనమార్గం కల్లమ్మకం. దానికోసం పోరాటమూ ఆరాటమూ.

సూరి దీపం వెలుగులో చంద్రమతి నాపాదమస్తకమూ పరిశీలనగా చూశాడు. ఆ చూపులకామెకి సిగ్గేసింది. "ఏటలా జూస్తావ్, ఎరగని వాడిలా"

ఆమె మాటలు వినిపించుకోలేదతను. తల పంకించాడు. "ఫర్లేదు. నువ్వతిచక్కని దానివే. ఇంటికెళ్లి స్థానంజేసి సక్కగా తయారై, మల్లెపూలెట్టుకుని, పొగ్రడి రాసుకుని- సెంటు బూసుకుని గమ్మునరా" అన్నాడు ఆమె చేతిలో పదిరూపాయల నోటు పెడుతూ.

"ప్రెశ్నలెయ్యక చెప్పినట్లు చెయ్"

ఆమె వెళ్లింది. అప్పటికి రాత్రి పది గంటలు.

★ ★ ★

నిద్రపోదామని శరీరం వాలుస్తూంటే చటుక్కున గుర్తుకొచ్చింది కౌసల్య సాయంత్రం సంతలో తనామెను పలకరించడమేకాదు, ఆమె కొనుక్కున్న అలంకరణ సామగ్రికి ధర చెల్లించాడు కూడా. అది తనకు చాలా ఆనందంగా ఉంది కానీ... యీ రాత్రి ఆమె సాయంత్రం తన పట్ల చూపిన సహృదయతకి గరటయ్యచేతిలో శిక్ష అనుభవించవలసి రాదుకదా?

వొద్దు... భగవంతుడా! నేను చేసిన యీ తొందరపాటునీ పొరపాటునీ యీ వొక్కసారీ క్షమించు. నా నేరానికామెను శిక్షించకు.

కళ్లు తుడుచుకున్నాడు మాధవ్. ఇక అతనికి నిద్ర రావడం మానేసింది. కౌసల్య గురించే ఎడతెగని ఆలోచనలు.

గరటయ్య ఆమెను తనమూలంగానే కాదు, పెళ్లయిన కొంచెం రోజులనుంచీ కొడుతూనే ఉన్నాడట. మరామె పిలగోడి దగ్గర తగవెందుకు పెట్టలేదు? తననతనెందుకు కొడుతున్నాడో నలుగురికీ తెలిస్తే చిన్నతనమనా? లేక గరటయ్యంటే ఆమెకు అతనేం జేసినా క్షమించగలిగినంత ప్రేమా? లేక, ఏమగాడితో అయినా ఈ తిప్పలు తప్పనివే అనా? ఎందుకని? అతనాలోచిస్తున్నాడు.

"అమ్మా!" అన్న కేక.

ఆ కంఠం కౌసల్యది. ఆ కేక కౌసల్యది. ఆ ఆర్తనాదం ఆమెదే. అతను పడుకున్న ఆ వరండాలో దీపంలేదు. చీకటిగా ఉంది.

అతను చటుక్కున లేచి పరుగెత్తబోతుంటే ఎవరో అతని చెయ్యిపట్టుకుని ఆపారు. ఆ మెత్తని స్పర్శ, గాజుల చిరుగల గల... మనిషి మాత్రం చీకటిలో ఆనడం లేదు. త్రుళ్లిపడ్డాడతను. "ఎవరు నువ్వు?"

"బయపడకండి. దెయ్యాన్నీ బూతాన్నీ కాను. కామినీ పిశాచినసలేగాను. కాసులమ్మని. మీరు మనసుపడ్డ, మోజుపడ్డ, కాసులమ్మని" అతన్ని కౌగిలించుకోబోయింది.

"కాదు" అరుస్తూ వైదొలగాడతను. అతని కంఠం వొణుకుతోంది.

"బాగానే కనిపెట్టారే! నేను కాసులమ్మని కాను. చంద్రమతిని. చక్కని చంద్రమతిని. నాముందు కాసులమ్మ దిగదుడుపే మీకోసం వొచ్చాను"

ఆమె వొంటినుంచి అసభ్యమయిన సెంటు వాసన "అసహ్యంగా మాట్లాడకు ఫో" అరిచాడతను ఆమె ధోరణినీ ప్రవర్తననీ భరించలేనట్లు.

"అసహ్యమేమిటి? ఆడదాన్ని, అందమయినదాన్ని, వయసులో ఉన్న దాన్ని. మీరంటే మోజుపడి, మిమ్మల్ని సుఖపెట్టి నేను సుఖపడాలని పనిగట్టుకు వొచ్చాను. పొమ్మంటారేం?"

అవతల మళ్లీ బాధాపూరితమయిన కేక. "నాయనోయ్ ఈడు నన్ను చంపేస్తున్నాడు"

"నువ్వు ఫో... నేను వెళ్లాలి. కాసులమ్మని రక్షించాలి. ఆ గరటయ్య యింకా దుర్మార్గం చెయ్యకుండా ఆపాలి"

"పిచ్చేమిటి మీకు? గరటయ్య కాసులమ్మ మొగుడు. అదాడి పెళ్లాం. దాన్నాడిష్టమొచ్చి

నట్టు జేసుకుంటాడు. ఆడికా అదికార ముంది"

"మొగుడూ పెళ్ళాలయినా సరే. ఓ స్త్రీని మగవాడిలా కొట్టిచంపేందుకధికారం లేదు. ఓ మనిషిమీద మరో మనిషి యిలా దౌష్ట్యం చెయ్యడానికి వీల్లేదు. ఇది రాక్ష సత్వం"

"కాని ఇదిక్కడ మామూలే. నిచ్చ భాగో తమే. అయినా ఆలుమగలమధ్యకెళ్ళానికి మీరెవరు? రండి. మనం సరదా జేసు కుందాం" చెయ్యందుకోబోయింది. అతను దూరంగా జరిగాడు. "పొమ్మంటే నీక్కాదూ? నేనలాటివాడిని కాను"

"సాములోరి బండారాలు నాకు తెలియని వేటి? బెట్టుచెయ్యకండి. గుట్టుచప్పుడు కాదని నేను జెబుతున్నాగా. మన సంబంధం మరెవరికీ తెల్దు"

"అయినా సరే, నాకసహ్యం"

"ఏం? నేనందంగాలేనా? ఆడదాన్ని కానా? మీరు మగాడు కారా, ఉప్పూ కారం దినడంలేదా? సన్యాసులు పగలే సన్యాసులు కాని సీకటడ్డాక సంసారులే అని ఎవరికి తెలవదు? పచ్చగా దబ్బపండునాగున్నారని మనసు పారేసుకొనొస్తే, పొమ్మంటారేం? డబ్బులడుగుతానని బయమా? అక్కర్లేదు. మీరడగాలే కాని నేనే యిస్తాను. ఇదుగో వందరూపాయలనోటు"

"ఛీ! నీకెంత జెప్పినా అర్ధంకాదేం? అరిచి... నలుగురినీ పిలిచి గోలచేసేదా, మర్యాదగా వెళ్తావా?" బెదిరించి చూశాడు.

"మీరరిస్తే ఈ అర్ధరాత్రి లగెత్తుకొచ్చేది మొగాళ్లే"

"అయితే"

"మొగాళ్లెప్పుడూ ఆడదానిమాటే నమ్ము తారు. అందునా నేనందమయిన దాన్నీ కల్లు చంద్రమతినీ!" నవ్విందామె గర్వంగా.

"సరే... అయితే... నేనేపోతాను" అంటూ ఆమెని తప్పించుకు పరుగెత్తాడు.

అప్పటికి కౌసల్య ఆర్తనాదాలాగిపో యాయి.

ఇక తను వెళ్లడం అనవసరమే కాక అభి లషణీయమూ కాదు. ఇప్పుడు తను వెడితే పుండుని రేపినట్లూ, పరిస్థితిని రెచ్చగొట్టినట్లే ఔతుంది. మేలు జరగదు సరికదా కీడే జరిగే ప్రమాదముంది.

అతను-

కౌసల్య యింటివేపు కాక

సముద్ర తీరంవేపు పరుగెత్తాడు.

★ ★ ★

సహజంగానే ఉదయం ఆలస్యంగా మెల కువొచ్చింది మాధవ్‌కి. ఆలస్యమంటే ఐదు న్నర. అప్పటికే సరస్వతి వొచ్చి మిగిలినవా రికి పాఠాలు చెబుతోంది. అతనవలంభిం చిన పద్ధతది సరస్వతి చురుకయినది కనుక ఆమెను మిగిలినవారికి గుర్విణిని చేసి నేర్పి స్తున్నాడు. హోటలు కుర్రాడు టేప్ రికార్డరు తెచ్చి ఎదురుచూస్తున్నాడు.

"తమరు- ఇక్కడ పడుకున్నారేం స్వామీ?"

"అక్కడ భయమేసి" నవ్వాడు.

"తమరికీ భయమేనా?"

"ప్రతివారికీ ఏదో ఒక విధమయిన భయ ముండనే ఉంటుంది" అంటూ చంద్రశేఖ రాష్టకం క్యాసెట్ పెట్టాడు.

జాలరులు ప్రయాణ సన్నద్ధులౌతున్నారు. కొమ్ము కర్రలు, పూనతాళ్లు, కొమ్ము కర్ర తాళ్లు, చిన్నగాలాలు, పెద్దగాలాలు, తెరచాపలు, తెర చాప కొయ్యలు, తెప్పలలో సర్దుకుంటూనే చంద్రశేఖరాష్టకం వింటున్నారు. వాళ్లకీ కొన్ని ప్రత్యేక యిష్టాలున్నాయి. ఘంటసాల తెలుగు తాత్పర్యంతో చదివిన భగవద్గీతంటే వాళ్లు చెవికోసుకుంటారు. ఆ అమరగాయకుని కంఠ మాధుర్యమూ, శ్లోకాలలోని పదపొందికా సాహిత్యంలోని గంభీరమూ, సంగీతంలోని శ్రావ్యతా, అన్నీ అద్భుతంగా అమరినవని కాబోలు భగవద్గీత వారినమితంగా ఆకట్టు కుంటుంది. చెవులు రిక్కించి వింటారు. శివ స్తుతిలోని నిరాడంబర సంగీతమూ, సూర్య

స్తుతిలోని తీయతీయని తేటతెనుగు పదాలూ, వాటిలోని భావమూ, నేపథ్యమూ, వాతావరణమూ, వారికెంతో నచ్చుతాయి. భక్తికీ సంగీతానికీ అవినాభావ సంబంధమే. త్యాగరాజు, అన్నమయ్య ప్రభృతులు, వాగ్గేయకారులు, త్యాగరాజకీర్తనలు, అన్నమయ్య పదాలు, గీతగోవింద శ్లోకాలు కంటె వేటిలో ఎక్కువ సంగీతముంది. అష్టపదుల్లోని అందమయిన పదబంధాలూ సంగీతమూ, పరమాద్భుతమే కదా!

వొడ్డున అటువేపు ఏదో గోలగా, తగవవుతున్నట్లుంటే, అటునడిచాడు మాధవ్. దళారీ ఎవరో ఓ జాలరిని తన బాకీ త్వరగా చెల్లించమని వొత్తిడి చేస్తున్నాడు.

"పొద్దుటే బలే ముకం" అంటూ అతన్నీసడించి కేకలు వేస్తూ తెప్పలు నీళ్లలోకి లాగి సాగిపోయారు వాళ్లు సముద్రంలో.

"బాకీ తీర్చడమంటే ప్రాణ మొప్పదు" తిట్టుకుంటూ వెళ్లాడు దళారీ. ఈ గంగపుత్రులదగ్గర రూపాయకు కొన్న చేపను వినియోగదారుడికి మార్కెట్లో ఆరు రూపాయలకమ్ముతారు. రవాణా... నిల్వకర్చులు తీసేసినా దళారీలకు తక్కువ మిగలదు. అయినా వాళ్లు బెస్తలని పీడిస్తూనే ఉంటారధిక వడ్డీలతోనూ, వేరువిధాలలోనూ.

"మజ్జాన్నం షావుకారే వొస్తాడంటూ అతను వెళ్ళాడు కనుక ఏదయినా గొడవవుతుందేమో అని తనూ వొచ్చాడా సమయానికి అక్కడికి. రెండు గంటల ఎండలో. బంగారంలా మెరుస్తున్న యిసుకమీద జాలర్లు తెచ్చిన మత్స్యరాసులు. చిన్నవీ పెద్దవీ.

కొమ్ముకోనం... బోడి కొనాం.

వంజరం, జెల్లలు, చల్లెరుగంట, గొరస, కవల, సొర, సార, నెత్తళ్లు, ఎన్నిరకాల చేపలో! ఎన్ని రకాల కుప్పలో! సొరచేప, పొడవుగా, పెద్దదిగా ఉండీ, పసుపు సార ప్రత్యేకంగా ఉండి చూసేవారిని నిలవేస్తున్నాయి. పసుపు సార తమాషాగానూ పేరుకి తగ్గట్టుగానూ ఉంది. పెద్ద చేపలా, పారలా వెడల్పుగా వెండి రేకులా ఉంది. చచ్చిపోయినా నీలమణులు పొదిగినట్లు, నీలిగోళీల్లా రెండుకన్నులూ ఎండకి మెరుస్తున్నాయి. నడుమ వరకూ బంగారం రంగు ఆ దిగువ వెండిలా తెలుపూ. అందమయిన చేప అది.

సొరచేప పొడవుగా తెగబారెడుంది. మూడువందలు పైనే చేస్తుందట అది. ఇంకా చాలా పెద్దవుంటాయిట సొరలు. అలాటిదొక్కటి పడితే గంగపుత్రుడికి పండగే. పట్టుకుందుకు ప్రాణాలకు తెగించ వలసి వొచ్చినా పట్టారో ఎనిమిది వందల నుంచి వెయ్యి రూపాయలవరకూ పలుకుతుందట సొరచేప మరీ పెద్దదయితే. ఈ అంకెలు చూస్తే వారి ఆర్జన అధికంగా అనిపిస్తుంది కాని.

పడవద్దె తియ్యాలి. పడవంటే పదిహేనో యిరవయ్యో వేల పెట్టుబడితో కూడిన సాధనం కదా. సరంగు (పడవ నడిపేవాడు)కి యివ్వాలి. కూలి, జీతంలాటి పద్ధతులు లేవు కనుక మిగిలినది పడవలో వెళ్ళినవారు సమంగా పంచుకోవాలి. ఈ పంపకాలు జరిగేసరికి మిగిలేది తక్కువే. చేపలు వలతాళ్లు కొరికేస్తాయి. వలలను చిక్కుపెట్టేస్తాయి. కొన్నయితే గాలాలను తెంపుకుపోతాయి. మరి కొన్ని గాలం ములుకును పాడుచేస్తాయి. తెప్పకి కర్ర చెడిపోయి బాగులు వొస్తూంటాయి. వలచిక్కులూ ముడులూ తామో ఆడవాళ్లో సరిచేసుకోగలిగినా కొన్నిటిని బాగుచేయించుకుందుకు డబ్బివ్వాలి వాడ బల్లీలకి. తెప్పల తయారీ, బాగూ వారి వృత్తి. జీవనాధారం. వాడబల్జీలు చేపలు పట్టరు మరి. ఇన్ని ఖర్చులూ పోయాక వారికి మిగిలేది పెద్దగా ఉండదు. ఎంత చెట్టుకంతగాలని సాగరపుత్రుల సంపాదనా అధికమే, ఖర్చూ అధికమే.

"గణపతీ!"

"ఆయ్! ఏటి షావుకారుబాబూ? "

"నీ దగ్గర డిస్కో వలుందిటగా? "

"మొన్నే కొన్నాను బాబూ... తెప్పించాను రొయ్యలకి బలే ధర పలుకుతుందిగా"

"ఔను. ఏదీ నీ డిస్కోవల? "

"ఇదుగో"

షాహుకారుతోపాటు మాధవ్ కూడా కుతూహలంగా చూశాడు. నైలాన్ వంటి దారాలతో అల్లబడి మెరిసిపోతూన్న ఆ డిస్కోవల మామూలు వలల కన్న వలక న్నులలోనూ వాటిలోనూ విభిన్నంగా ఉంది. నేటి శ్రోతలు డిస్కో మ్యూజిక్‌కి లాగ నేటి చేపలూ డిస్కోవలలకే పడతాయి కాబోలు! రొయ్యలకి డిస్కోవలలు! డిస్కో ఫీవర్, డిస్కో మ్యూజిక్, డిస్కో వలలు! ప్రపంచమే డిస్కో మయం.

"బాగుంది... మనం ఓమాటకొద్దామా? నీకు పడిన రొయ్యలన్నీ నావే. అందుగ్గాను మూడువేలిస్తాను. నిజానికి కొత్తమావాస్య నుంచి కొత్త మావాస్యకి లెక్క. కాని నాక ప్పుడు కుదరక యిప్పుడొచ్చాను. పర్లేదులే. నువ్వేం పైవోడివా? వొచ్చీయేడూ నాకే వేద్దువుగాని రొయ్యలు"

"సరే... వొచ్చే యేడు సంగతప్పుడు చూసుకోవచ్చు. ఇప్పటికి మీ మాటే కానీండి"

"పత్రం రాసే తెచ్చాను. ఇక్కడేలిముద్ద రేసే" అంటూ షావుకారు జేబులోంచి సిరా పెన్ను తీసి గంగాపుత్రుడి ఎడమచేతి బొటనవేలికి సిరా పూస్తుంటే అప్పుడతను మాధవ్‌ని చూశాడు. "బాబూ! మీరెలాగూ ఉన్నారు సమయానికి. షావుకారు రాసిందేటో సదివిసెప్పరూ? " అంటూ ఆ పత్రం మాధవ్ 'కందించాడు.

"అదికాదది కాదు" షాహుకారు చిందులు తొక్కాడు.

"వొచ్చే కొత్త మావాస్యనుంచీ రొయ్యలు నువ్వు వెయ్యడానికీ ప్రతిఫలంగా రెండువేలి వ్వడానికీ దానిలో వెయ్యి రూపాయలు బయానా అడ్వాన్స్‌గా యిస్తున్నట్లు మీ యిద్దరి మధ్యా రాసుకున్న వొడంబడిక"

"అన్నాయం! మోసం! దగా. నోటితో మూడుయేలు రాతలో రెండువేలయిపోయిందా! అడ్‌మాన్సు యివ్వకుండానే ఇచ్చేసినట్లు!"

షాహుకారెప్పుడో జారుకున్నాడు నీటిలో చేపలా.

"సమయానికి మీరు దేముళ్లా అడ్డుపడక పోతే అన్నాయమైపోదును" ఏడిచినంత పని చేసి పాదాలమీద పడబోయాడు అతను.

"ప్రతి సారీ ప్రతివారికీ ఏదేముడూ అడ్డు పడలేడు కదా. నిన్ను మోసగించబోయింది షాహుకారు కాదు"

"మరెవరు? " తెల్లమొహంవేశాడు.

"నీకు రాని చదువు, నువ్వు నేర్వని చదువు, ఈతరాని చేపనీళ్లలో మనగలదా? ఇప్పుడీ ప్రపంచంలో కనీస విద్యలేని మనిషి పరిస్థితీ అంతే. అందులోనూ మీవృత్తి వేటే అయినా మీకందరికీ వెయ్యి వ్యవహారాలాయె. వ్యవహారజ్ఞానం మేరకేనా అవసరమయిన లెక్కలూ చదువూ లేకపోతే. మీరిలాగే అన్యాయమయిపోడంలో ఆశ్చర్యమేముంది? " కీలెరిగి వాత పెట్టాడు మాధవ్.

"బుద్దొచ్చింది బాబూ. ఇవాళ్టినుంచే నేనూ మీబడికొచ్చేస్తాను. ఇలాటి దగాకోరు సావుకోర్లతో ఎవ్వారాలెట్టుకునేకంటే కంపెనీకేసు కోడమేనయం"

"కంపెనీ ఏమిటి? "

"కడపీదిలో ఆపీసుందిగా. ఇక్కడకాని చేపలమ్ముడవక మిగిలిపోయినా సరయిన ధర పలక్కపోయినా సేపలట్టుగెళ్లి ఆరికి చ్చేస్తాం. ఐసుముక్కల్లో నిలవుంచి యాను (వ్యాను)లో పంపేస్తారు. ఆ యానులోని సేపల్ని యిశాపట్నం దాకా పట్టుకెళ్ళి ఏ మదరాసులోనో మరో పెద్దూర్లోనో అమ్ముతారు అప్పుడక్కడుండే ధరకి. అది... ధర పర్నేదు. కానొకటే సిక్కు"

"ఏమిటి? "

"ఎప్పటికప్పుడు అక్కడికక్కడ యిలా సేపలట్టుకెల్లగానే అలా డబ్బులు సేతిలో ఎట్టీరు కంపెనీవాళ్లు. డబ్బు కళ్లజూడాలంటే ఆగాలి"

"ఆ లెక్కలూ అవీ"

"తకారరుండదనే మా యిస్వాసం. కంపెనీ గదా? "

"కంపెనీ అయినా మీరు లెక్కలు సరిజూసుకుంటే తృప్తికదా"

"ఇదుగో...సదువు నేరుస్తాగా. ఇకన్నీ సొయంగా సరిజూసుకుంటాను. నేనేకాదు, నా నేస్తాలెందరినో తెస్తాను బడికి. ఎందుకంటే...నాకొకటి దెలిసొచ్చింది యాళ జరిగిననుబవంతో"

"ఏమిటి? "

"మనిసి ఏపన్జేసుకునే వోడయినా కొంత లెక్కా డొక్కా సదువూ సంద్యా రాకపోతే యీ ప్రపంచకంలో మోసపోకుండా నెగ్గుకురాలేడు"

★ ★ ★

ఆవేళ...

అప్పారావు టీ దుకాణంలో కూర్చున్న మాధవ్- డప్పు శబ్దంవిని బయటకు వొచ్చాడు. ఎవరో టముకు వేస్తున్నారు. ఒకటి రెండు నిముషాలు టముకు వాయింపు అందరి దృష్టీ ఆకట్టుకునేలా. అప్పుడు "ఇయేళ కల్లు సూరిగాడి జన్మదినం. పుట్టిన్రోజు. అందుకని పుట్టిన్రోజు సందర్భంగా తాగే వాళ్ళందరికీ కల్లు పాకలో ఉచితంగా సరఫరా. ఎందరొచ్చి ఎంత తాగినా ఉచితమే. అందరూ రండహో..." అని గట్టిగా చెప్పి మళ్ళీ టముకు. నిర్ఘాంతపోయాడు మాధవ్. ఆ టముకు సమరానికి నాంది పలుకుతున్నట్లే అనిపించింది. అలాగే వినిపించింది.

ఏమిటేమిటని అందరూ టముకతన్ని ఆపీ అడిగీ మరీ విషయం తెలుసుకుంటున్నారు. ఉట్టినే కల్లు! బలే బలే. తాగినంత కల్లు. సరేసరే. డబ్బులివ్వక్కర్లేదు, పూటుగా పట్టించొచ్చేడమే. తమాసాగానే ఉంది. పుట్టిన్రోజుకూ అందరికీ పూటుగా కల్లు!

టముకతనందరినీ ఆహ్వానించేస్తున్నాడు- రాత్రికి కల్లు పాకకి రమ్మని ఢంకా బజాయించి మరీ చెబుతూ.

కల్లుసూరి కుట్ర అర్థమై మాధవ్‌కి చాలా కోపమొచ్చింది. ఆగ్రహమూ ఆవేశమూ ఒక్కుమ్మడిగా అవహించాయతన్ని. మిట్టమధ్యాహ్నపు మండుటెండలో తాను విన్నదానిని బట్టి కల్లుపాకెటుంటుందో ఊహించుకుంటూ వేగంగా నడవసాగాడు. అటూ ఇటూ ముళ్లపొదలూ, రాక్షసతుప్పలూ, రక్కసపొదలూ మధ్యగా సన్నని కాలిబాట. బాట దాటీదాటగానే విశాలమయిన ఖాళీ జాగా. ఇసుకను చదునుగా పరిచిన విశాల స్థలం. దానికొకవేపు పాక. పాక వెనుక నుంచి కానీ పక్కలనుంచి కానీ మరోపాక లేదు. అక్కడికొచ్చినా అక్కడినుంచి వెళ్ళాలన్నా కాలిబాటే శరణ్యం. పక్కకడుగేస్తే ముళ్లూ... తుప్పలూ.

"ఏటి మండుటెండలో వొచ్చేశారు సాములోరు? ఓ... ఇప్పుడయితే ఎవరూ ఉండరూ, చూడరూ అనా? ఉట్టినే వొస్తదంటే తమరూ ఉప్పుదినే రకమేనన్నమాట. ఫ్రీగా వొస్తదని కల్లుకొచ్చారవునా? కాన్నేను రమ్మన్నది రాత్రికి. కొత్తబిచ్చగాడు పొద్దెరగడని కాషాయస్వామికి కల్లేళ తెల్నేదు. నిజానికి కల్లిలా కరకరలాడే ఎండనే తాగాలి. సమయానికే వొచ్చారు రండి"

సూరిగాడటూ ఇటూ చూశాడు. ఎవరూ లేరు, తనూ అతనూ తప్ప. ఇప్పుడిక్కడ అతగాడిని మట్టుపెట్టేస్తే రుజువేటి, సాచ్చిమేటి? ఏవూరాడో, ఎవరూ లేనోడు. సామిని జంపేసి సెవాన్ని సవుద్రంలోకిసిరేస్తే- తన కల్లేపారం కమ్మగా సాగిపోతది. నాబాలకి అడ్డు తొలగిపోతది. సామి చస్తే కనిపించకపోతే- అడిగేదెవడు, పెట్టేదెవడు? అడివిలో అబ్బా అంటే ఎవడికి పుట్టిన బిడ్డవిరా అన్నట్టే. సాములోరికి కామవోంఛ

లేదుగాని కల్లు వాంచుందన్నమాట. అత గాడు కల్లు తాగితే సరేసరి. మానీసినందరో ళ్లకీ మీ గురువు కల్లు తావుకొచ్చె చెప్పేవి శ్రీరంగనీతులూ దూరేది సారపాకలూ అని (ప్రెత్తెచ్చంగా చూబిచ్చి ఆళ్లందర్నీ మళ్ళా కల్లుపాకకి లాగేసుకోవొచ్చు కాషాయస్వామి కల్లు దాగనంటాడా- యాట కత్తుండనే ఉంది అనుకుంటూ.

"లోపలికి దయసెయ్యండి సామీ!" అన్నాడు మర్యాద వొలకబోస్తూ. వొస్తే అటో ఇటో తేల్చెయ్యొచ్చునని. కాని-

"ఉహుఁ. నేను అపవిత్రస్థలాలలో అడు గుపెట్టను" అంటూ మరలిపోయాడు. ఊరి వేపు పరుగెత్తాడు. వాడవేపు పరుగెత్తాడు.

ఆ టముకు నిరాఘాటంగా సాగిపో తోంది.

"కాని కర్చు లేకుండా కల్లు!" సంబరపడి పోతున్నారు పిల్లా పెద్దా అందరూ.

"ఆళ్లు కల్లు మానేశాక మన ప్రాణాలూ కొంపలూ సుకంగా ఉన్నాయనుకుంటే మల్లీ ఈ ఉప్పెనేటి మన సంసారాల మీదకి? " అని వాపోతున్నారు చాలామంది ఆడవాళ్లు. మంచీ చెడూ ముందుచూపు కలవారు.

"నెల దాటిపోతూన్నది కల్లుతాగి. ఇయాళ రేత్తిరి కొత్తగా ఉంటదేమో కల్లు రుసి. అలవాటు దప్పిందిగా. ఉషారుగా ఉంటదో, ఎలాగుంటదో? సూడాలా సిత్రం' ' అని లొట్టలు వేసుకుంటున్నారు కొందరు మగవాళ్లు. పిచ్చెక్కినవాడిలా వాడవాడకి గడపగడపకీ తిరుగుతున్నాడు మాధవ్. పొద్దు గుంకుతున్నా సముద్రస్నానం సంగతి కానీ సంధ్యావందనం సంగతి కానీ దేని గురించీ జ్ఞాపకం లేదు.

చీకటి పడిపోతోంది.

సూరిగాడు ఆత్రంగా ఎదురు చూస్తు న్నాడు. పెద్ద పెద్ద బానలతో కల్లు సిద్ధం చేసుకుని. మధ్య మధ్య చంద్రమతికి జాగ్ర త్తలూ మలుపులూ చెబుతున్నాడు. చీకటి పడింది. తాగేవాళ్ళొకరూ ఒకరూ వొస్తు న్నారు కానీ వాళ్ళు ఎప్పటివాళ్లే. కొత్తవాళ్లు. అప్పుడు మానేసి ఇప్పుడు కొత్తగా వొచ్చే వాళ్లు ఒక్కరూ రారేం? మానేసినోళ్లని మళ్లించడానికే కదా తనీ పదకమేసింది పుట్టి న్రోజు పేరుతో. ఆరాటం ఆపుకోలేక అతను ఎదురు వెళ్లసాగాడు. ఎవరొచ్చినా పోయినా అదొక్కటే కదా తోవ. ఆ తోవ మొదట్లో బాటకటూ ఇటూ బారులు తీరి ఆడవాళ్లూ, పిల్లలూ. కల్లుపాక వెళ్ళాలంటే ఎవరేనా వారిని దాటుకుని కాదని వెళ్ళవలసిందే. తాగడానికొచ్చే తమ మగవారినీ స్త్రీలూ, పిల్లలూ వెళ్లొద్దని ఏడుస్తూ బతిమాలుతు న్నారు. దానికితోడు-

"పుట్టినరోజు పేరిట కల్లు పోయించ డంలో కుట్రేమిటో నేను చెప్పాలా? ఈ వొక్కసారి డబ్బులు తీసుకోకుండా పోసి- తరువాత ఇంతకంతా మీ నుంచి లాగెయ్యా లని ఎత్తు. అది మీరు గ్రహించీగలరు- చదువు నేర్చుకుంటున్నారు కనుక" అంటూ మాధవ్ అభ్యర్థనలు "నామీద గౌరవ ముంటే వెనక్కి వెళ్ళిపొండి"

"ఊరికేకదాని ఇవాళ తాగుతాం, కాని రేపు డబ్బులిచ్చి తాగుతామా? "

"కల్లు మానడానికెంత కష్టపడ్డారో మీరు మరిచినా నేను మరవలేను. ఊరికే తాడొ చ్చిందని ఉరేసుకుంటామా? మీరన్నీ తెలిసి నవారు. మీరే ఆలోచించండి. మళ్ళీ కల్లుని తాగి కాపురాలు కూలదీసుకుంటారా? మీకు చేతులెత్తి దణ్ణం పెడతాను. వెళ్ళిపొండి. వెనక్కి వెళ్ళిపొండి. లేదా..." అంటూ ఆ చిన్నబాటకడ్డంగా పడుకుని-

"నామీంచి నడచివెళ్ళండి, మీకు నాకంటే కల్లు ప్రియమయితే" అని మట్టిలో ఉంటూనే చేతులు జోడించాడు. అది చూసి-

"నాయాపారం మీద దెబ్బ కొట్టడానికి నువ్వెవడివి? " అంటూ కర్రెత్తాడు సూరి, బాటమీద పడుకున్న మాధవ్ మీదకి.

"వాళ్ళ బతుకులమీదా... సంసారాల

మీదా... నీ కల్లుదెబ్బ కొడుతూంది కనక నేను కలుగుజేసుకోక తప్పదు" నేలమీంచి లేవకుండానే చెప్పాడు మాధవ్.

క్షణికావేశంలో ఒళ్లు మరచిన సూరిగాడి చేతిలోని కర్ర మాధవ్ ఒంటిమీద పడేదే బలంగా. కాని ఆ కర్రకీ, మాధవ్‌కి మధ్య స్త్రీలూ, పిల్లలు, మగవాళ్లు కల్లు తాగడానికని కొచ్చినవాళ్ళూ అడ్డుపడ్డారు. అంతేకాదు.

"స్వామి వారిమీదకే కర్రెత్తబోతావురా?" అంటూ సూరిని ఉతికి ఆరేసేశారు ఉద్రేకంలో. ఈ గలాటా చూసి చంద్రమతి కొట్టు కట్టేసి పారిపోయింది. కల్లుబానలు లోపల పెట్టించి. కల్లు లేకపోవడంతో ఇక వాళ్లూ అక్కడుండవలసిన అవసరం లేకపోయింది. ఎవరి మానాన వారు చెదిరిపోయారు.

కల్లుసూరిగాడి జన్మదిన వేడుక అలా ముగిసింది, అది అతనికీ వారికీ కూడా ఒక అనుభవంగానూ, పాఠంగానూ మిగిలేలా. ఆ సంఘటన తరువాత మాధవ్‌కి ఆత్మవిశ్వాసం మరింత పెరిగింది. గంగాపుత్రుల మీద. వాళ్ళు కల్లు ప్రలోభంనుంచి బయట పడినట్లే. మరికొన్ని నెలలు వారిని దాని నుంచి దూరంగా ఉంచగలిగితే- జీవితంలో వారు మరి అటు చూడరు. కాని కల్లుని మరిపించాలంటే అంతకంటే నిషాను అలవాటు చేయాలి. మద్యం కంటె నిషా అయినది జూదంకంటే వ్యసనమయినది. తమ కందుబాటులో ఉండేది. ఏదా అని తీవ్రంగా ఆలోచించసాగాడు మాధవ్. మనిషికి నిర్వ్యాపారత్వాన్నెంత తగ్గించగలిగితే అతనంత తక్కువ చెడిపోతాడు.

"పాటలు పాడగలాళ్లనీ, పజ్యాలు పాడగలాల్లనీ, ఎంట బెట్టుకు రమ్మన్నారుగా. తెచ్చాను అరుగో"

"నా పేరు లింగరాజు కానీండి. కె.డి. రాయలంటారండి. అంటే నేనేమో కిష్ణదేవ రాయల్లా ఉంటానటండి. నేను పజ్జాలూ పాటలూ పాడగలనండి"

"నేనూనండి. నా పేరు గంగరాజండి. మరీడేమో నాగరాజండి"

"మీరు యీణ్ణి సూడండి. నాగరాజుగోణ్ణి. యేషం కట్టకుండానే యినాయ్‌కుళ్లా ఉంటాడు. గున్నేనుగా అంటామండి మేం"

గున్నయేనుగు! అతని మెదడులో ఏదో మెదిలింది.

"ఇంతమందిలోనూ మీరు ముగ్గురేనా నటులు?"

"సిన్నా సితకా ఇంకా ఐదారు గురున్నారండి"

"వాళ్లెందుకు రాలేదు?"

వాడోళ్లొకపట్నాన కల వరండి. నాటకానికయితే కలుస్తారు కానీండి. ఇక్కడ నాటకం ఆడి శాన్నాళ్లయిపోయింది. సెప్పాలంటే నోరు దురదగానే ఉందండి. నాటకమాడాలని"

"నాటకం వేద్దురుగాని"

"సామీ! నిజంగా నాటకం తీస్తారా? మరి కర్చవుతుందిగదా శానా?"

"కర్చు సంగతి నేను చూసుకుంటాను"

"దిరేసులయితే అనకాపల్లినిండా అయేనండి. గాంధీబొమ్మ సుట్టూ డ్రామా డ్రెస్ కంపెనీలేనండి. రికార్డింగ్ డాన్సుల్జేసేవాళ్ళూ, యీరోయిన్లూ కూడా ఆ సుట్టూతే ఉన్నారండి. అన్నట్టు మావాడే ఆర్మణీ పెట్టే వాయిస్తాడండి"

"ఇకనేం? అతిత్వరలో నాటకం వేయాలి"

"జగన్నాథస్వామి రథోత్సవంకాండీ?"

"ఎప్పుడది? "

"ఆషాడమాసంలోనండి"

మనసులో కష్టపడితే కానీ ఆషాఢమాసం ఎన్నాళ్లుందో తేలిగ్గా స్ఫురించనందుకు తన తెలుగుతనాన్ని క్షమించమని కోరుకున్నాడు మాధవ్. తెలుగువాళ్ళని పేరేకాని ఎంత మంది ఇంగ్లీషు నెలలే తప్ప తెలుగు మాసాలు తెలుసు?

"అంతవరకూ కాదు, ఈలోగానే"

"రథోత్సవానికయితే బాగుంటదండి"

"అప్పుడూ వేద్దురుగాని మీరు తలచు కుంటే..."

"నిజమాండి? మాకేమండి... డబ్బెట్టుకు నేవాళ్లుంటే నెలకో నాటకం ఆడేగలం"

"డబ్బు సంగతి మీరాలోచించొద్దు. నిజంగా నెలకో నాటకం వేయగలరా? "

"ఓc మాకేంపనండి, యేట నుంచొచ్చే సేక? ఊరికే తిరగడమేగా? "

"అయితే ఇకనుంచి ఇక్కడ ప్రతినెలా నాటకం వేద్దాం"

వేదికమీద గంట ఆడే నాటకానికి నెల ముందునుంచీ రోజుకి ఎన్నో గంటల అభ్యాసం అవసరం. అంటే నటులకి తీరిక మిగలదు. వీరికి కావలసిందే అది.

"చూడండి. మీరు కళాకారులు. మీలో కుల... జాతి... వర్గభేదాలుండకూడదు. మనుషులంతా ఒకటే. రేపు మీరందరినీ కలుపుకుని రావాలి మరి"

"అలాగేనండి. నాటకమెయ్యడానికంటే అన్నీ మరిసిపోయి సంకలు గుద్దుకుంటూ వొస్తారండి. ఇంతకీ మనం వేసేది సాంగి కమా, పౌరాణిక నాటకమా? "

"రేపు అందరం కలిసే నిర్ణయిద్దాం"

"అయితే రేపీపాటేలకిక్కడే తcవర్ని కలుత్తాం" అని వాళ్లు వెళ్లడమేమిటి, మాధవ్ నీటిలోకి దిగాడు. ఆ సాయంత్రం ఎందుకనో నీళ్లు చాలా చల్లగానూ కరుస్తున్న ట్లుగానూ అనిపించింది. నాలుగడుగులు ముందుకు వేసి ఒక్క ములుగు మునిగేస రికి వెచ్చగా హాయిగా వొదలలేనంత సుఖంగా. సముద్రం శాస్త్రీయ సంగీతంలా టిది. కొంచెం లోతుకి దిగేవరకూ భయపె డుతుంది. ఆపాటి ప్రవేశించామో వెచ్చగా మధురంగా మరి వొదిలి పెట్టదు. అతను యీదుకుంటూ చాలా లోపలికే వెళ్ళాడు. ఈతొచ్చినవారు నీటిని చూస్తే చిన్నపిల్లలే అయిపోతారేమో! అతను అరగంటసేపు నీళ్లల్లో ఈదాడు. అప్పుడయినా విధిలేనట్లే వెనక్కీ వొడ్డుకి వొచ్చేసరికి-

నాగేశ్వర్రావ్ నవ్వాడు. "గురుగారూ! ఈత దంచేస్తున్నారు. నీళ్లని, గంగని రఫ్ఫా డేస్తున్నారు"

"రఫ్ ఆడేడమేమిటీ? "

"సినేమా డైలాగులెండి" అనేశాడతని కర్థ మవదన్నట్లు. "సామీ! అల్లప్పుడు నా మాటలు రికార్డు జేశారే. అవోసారి పాడిం చరూ? ఇనాలనుంది. ఎన్నాళ్లయింది"

"అలాగే. తరువాత బసకిరా" నవ్వాడు మాధవ్. చిన్నప్పటినుండీ మనిషికి తన ప్రతి బింబంకంటే అందమయినది, తన కంఠం కంటే తీయనయినదీ మరొకటుండదేమో!

★ ★ ★

"నమస్కారం. తమరిని నేను చూశాను. తమరి గురించి వింటూనే ఉన్నాను. కాని మనం కలుసుకోడమిదే ప్రథమమేమో!"

"నమస్కారం తమరు? "

"సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రంటారు. ఇక్క డున్నవి నాలుగే బ్రాహ్మణ కుటుంబాలు. వీటిలో నాదొకటి. అన్నప్రాశన నుంచి అప రకర్మలవరకూ నేనే చేయిస్తానిక్కడ. దోసూరు, అచ్యుతాపురాలలో కూడా నాకు పౌరోహిత్యముంది"

"మంచిది. మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది"

"కాని నాకు మాత్రం బాధగానే ఉంది, నిజం చెప్పాలంటే"

"అదేం? " అంటూ ఆశ్చర్యంగా చూసి "అసలు మీరేం పనిమీదొచ్చారు? కూర్చోమ

నడానికేనా? "

"బాధలేదు. సైకతంకంటే సముచితమయి నదీ శుభ్రమమయినదీ వేరే ఆసనమేముం డాలి? వయసుమీరినవాడిని. ఆపైన కీళ్ల వాపు వ్యాధి. ఇలా కూర్చుంటాను" అంటూ ఆయన ఇసుకలోనే కూలబడ్డాడు.

"చెప్పండి-" అంటూ మాధవ్ కూడా కూర్చున్నాడిసుకలో.

"చెప్పక తప్పడంలేదు. మీరు ఈ చేపల వాళ్లకి సంస్కృతం నేర్పుతున్నారట? "

"నిజమే"

"సంస్కృతం దేవభాష. అది అలగా వాళ్లకి అలవర్చడం అపచారమూ, అదిపా పమూ. ఆపైన వీళ్లకి సంస్కృతం వొచ్చేస్తే బ్రాహ్మణుల విలువేముంటుంది? అలవిమా లిన భాష నేర్పడం, వర్ణసంకరం కంటే ఘోరమయిన నేరం. మన చేతులతో మన కళ్లనే పొడుచుకుంటామా! చిన్నవాడివి. తెలి యకేదో పొరపాటు చేశావు కుర్రతనంకొద్దీ. ఇకనయినా మానెయ్యి నాయనా"

ఉత్తరీయంతో ముఖం తుడుచుకుని, జంధ్యం సవరించుకున్నారాయన.

"క్షమించండి. మానను, మానలేను. భాషకి కులమత విచక్షణుండదని నా విశ్వాసం. నేను చేసేది పొరపాటే అయితే అది తెలిసి చేస్తున్నదే. కావాలని అవలంబి స్తున్నదే. నాకొచ్చిన సంస్కృతం విద్య అతి స్వల్పం. పంచుతున్నకొద్దీ పెరిగేది విద్య అని పెద్దలే అన్నారు. చేపలవాళ్లంటూ మీరు హీనంగా మాట్లాడారే వారు నా కంటికి మనుషుల్లాగే కనిపిస్తారు. వారిని గౌరవించడంలోనే మన గౌరవం ద్యోతకమ వుతుందని నా ఉద్దేశం. వర్ణసంకరం వంటి మాటలకర్థం నాకు తెలియదు. ఎందుకంటే నాకు మనుషులలో ఆ వ్యత్యాసం గోచరిం చనే గోచరించదు. మీరేమీ అనుకోనంటే నేనసలు బ్రాహ్మణుడినే కాను"

ఆఁ"

"నమ్మితే నమ్మండి నేను నిజమే చెప్పాను"

"పచ్చగా దబ్బపండులా ఉన్నావు. సంధ్యా వందనం చేస్తావు. సంస్కృతం చదివావు. యజ్ఞోపవీతం ధరించావు. నువ్వు నిజంగా బ్రాహ్మణుడివికావూ? నీ మాటలలో సంస్కారముట్టిపడుతోందే!"

"అభ్యాసం కూసువిద్య. నా శరీర వర్ణానికి నా బాధ్యతా అర్హతా ఏమీలేవు. విశ్వాసం కొద్దీ యజ్ఞోపవీతమేకాదు కాషాయవస్త్రాలూ ధరిస్తున్నాను. శాకాహారినీ"

"ఐనా బ్రాహ్మణుడివి కానంటావు" ఇంకా నమ్మలేకపోతున్నాడాయన.

"జన్మచేత కాను. ప్రవర్తన చేత కావాలని విశ్వప్రయత్నం. చూడండి. మీ కీళ్లనొప్పికి హోమియోపతిలో చక్కని మందుంది. నా బసకి, తుపాను రక్షణ కేంద్రానికి నాతో రాగలిగితే..."

"అంత కంటేనా? ఎన్నో మందులు వాడాను. ఫలితం కనిపించలేదు. ఈ కాలపు వైద్యులకెంతసేపూ డబ్బు యావేకాని చిత్తశుద్ధుంటేగా? నువ్వు పవిత్రుడిలా కనిపి స్తున్నావు. ధన్వంతరినే తలపింపజేస్తు న్నావు. పదనాయనా! నాకు మంచి మందిచ్చి పుణ్యంకట్టుకో" అంటూ మాధవ్ వెంట నడిచాడాయన. తను వొచ్చిన పనిని వొదిలేసినట్లే.

ఆయనని పంపి మళ్లీ సముద్రతీరానికి వొస్తూంటే కన్నులపంటగా ఇసుకలో ఆడు కుంటున్న గుంపులు, ఒకచోట చదరంగమూ మరోచోట పిన్‌బోర్డు, అలాగ మరొకవేపు ఆడపిల్లలు సరస్వతి దగ్గర పాటలు నేర్చు కుంటున్నారు. ఇప్పుడామెనోట ఎంతటి సంక్లిష్ట అక్షరమయినా అతిస్పష్టంగా పలుకు తోంది. పలుచని ఆమె నాలుక ఎలాపడితే అలా తిరుగుతూందేమో. జయదేవుని అష్ట పది ఆ పాపనోట అందంగా వినవొస్తోంది.

"హరి రిహముగ్ధవధూనికరే... విలాసిని విలసతి కేళిపరే.

చందనచర్చిత నీలకళేబర, పీతవసన వన

మాలీ"

ఎంత తీయగా పాడుతోంది. ఈమె నోట భవద్గీత పలికితే?

అతని మనసులో అస్పష్టమయిన ఊహ రూపుదిద్దుకుంటోంది.

కళ మామూలు జీవితాన్ని మధురతరం గావిస్తుంది. అంతేకాదు, క్రమబద్ధమూగావిస్తుంది. జీవనవిధానాన్నే నియంత్రించగలదు కళ. మనుషులని ఉన్నతులని చేస్తుంది. ఇప్పుడు ఇంటి దగ్గరకూడా ఈ శ్లోకాలు చదువుతూ పాటలు పాడే సరస్వతంటే అమ్మానాన్నలకెంతో ముద్దు అపురూపమూనట. సరస్వతేకాదు. ఆటాపాటా నేర్చుకుంటున్న పాపలందరూ ఇళ్లల్లో ఆ పాటలూ శ్లోకాలూ పాడుతూ అందంగా అడుగులువేస్తుంటే పెద్దలకు తమ పిల్లలు ముద్దూ ముచ్చటా గొలుపుతున్నారట. మునుపిది ఎరుగరట.

కళ తనని అభ్యసిస్తూ ఆరాధించేవారికీ ఆనందిస్తూ ఆస్వాదించే వారికీ కూడా ఆహ్లాదకరమే. వారికీ వీరికీ కూడా వన్నె పెంచేదే!

ఆలోచిస్తూ నడుస్తున్న అతనక్కడ ప్రశాంతంగానూ ఏకాంతంగానూ ఉందనిపించి సముద్రంలో దిగి స్నానమూ సంధ్యా నిర్వర్తించుకుని సెంటరుకి బయలుదేరాడు.

"రండి స్వామీ! మీకోసమే ఎదురుచూస్తున్నాను. మీకు జాబులొచ్చాయి" అంటూ రెండు కవర్లందించాడు. వీటిలో ఒకటి మరీ బరువయినది! ముందుగా అదే తెరిచాడు మాధవ్. విశ్వం నుంచి.

"మాధవ్!

మీరు కులాసా అనుకుంటాను. నేనక్కడికి వొచ్చినప్పుడు చక్కటి కంపెనీ ఇచ్చారు. కృతజ్ఞతలను కేవలమూ మాటలకి పరిమితం చేయడంకంటే అక్కడ నేను తీసిన ఫొటోల కాపీలు పంపడం బాగుంటుందనిపించి అన్నీ పంపుతున్నాను. సరదాగా ఉండొచ్చు చూడడానికి. రచన కోసం అక్కడికి ఎప్పుడో మళ్లీ వస్తాను. అప్పుడు కలుద్దాం"

ఆ ఫొటోలను ఆసక్తిగా చూశాడు. ఏనుగులకొండ, సాగరు మెట్ట, సముద్రతీరం, జాలారివారి కొందరు స్త్రీలు, పిల్లలు, గుడి సెలు రోడ్డు సెంటరు... చాలా ఫొటోలు. రంగులలో ఫొటోలో తాను రోజూ చూసే దృశ్యాలే తమాషాగా ఏదో ప్రత్యేకంగానూ అందంగానూ కనిపిస్తున్నాయి. వాస్తవం కంటే ఛాయే సుందరతరమై భ్రమింపజేస్తుందేమో ఒక్కొక్కప్పుడు.

"ఏమిటి బాబూ? "

"మనూరి ఫొటోలు. మన సముద్రం ఫొటోలు"

"నాకూ చూపించరూ? "

ఇప్పుడు అప్పారావ్ మాటలో యాస తగ్గిపోయింది. అతను వయోజన విద్య నేర్చుకుంటున్నాడు. ఇక్కడి గంగాపుత్రులు చాలా మంది ఒకే మాట చెప్పారు చదువుకుందుకు రాగానే.

"పట్నం వెడితే మా యాసకి నవ్వుతారు. మమ్మల్ని సిన్నచూపు జూస్తారు"

"కాని భాషవేరూ యాస వేరూ కాదు. భాష సంస్కృతమూ, బాస యాస అనేవి తెలుగూను. ఏదయినా భాషే"

"మరి మా యాసకారికెందుకూ ఎటకారం? మీరేమనండిగానీ మాట మనిసి లువ జెబుతుంది. మాకు మంచి బాస మీరు మాట్లాడుకునే లాటిది నేర్పండి ముందు. మాలో మేమెలాటి బాస మాట్లాడుకున్నా పైకెడితే ఆల్లతో సమంగా మంచి భాష మాట్లాడగలగాలి. అదీ"

వారి మాటలలో నిజముంది. వారి బాసలోనూ యాసలోనూ ఎంత తీయదనమున్నా పైవారి ముందు తేలిపోతుందని వారి భయం.

ఫొటోలు అప్పారావ్‌కిచ్చి రెండో కవరు తెరిచాడు.

ఆశ్రమం నుంచి స్వామి నుంచి తను

పదిహేను రోజులకిందట రాసిన ఉత్తరానికి సమాధానం సంస్కృతంలో.

"మాధవ్!

ఆశీస్సులు నీ లేఖ నాకెంతో ఆనందం కలిగించింది. గ్రామాంతరంలో ఉండడమూ, కార్యభారమూ వల్ల జవాబులో జాప్యం జరిగింది. నువ్వు చేస్తున్నవి ఎంతో మంచి పనులు. ఆశ్రమం నుంచి ఎటువంటి సహకారమూ సహాయమూ కావాలన్నా సందేహించకుండా రాయి. నీ విశేషాలెంత ఉత్సాహం గొలిపాయో! ఈపాటికి నీకు జీవితపు విలువా జీవితానందమూ అవగతమౌతున్నాయని ఊహిస్తున్నాను. ఏదయినా ఇవ్వడమనేదెప్పుడూ అద్భుతమయిన హాయి. సంస్కృతాన్ని సులభంగా నేర్చుకుందుకు మార్గాలు సూచించే పుస్తకాలను విడిగా పంపుతున్నాను. నీ ప్రయత్నాలకివి చాలా ఉపకరించగలవు. మరి ప్రస్తుతానికి శలవ్.

శుభాకాంక్షలతోనూ ప్రేమతోనూ...

ఆ చిన్న ఉత్తరం అతనికెంత ఆనందమూ ఉద్వేగమూ కలిగించిందో! స్వామినుంచి అభినందనలనందుకోడం అతి చక్కని అనుభూతే. పరవశమే.

అతనప్పటికప్పుడే, అక్కడికక్కడే మూడు లేఖలు రాసేశాడు మరుక్షణం ఆలస్యం చేయకూడదన్నట్లు.

పాలూ పళ్లూ తెచ్చి యిస్తూ- "ఎవరూ లేరనుకున్నాను మీకు, మీ మాటల్లో ఎప్పుడూ రాకపోతే. కాని... మూడు జాబులు రాశారే" అన్నాడప్పారావ్

"నాకెవరూ లేకపోవడమేమిటి, ఇక్కడ మీరందరూ అవతల అంత ప్రపంచమూ ఉండగా" ఆనందంగా నవ్వాడు మాధవ్.

"ఏమిటీ... మీరివాళ మహ హుషారుగా ఉన్నారు. ఇవిగో ఫొటోలు. బాగున్నాయి. మనం రోజూ చూసేయే అనిపించింది. నా హోటలకీ, మనవాళ్లకీ చాలా తీశారే" అంటూ ఫొటోలకవరందించాడు.

అది అందుకుని- ఉత్తరాలను డబ్బాలో వేసేందుకు వెళ్తాంటే- ఆ బడ్డీ కిళ్లీకొట్టు దగ్గర-

"బాబ్బాబు! మూసేకు. నాలుగు గంటసుట్టలూ రెండగ్గిపెట్లూ ఇవ్వు. ఆడు కల్లుకిపోతూ మరీమరీ చెప్పాడు. అగ్గిపెట్టి అట్టు గెళ్లపోతే రాతిరంతా సీకటే గుడిసెలో. సుట్టలట్టుకెళ్లకపోతే రాతిరంతా సీవాట్లూ సెప్పుదెబ్బలే నాకు"

బ్రతిమాలుతోందామె. ఆ కంఠం కౌసల్యది. ఆమె కౌసల్య.

అతని హృదయం సంతోషంతో గంతులేసింది. అతనికి చటుక్కున గుర్తొచ్చిందేదో. అతనామెకు దగ్గరగా నడిచాడు.

"కౌసల్యా..." మెల్లగా పిలిచాడు.

ఆమె చివ్వున ఇటు చూసింది. తోకతొక్కిన తాచులా కోపం పట్టలేనట్లు.

"మంచి మనిసికోమాట" అంది విసురుగా.

అతను దీనుడూ ఖిన్నుడూ ఐపోయాడా మాటకి. "ఇది...చూడు"

కాదనలేదామె. ఆ కవరందుకుని, మరో మాట లేకుండా సాగిపోయింది ముందుకి. చేతిలో కవరుతోపాటు చుట్టలూ, అగ్గిపెట్టెలూ కూడా పట్టుకుని. అతను నిట్టూర్చాడు భారంగా, బాధగా. ఏమిటి బలహీనత తనలో? ఆమె పరిస్థితి... కత్తులబోనులాటి కాపురమని తెలిసీ... గరటయ్య అనే రాక్షసుడి చేతిలో పడిన రామచిలుకని తెలిసీ... ఎప్పటికప్పుడు తనెందుకిలా ఏదో ఆశతో తొందరపడుతున్నాడు? పొరపాటు చేసి- క్రూరమయిన పరిణామాలకు తావు కల్పిస్తున్నాడు? తను మనసా వాచా కర్మణా... త్రికరణశుద్ధిగా కోరేదామె ఆనందం. కాని తనందుకేం చేసినా దురదృష్టవశాత్తూ అదామెకు కష్టమే కలుగజేస్తూంది. ఆమె ఎన్నాళ్లింకా సహనం వహిస్తూ... గరటయ్య దౌష్ట్యానికి నిత్యమూ బలిపశువౌతూ బతుకగలదు?

వివాహమూ... విడిపోడమూ, మారుమ

నువులూ కూడా అతి సులభమూ సాధారణమూ అయిన తెగకు చెంది కౌసల్యేందుకా కష్టాల పంజరంలో కుమిలిపోతూ కాలం గడుపుతోంది?

"సామీ"

"ఊఁ"

"నాటకం రోజు దగ్గర పడిపోతోంది" అన్నాడు నాగరాజు.

"ఔను. వారమే వుంది. మీ అందరికీ సంభాషణలూ పద్యాలూ బాగా వొచ్చేశాయా? "

"ఓ, మీరో పాలొచ్చి చూస్తే..."

"రేపు చూస్తాను. అందరికీ చెప్పి సిద్ధం చెయ్"

"అలాగే బాబూ"

అనుకున్నరోజు రానే వచ్చింది.

చీకటిపడడమేమిటి, నాలుగు వాడల వాళ్లూ సముద్రపొడ్డున చేరారు. అప్పటికే అక్కడ స్థానికుడయిన నిపుణుడు దీపాలమర్చాడు. గంగాపుత్రుడయిన ఓ శిల్పి చక్కగా సెట్ వేశాడు.

ఒకవిధంగా ఇప్పుడు నగరాలలో ప్రసిద్ధి చెందుతున్న స్ట్రీట్ ప్లే (వీధినాటకం)కి అనుకరణా, చేర్పూ ఈ ప్రక్రియ. సముద్రంలో నీటిలో ఒక కృత్రిమపు ఏనుగు. దానికి ఒక పక్క... కొంతదూరంలో పడవలను జోడించి వాటిమీద బల్లలువేసి ఎత్తుగా తయారుచేసిన భవనం. దానినిండా రంగు రంగుల కాంతులు.

అది వైకుంఠం.

ప్రేక్షకులు మురిశారు. ఆరుబయట ఇసుకలో కూర్చుని సముద్రంలోనూ ఉన్నతమయిన వేదిక మీదా జరిగిన సన్నివేశాలను తిలకించడం వారికి చాలా ఆనందం కలిగించింది. అనూహ్యామయిన విషయమేమిటంటే చూడవచ్చిన వారిలో కొందరు "మళ్లీ మళ్లీ ఇలాటి నాటకాలాడండి" అంటూ డబ్బులు విరాళంగా ఇచ్చారు. మాధవ్ వారిని విస్మితుడై చూస్తూంటే-

"బాబూ! ఇదిగో, మా వాళ్లంతా చూశారు" అంటూ అతనివద్దకు వొచ్చిందామె.

అతను త్రుళ్లిపడిచూశాడు "కౌసల్యా"

"మీ ఫొటోలు..." కవరందించిందామె.

"నాటకం బాగుందా? "

"ఆఁ" వెళ్లిపోయిందామె.

నటీనటులకీ సాంకేతికులకీ ఛాయాచిత్రాలు తీయించి అన్నీ సర్దించి మాధవ్ బసకి చేరేసరికి వంటిగంట. కౌసల్య తిరిగి ఇచ్చిన కవరు తెరిచి చూశాడు. ఫొటోలలో అన్నీ ఉన్నాయి. ఆమె ఉన్నది తప్ప. అతనానందించాడు.

కావాలనే కాసులమ్మ ఆ వొక్కటి ఉంచేసుకుంది. ఆ బొమ్మలో తానుంది. రంగు రంగులలో చూస్తుంటే తమాషాగా ఉంది తాను తనకే. అందుకే ప్రలోభపడి దానినొక్కదాన్నీ అట్టే పెట్టేసుకుంది. బొట్టుపెట్టెలో భద్రపరచుకుంది. నాటకం చూసొచ్చాక ఆ ఫొటో ఓసారి చూసుకుందామనిపించిందామెకి. కాని సరిగ్గా అదే క్షణంలో కల్లువాసనేసుకుంటూ తూగుకుంటూ వొచ్చాడు గరటయ్య.

"నువ్వు నాటకానికి రాలేదా? "

"ఎదవ ప్రశ్న వెయ్యక కూడెట్టు. నాటకమంట బోడినాటకం. నువ్వేసే నాటకాలు చూస్తూనే ఉన్నాను"

"నేనేటి నాటకాలేస్తన్నాను? నీదంతా వొట్టనుమానం అంతే. నీడనిజూసి నిజవని బ్రెమపడుతున్నావు"

"నోర్మూయ్" అని ఆమె జుత్తందుకున్నాడు.

★ ★ ★

ఆలిండియా రేడియో... విశాఖపట్నం కేంద్ర కార్యాలయం స్టేషన్ డైరక్టరుకి తెలుగు తెలియదని ఆ ఉత్తరాన్ని చీఫ్ ప్రొగ్రామ్ ఎగ్జిక్యూటివ్ ఆంగ్లంలోకి అనువదించి వివరిస్తున్నాడు.

"పూడిమడక బెస్తవాళ్లున్నారు. సముద్ర

తీరం. ప్రజలు మామూలు పరిభాషలో వెనుకబడినవారు. ఆకాశవాణి వారు రాగలిగితే ఇక్కడ కదంబ కార్యక్రమాన్నివ్వగలరు గంగాపుత్రులు. అది వారికి ఉత్సాహం గొలుపుతుంది"

"సరే... మన రికార్డింగ్ ఎక్విప్‌మెంట్ తీసుకుని వెళ్లండి. బెస్తలంటున్నారుగా. వాళ్లలో కొందరిని ఇంటర్వ్యూ చెయ్యండి. పల్లెపదాలు... పడవ పాటలా? అవేవో పాడించి రికార్డ్ చేయండి. ఇంకా అక్కడ బాగుంటాయనిపిస్తే ఇతర కార్యక్రమాలు రికార్డ్ చేసుకురండి. ఎలా బాగుంటుందంటే అలా చెయ్యండి. మీ టూరు శాంక్షన్ చేస్తాను. సముద్ర తీరంలో ఉండే పల్లె... నాకు సరదాయే. కాని... నాకు తెలుగే తెలీదు. వారి భాషసలే అర్థంకాదు. ఆ లేఖ రాసిన మాధవ్‌కి మీ రాక, అంగీకారమూ తెలియజేస్తూ జవాబురాయండి. మీకెలాటి కార్యక్రమాలు కావాలో తెలియజేస్తే వారు తయారయి ఉంటారనుకుంటాను"

"యస్సార్" అంటూ ఉత్తరం రాసేందుకు వెళ్లాడు ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్.

సముద్రతీరం... పల్లెటూరు. జాలారివాళ్లు మంచి చేపలొండి పెడతారేమో. ఇంకా సదుపాయాలు చేస్తారేమో. మందొక్కటీ పట్టుకుని... రాత్రక్కడ మకాం చేస్తే మిగిలిన మజాలు బాగుంటాయేమో. టౌన్ బీచిలకీ పల్లెటూరి బీచిలకీ చాలా తేడా ఉంటుంది.

ఊహలలో తేలిపోతూ- ఉత్తరంరాసి- అతడు మాధవ్ ఎడ్రసూ రాశాడు.

★ ★ ★

"మిస్టర్ మాధవ్! నేను నిన్న సాయంత్రం వచ్చాను. రాత్రే అకౌంట్లు చూశాను. మీకెలా కృతజ్ఞతలు తెలపాలో తెలియడం లేదు. మీరు కంపెనీలో చేరడం వలన మూడు లక్షలు అదనపు లాభం వచ్చింది. దీనికి మీదే కృషి. సీజనయిపోయింది యేటకి. ఎండలోవేడి తగ్గిపోయింది కనుక ఉప్పు పంట సరిగారాదు. త్వరలోనే వర్షాకాలం ప్రారంభమౌతుంది"

"నాగభూషణంగారూ! మీరు నాకు దయతో మంచి అభినందనలిచ్చారు. కానీ మీ లాభాలు పెరగడానికి ముఖ్య కారణం ధర్మారావుగారూ ఇతర పనివారు. నేను కేవలం పర్యవేక్షణే చేశానంతే. అదీ రోజూ రెండు మూడు గంటలు. అంతే. ధర్మారావ్ గారెంతో మారిపోయారు" అంటూ ఆయన వేపు చూశాడు మాధవ్.

"ఔను చిన్నవాడయినా మాధవ్‌కి చేతులెత్తి నమస్కరించాలి. అవినీతికి పాల్పడి సంపాదించే రోజుల్లో నిత్యమూ భయమే... ఎప్పుడు పాపం బద్దలయి ఉన్న ఉద్యోగం ఊడిపోతుందో అని. కాని మాధవ్‌గారొచ్చి నా లంచగొండితనాన్ని హెచ్చరించి భయపెట్టేసరికి విధిలేక నీతిగా ఉండడం ప్రారంభించాను. ఐతే కొన్ని రోజులకే నీతిగా ఉద్యోగం చేయడంలోని లాభం కనిపించసాగింది. మనసులో నిశ్చింతా, నిర్భీతి. నా ఉద్యోగం పోదు, నేనవినీతికి పాల్పడడం లేదుకనుక. నా గురించి ఎవరూ చెడ్డగా చెప్పలేరు. నిరూపించలేరు. ఈ ధైర్యంవల్ల ప్రాణానికి హాయిగా ఉండడం మొదలుపెట్టింది" అన్నాడు ధర్మారావ్ తల ఎత్తుకునే.

"గుడ్! చూడండి. నేనొక ప్రతిపాదన చేయదలుచుకున్నాను. నేనీ సాల్టు బిజినెస్ కేవలమూ ధనార్జన కోసంకాక ఊరికే ఉండలేక కూడా చేస్తున్నాను. నాకు మావూళ్లో రెండు చేపల చెరువులున్నాయి. ఆ గట్ల వెంట కొబ్బరి చెట్లున్నాయి. ఆ లాభాలు చాలా ఎక్కువే. ఇక్కడీయేడు అదనంగా రెండు లక్షల లాభం వచ్చింది నాకు. వర్కర్స్ పార్టిసిపేషనిన్ మానేజ్‌మెంటులో నేకాక వర్కర్స్ షేరింగ్ ప్రాఫిట్ విత్ మానేజ్‌మెంట్‌లోనూ చాలా విశ్వాసం మిస్టర్ మాధవ్! నా లాభంలో ఒక లక్ష మేరకు వర్కర్స్‌కి పంచదలుచుకున్నాను. అది ఎలా ఐతే బాగుంటుందో సలహా ఇవ్వండి. ఇక్క

డంతా మీకు తెలుసుకనుక"

"నేనా! సరే నా ఆలోచన బాగుంటే అమలు జరపండి. ధర్మారావ్‌గారికి పాతిక వేలు. మిగిలినది పనివారికి. ధర్మారావ్ గారాడపిల్లల తండ్రి. కుటుంబభారం అధికం"

"సరే, ఆయనకి పాతిక వేలు. మీకు పాతిక, మిగిలినది పనివారికి పంచండి"

"నాకు పాతిక వేలా! ఉహూ, నాకా అర్హత లేదు. నేనంత పనేం చేశానని?

నాగభూషణంగారూ! ఎక్కువ పనిచేయించుకుని తక్కువ కూలి ఇవ్వడం మేనేజ్‌మెంట్ అన్యాయం చేయడమయితే, తక్కువ పని చేసి ఎక్కువ ప్రతిఫలం పొందడం పనివారు యాజమాన్యాన్నన్యాయం చేయడమౌతుంది. నేనా అన్యాయం చేయలేను"

"చూడండి మాధవ్! నేను మీకిస్తున్నది బహుమతి. మీ పనికి కాదు నీతికీ నిజాయితీకీ. మీవలన ధర్మారావ్‌గారే మారారు"

"ఆయన నెల జీతం పెంచండి, వారెలాగూ పన్నెండు నెలలూ కంపెనీ ఉద్యోగే కనుక"

"అలాగే. అది వేరే అకౌంటు కదా. మాధవ్! సేఫ్‌లోంచి ఏభైవేలు తియ్యండి"

పాతికవేలు అతనికిచ్చాడు నాగభూషణం. మరో పాతిక వేలు తనచేత ధర్మారావుకిప్పించి, "మిగిలిన యాభైవేల పంపకమూ రేపు చెయ్యండి. నేను రేపుదయమే వెళ్ళిపోతాను. మాధవ్! ఒచ్చే సీజనుకి కూడా మీరు కంపెనీలో పనిచేయాలి సుమండీ!" అన్నాడు ముందరి కాళ్లకి బంధమేస్తున్నట్లు. మాధవ్ నవ్వేశాడు.

"పదండి. ఈ సాయంత్రం నాకు సముద్రతీరంలో తిరగాలనుంది" అంటూ మాధవ్‌ని మోటార్ సైకిలెక్కించుకున్నాడు నాగభూషణం.

"మీ గురించి చాలా వింటున్నాను"

"ఏమిటీ? "

"మీరు జాలర్లకు చదువు నేర్పుతున్నారట! ఆటలు, పాటలు, నాటకాలు, రేడియో ప్రోగ్రాములు"

"నాకు పనేమీలేదుగా! కాలక్షేపంగా" నవ్వేశాడు మాధవ్ తేలికగా.

"తీరికని ప్రజాసేవకుపయోగించే వారెందరీ స్వార్ధంనిండిన ఈ ప్రపంచంలో? అన్నట్లు ఆకాశవాణి వరకూ పూడిమడకని తీసికెళ్ళిన మీరు దూరదర్శన్ నెందుకు వొదిలేశారు? "

"నేను వొదిలెయ్యలేదు. నా ఉత్తరాన్ని వారే వొదిలేసినట్లున్నారు" అతనికి చాలారోజుల కిందట తను రాసిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది.

"దూరదర్శన్ కేంద్రం... హైదరాబాద్.

పూడిమడక ప్రజలతరపున అభివందనములు.

విశాఖజిల్లా అనకాపల్లికి దక్షిణంగా ఇరవయ్యయిదు కిలోమీటర్ల దూరంలో బంగాళఖాతం ఒడ్డున పూడిమడక గ్రామం. ప్రధానంగా ఇది గంగాపుత్రుల ఆవాసం. ఇక్కడ సముద్రతీరమూ, ప్రకృతి సౌందర్యమూ అద్భుతమైనవే. ఇక్కడ తీరంలో జాలరులున్నారు. చేపలు పట్టడం, పడవల తయారీ, వలల బాగు, వీరి వృత్తులు. వీరి జీవనవిధానంలో సముద్రం మీద చేపలు పట్టడం ప్రముఖమయినది. కాగా- వీరి వేషభాషలూ, ఆచారాలూ, సంప్రదాయాలూ విభిన్నమయినవీ, విలక్షణమయినవీ. మిగిలిన ప్రజలకి వీరి జీవనవిధానం కుతూహలం కలిగించడమేకాక కొన్ని ప్రాథమిక సత్యాల పట్ల కనువిప్పు కలిగించగలదని నా నమ్మకం. కనుక మీ అధికారులీ ప్రాంతాన్ని సందర్శించి, ఈ గంగాపుత్రుల జీవనసరళిని మిగిలినవారికి పరిచయం చేయగలరు. దీనివలన పరోక్షంగా మరొక ప్రయోజనమూ సమకూరగలదు. ఇప్పుడిప్పుడు విద్యపట్ల ఆకర్షితులై చదువు నేర్చుకుంటూ సాంస్కృతిక కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొంటున్న గ్రామాన్నీ,

గంగనీ, తమ దూరదర్శన్ ప్రసారం చేయ గలిగితే ఈ అల్పసంతోషులందలమెక్కి నంత ఆనందమే పొందుతారు. మీకూ ఓ చక్కని కార్యక్రమం అందించగలిగామన్న తృప్తి. కనుక సాధ్యమయినంత త్వరలో తమ నిర్ణయం తెలియజేయగలరు" అంటూ రాశాడు. కానీ ఇంతవరకూ ఆ అధికారుల నుంచి ఏవిధమయిన సమాధానమూ లేదు దురదృష్టవశాత్తూ.

"నమస్కారం"

ఆ పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాడు మాధవ్. సరస్వతి నాగభూషణానికి కూడా నమస్కరించింది. మిగిలిన పిల్లలామెననుస రించారు.

"ఈ పాప? "

"గంగపుత్రికే"

"నిజంగా? ఎక్కడిదీ సంస్కారమింత చిన్న పిల్లలకి? "

"సంస్కృతమూ, విద్యా అభ్యసించడంవల్ల సంతరించుకున్నది"

వాళ్లు మాధవ్ కోరగా పాటలుపాడీ, శ్లోకాలు చదివీ, నాట్యాలు చేసీ తమ విద్యలు ప్రదర్శించారు. తన బహుమతంటూ వారం దరి చేతులలోనూ పదిరూపాయలనోట్లు పెట్టాడు నాగభూషణం. మీదగ్గరుంచం డంటూ మాస్టారికే యిచ్చేశారు వాళ్లు.

తీరంలో వివిధ క్రీడలలో యువకులు, చదువుకుంటున్న మరికొందరు ఉన్నారు. అందరినీ ఆశ్చర్యంగా చూస్తూనే నాగభూ షణం మాధవ్‌తో తుపాను రక్షణకేంద్రం చేరాడు. అక్కడ కొందరాడుతూంటే మరి కొందరు లెక్కలూ, చదువూ.

"మీ బసెక్కడ? "

"ఇదే... ఈ వరండా చాలదూ నా వంట రివాడికి? " నవ్వేశాడు మాధవ్.

ఒక్కనిముషం ఆలోచించి "మాధవ్! మీరు మంచి ఇల్లు కట్టించుకోండి. నేను సాయంచేస్తాను. మీరిక్కడే శాశ్వతంగా ఉండిపోతానన్నారుగా"

"ఆ మాట నిజమే కానీ నాకు ఇల్లెందుకూ? "

"పోనీ ఓ పని చేయండి. మీకు ఇల్లని కాకపోతే, వీళ్ల చదువులకీ, ఆటలకీ, సంగీత నృత్యాభ్యాసాలకీ అనుగుణంగా ఉండేలా ఒక భవనంలాటిది కట్టించి, దానిలో మీరో గది వేసుకోండి. ఏ సముద్రపు నీటినుంచి నేను ప్రతి యేడూ లక్షలు సంపాదిస్తు న్నానో ఆ సముద్రాన్ని నమ్ముకుని రెక్కలు ముక్కలుచేసుకునేవారికి నా సంపాదనలో కొంతవరకూ సద్వినియోగపరచడం నా ధర్మం. మన కంపెనీలో కూలిపనికి వచ్చేవారిక్కడివారే కదా? అలాగకూడా రుణపడి ఉన్నాను వారికి"

"అవసరమూ, తగిన సమయమూ వస్తే అలాగే మీ సహకారం అర్థిస్తాను"

"కంపెనీ అకౌంటులో డ్రా చెయ్యండి. ఇదిగో బ్లాంక్ చెక్" అంటూ మాధవ్ కాదం టున్నా వినకుండా చెక్కు సంతకం చేసి యిచ్చేశాడు. ఇద్దరూ మళ్లీ బయలుదేరారు.

"అది... కల్లుపాక కాదూ? "

"ఔను"

"అంత పలచగా ఉందేం? ఆర్నెలక్రితం ఇటొచ్చినప్పుడిది కిటకిటలాడేది. వీళ్లలో ఎక్కువమంది చుట్టలు కాల్చేవారు. ఇప్పుడు చాలా మార్పు" ఆశ్చర్యపోయాడు నాగభూ షణం నమ్మలేనట్లే. మాధవ్ మౌనంగా నవ్వాడు.

"అఖండులే మీరు! ఇంత వేగంగా వీరిలో ఇలాటి మార్పు. ముఖ్యంగా కల్లుకీ వీళ్లకీ చాలా గట్టిలంకె. ఆ అలవాటు మానిపించ డానికి చాలా కష్టపడుండాలే!"

"వాళ్లే కష్టపడ్డారు. నేను పడినదేమీలేదు"

"మీది మరీ వినయం! మీ గొప్పతనాన్నే మాత్రమూ అంగీకరించరు"

"ఉంటేగా? "

ఇద్దరూ సెంటరు చేరారు. "విశేషాలుంటే ఉత్తరం రాయండి. ఉంటానేం? " అంటూ మోటార్‌సైకిలు తీసుకుని వెళ్ళిపోయాడు

నాగభూషణం.

ఎదురుగా సముద్రం ఉంది. పైన వెన్నె లొచ్చేసింది చక్కగా. అతను సముద్రంలోకి దిగాడు చేతులుచాచి. సముద్రం అతన్ని కెరటాలతో కౌగలించుకుంటూ అతని ఆనం దాన్ని పంచుకోసాగింది.

వెన్నెల్లో సముద్రంలో మాధవ్ ఒళ్లు మర చిపోతున్నాడు. అంతలో వాన కూడా వచ్చేసిందెవరో బొట్టుపెట్టి పిలిచినట్లే.

ఎండా, వానకంటే అరుదు వెన్నెలా వానా. అలాటి అపురూపమే లభిస్తోంది ప్పుడు మాధవ్‌కి. వెన్నెల్లో సముద్రం బాగుంటుంది.

వెన్నెల్లో వాన యింకా బాగుంటుంది.

వెన్నెల్లో సముద్రం మీద వాన వర్ణనాతీ తమే.

సముద్రమే సౌంద ర్యకాణాచి. వెన్నెలే వెయ్యి అందాలు. వాన దొక విలక్షణ సౌందర్యం. మూడూ ఏక మయిన ముచ్చట ముగ్ధమనో హరమే. తిలకిస్తూ వివశుడే అయ్యాడు.

ఎంతసేపని ఆ వరం? పది నిముషాలు. అదే చాలు జీవితమంతా ఆ అనుభూతిని హృదయంలో పదిలంగా దాచుకుందుకు.

మర్నాడు ఉదయం సూర్యుడు ఉదయిం చకపోలేదు కానీ ఆకాశం మాత్రం స్వల్పంగా మబ్బులు పట్టే ఉంది. కానీ దానిని గంగా పుత్రులు లెక్కచెయ్యలేదు. ఆ చిన్నచిన్న మబ్బులని లెక్కజేస్తే ఆవేళకి వారికి డొక్కా డదు మరి.

ప్రభాతసమయానికి ఆకాశం మబ్బుగా ఉన్నా సముద్రతీరం యధావిధిగా సందడి గానే ఉంది వేటకి సమాయత్తమౌతున్న గంగాపుత్రులతో. దూరంనుంచి హనుమాన్ చాలీసా వినవస్తోంది.



"మబ్బేసిందిరో!"

"ఏస్తే ఎయ్యనీ"

"హొర్షంరాదు కదా? "

"వాతావరణ సూచనలో రేడియో చెప్ప లేదు. అయినా యేటకి పోతుంటే యిలాటి మబ్బులూ, హొర్షమూ మామూలే. పదండి పదండి"

"గుడిసెలో కూకుంటే బాగానే ఉంటది గువ్వపిట్టలా. కానీ కూడో? ఈపాటి మబ్బుకే బెదిరిపోతే మనమేపాటి గంగాపుత్రులం? గంగమ్మే కాసుకుంటది తన బిడ్డల్ని, బయల్దేరండి" వారందరి మాటలనూ వింటున్న మాధవ్‌కి సంతో షంగా ఉంది. ఆ యాస అతనికి హాయిగా ఉంది. నిజా నికిప్పుడు వీరిలో చాలా మంది చక్కని భాష మాట్లాడగలవారే, చదువొ స్తున్నవారే. కానీ తానే ముందుగా వారినుంచి ఓ మాట తీసుకు న్నాడు.

"మీరింతవరకూ మాట్లాడుతున్నది భాష కాక బాసా, యాసా అనే అనిపించవచ్చు కానీ అది అల్పమయినదో, గౌరవహీనమయి నదో మాత్రం కాదు. నాగరకులెలా భావిం చినా వారి కర్థమయ్యేందుకయితేనేం, వారి చేత గౌరవించబడడానికైతేనేం, మరెందుక యితేనేం, మీరు భాష నేర్చుకోబోతున్నారు. అంతమాత్రాన మీరు మీ యాసనీ, భాషనీ వదిలెయ్యడానికీ, మరచిపోడానికీ వీల్లేదు. అది ద్రోహమే ఔతుంది. మీలో మీరు మీ యాసనే మాట్లాడుకోవాలి. పైవారిముందు మాత్రమే భాష, ఏం? "

"మీరు సెప్పారు కనకలాగనే. ఏటో, మా

యాస కూడా బాసే అంటారు!"

"ఆ తీపి మీకు తెలియదు అలవాటుపడి పోవడాన" నవ్వేశాడు తను.

ఇప్పుడు వీళ్లు చక్కని భాష మాట్లాడగలి గినా, తన మాటమీద గౌరవంకొద్దీ వారిలో వారు వారి యాసే మాట్లాడుకుంటున్నారు.

వాళ్లు వేటకెళ్ళిపోయారు.

చెట్ల ఆకులమీద ఒకదానినుంచి మరో ఆకుకి తెల్లరెక్కల సీతాకోక చిలకలెగురుతు న్నట్లుగా నీటిలోకి దూసుకుపోతున్న తెర చాప పడవలు!

అతనికి గుర్తొచ్చింది. 'ఇవాళ తను బ్యాంకు కెళ్ళి డబ్బు దాచాలి. అందుకు అచ్యుతాపురం వెళ్లాలి. అక్కడయితే స్టేట్ బ్యాంకుంది'

అతను తన అనుష్టానాలను ముగించు కుని సెంటరుకి బయలుదేరాడు సంచిలో డబ్బు పట్టుకుని. బస్ వెంటనే వచ్చింది. అతను వెళ్లేసరికి బ్యాంకు యింకా తెరవ లేదు. ఎదురుచూస్తున్నవారిలో ఓ యువ కుడు, అతని చేతిలో అచ్చు కాగితాల బొత్తి. మాధవ్‌ని చూస్తూనే అతను రెండు కాగితా లిచ్చాడు. అవి కరపత్రాలు. ఒకటి అనకా పల్లి విశ్వహిందూపరిషత్ ఆధ్వర్యంలో బాల బాలికలకు జరపబోతున్న భగవద్గీతాశ్లోక పఠన పోటీ. గీతాజ్ఞాన సమాజంవారూ, విశ్వహిందూపరిషత్‌లు సంయుక్తంగా ఏర్ప రచుతున్న పోటీ అది.

రెండవది- క్రీడాపోటీలకు సంబంధించి నది. జిల్లాస్థాయిలో పరుగు, కబాడీవంటి గ్రామీణ క్రీడలలో అనకాపల్లి క్రీడాసంఘం పోటీ పెడుతోంది.

"దయచేసి నాకు మరికొన్ని యివ్వగ లరా? "

"దేనికీ? మీదేవూరు? "

"పూడిమడక"

"అయితే మీరే అక్కడ పంచండి. నేను మరి రాను" అంటూ ఏడేసి కాగితాలందిం చాడు.

"అలాగే" అంటూ అందుకున్నాడు మాధవ్.

"థాంక్స్. ఓ బోరు ప్రయాణం తప్పిం చారు నాకు దేముడిలావచ్చి"

"మీరు దేవదూతలా వొచ్చి నాకో చక్కని అవకాశం చూపారు" నవ్వాడు మాధవ్. ఇరవైవేలు ఫిక్సెడ్ (టరమ్) డిపాజిట్ గానూ, ఐదువేలు సేవింగ్స్ బ్యాంక్ అకౌం టులోనూ వేసి, అతను తిరిగి పూడిమడక చేరుకునేసరికి అక్కడి వాతావరణం అతివిచి త్రంగా, అనూహ్యంగా మారిపోయింది.

భోరున వాన, ఉండీ ఉండీ ఉరుములు, మెరుపులు, పిడుగులు. బస్ దిగి అప్పారావ్ పాకలోకి వెళ్లేలోగానే తడిసి ముద్దయిపో యాడు మాధవ్.

"ఇదేమిటీ? నేను బయలుదేరేసరికి బాగానే ఉందే! ఇంతకింతలో"

"సముద్రపొడ్డున అంతే బాబూ. ఏక్ష ణంలో ఏమొస్తుందో చెప్పలేం"

హోరున గాలి, భోరున వర్షం, ఉరు ములు, మెరుపులు, పిడుగులు. ప్రకృతి తన కోపం ప్రదర్శిస్తున్నట్లుంది. వాతావరణం భీభత్సంగా ఉంది. అదెంతసేపు? మహా అయితే పావుగంటపైన ఓ నిముషమో, రెండు నిముషాలో. అంతే... ఆశ్చర్యకరంగా మళ్లీ మారిపోయింది వాతావరణం. ఆకాశం నిర్మేఘమై నీలంగా ఉంది. సూర్యుడు ప్రకా శిస్తూ వచ్చేశాడు! ప్రకృతీ, వాతావరణమూ ప్రశాంతమైపోయాయి! సాధ్యమేనా యిది? సంభవమేనా? సముద్రపొడ్డున ఏ క్షణంలో ఏమొస్తుందో ఎవరికెరుక? అప్పారావ్ చెప్పినదక్షరసత్యమే. నిదర్శనం ఎదురుగా కనపడుతూనే ఉంది కదా?

"మీరు వేడివేడిగా భోంచేసెయ్యండి బాబూ! ఎప్పుడూ మీరిలా వేళకి దొరకరు"

"సరే... కానియ్. ఓ పనయిపోతుంది" అంటూ కూర్చున్నాడు.

భోజనం మధ్యలో హటాత్తుగా, ఉరుమూ మెరుపూ లేకుండానే ఫెళఫెళార్భాటంతో

పిడుగు! త్రుళ్ళిపడ్డాడు మాధవ్.

"అర్జునః ఫల్గుణః కిరీటీ శాతవాహనః" చదివాడు అప్పారావ్. అతనీమధ్యనే శ్లోకాలు నేరుస్తున్నాడు. "ఈ పిడుగులు జాలర్ల పాలిట గండాలే. ఇలాటి వర్షంలో గంగమీదుంటే చేపలు పడడం మాటటుంచి'

వాక్యం పూర్తిచెయ్యలేదతను. మాధవ్ అర్ధాంతరంగానే భోజనం ముగించి, చెయ్యి కడిగేసుకుని తీరానికి బయలుదేరాడు. మామూలుగానే బాగుండని ఆ రోడ్డు వర్షానికి మరీ అసహ్యంగా తయారయింది. అతను సముద్రపొడ్డుకి వచ్చేసరికి అక్కడ తానెన్నడూ చూడని దృశ్యం.

చాలామంది ఆడవాళ్లక్కడ చేరారు. కొందరు శోకాలు తీస్తుంటే మరికొందరు "గంగమ్మ తల్లీ! నాపెనిమిటి చేమంగా వొస్తే" అంటూ కొందరు గంగకీ, గ్రామదేవతకీ మొక్కులు మొక్కుతున్నారు. అందరి ముఖాలలోనూ ఆందోళనా, భయమూ. ఏమీ అర్థంకాకపోయినా ఎందుకో ఏడిచేస్తున్నారు పిల్లలు. అందరి కళ్లూ సముద్రంమీదే ఉన్నాయి. చూడగలిగినంత దూరమూ చూస్తున్నారు వాళ్లు.

సాధారణంగా సముద్రపొడ్డుకి రాని స్త్రీలు అప్పుడెందుకొచ్చారో అర్ధమయింది మాధవ్‌కి. వాళ్ల పరిస్థితికి జాలేసింది. కానీ తనేం చేయగలడు?

"మామూలుగా అయితే ఈ పాటికొచ్చేసే వాళ్లే. గాలీ, వొర్షమూ పిడుగులూ, ఏటయ్యారో ఏమో" దిగులు వెలిబుచ్చుతోందొకామె.

బెస్తలు తెప్పలమీద గంగమీదకి బయలుదేరేటప్పటికి వాతావరణం కొంచెం మబ్బులు మినహా బాగానే ఉంది. మామూలుగానే ఉంది. రాత్రి వర్షంపడినా అదేమంత? రెండుమూడు చిరుజల్లులు. ప్రథమకోపంలా అప్పటికప్పుడే తేలిపోయింది వాన. అలాగే ఈ మబ్బులూ మహా అయితే ఓ జల్లో రెండు జల్లులో రాల్చిపోతాయనుకున్నారు గంగాపుత్రులు. వాళ్లు నీటిమధ్యకు చేరేవరకూ గుంభనంగా ఉన్న ప్రకృతి ఒక్కసారి గర్జించింది. నల్లమబ్బులు, నీటిమబ్బులు ఏనుగుల గుంపులా పరుగెత్తుకొచ్చాయి. కారుమబ్బులు కమ్మేసి పట్టపగలే చిట్టచీకట్లా వరించాయి. జల్లులుగా ప్రారంభమై ధారలుగా వర్షం. ఆకాశంలో ఉండీ ఉండీ మెరుపులు కంటితూట్లు పొడిచేలా. వెనువెంటనే ఉరుములు, ఆపైన పిడుగులు, అంధకారమూ, అయోమయమూ. అల్లల్లాడిపోయారమాయకపు జాలర్లు. గాలులు తెప్పని ఊపేస్తూ ముప్పుతిప్పలు పెట్టేస్తుంటే తెరచాపలు చిరిగిపోకమునుపే దింపేద్దామంటే వెర్రిగాలి వ్యవధిస్తేనా? తెరచాపలు దించేసిన తెప్ప గాలికీ, కెరటాలకీ ఎటుపోతే అటు పోడమే. అల్లకల్లోల తరంగాలతో తుళ్ళిపడేస్తున్న సముద్రమంటే చేపలకీ భయమేనేమో. బయటకు రాక అడుగడుగునే వొదిగిపోయాయి. అయినా జాలర్ల యాతన చేపలను పట్టుకోవాలని కాదు. తాము మృత్యువుకి చిక్కకుండా బయటపడాలని. గాలాలూ, గొలుసులూ, వలలూ, వలతాళ్లూ తెప్పలోకి లాగేసి సర్దేశారు. సందుచిక్కితే ఒడ్డున పడిపోవాలి. చీకటిలో తెప్పని కెరటాలూ, గాలీ ఎటుకొట్టేస్తున్నాయో! వర్షం దబదబ బాదేస్తోంది. మెరపులు కళ్లు చీకట్లు కమ్మిస్తున్నాయి. ఉరుములు గుండెలదరగొడుతున్నాయి. పిడుగులు, ఒకటా రెండా, ఎన్నో ఎక్కడో ధగ్గరలోనే పడుతూ భయకంపితులని చేస్తున్నాయి. తమ నెత్తిమీదే పడదుకదా ఏ పిడుగో?

భయం, ఆందోళన, ఆరాటం, గుండెలుగ్గబట్టుకుని, బిక్కచచ్చి, చేసేందుకేమీ తోచక చేతులెత్తి పైన ఆకాశానికి వేడుకోళ్లూ, మొక్కులూ.

"ఒరేయ్, రాములూ, ఇటొచ్చీ.. యిటు"

"ఇదో, వొస్తున్నా" కళ్లమీద పడుతున్న వర్షపుధారలొకచేత తుడుచుకుంటూ, కష్టంమీద తెడ్డేస్తూ, గాలికీ, కెరటానికీ ఎదురీదుతూ

సోములు తన తెప్పని రాములువేపుకీ, రాములు సోములువేపుకీ, కలసి ఉంటే కలదు ధైర్యమని, మనిషికి మనిషీ, మనసుకి మనసూ, మాటకి మాటా తోడనీ, ఒకరినొకరు చేరబోతుంటే పిడుగు! అగ్గిపిడుగు! రెండు తెప్పలకీ మధ్య పదిగజాలదూరమైనా లేదు. కానీ ఆ పిడుగుపాటుకొక తెప్ప అంతరించిపోయింది! ఇంకా చిత్రంగా ఆ తెప్పలోని ఇద్దరిలోనూ ఒకడు సజీవంగానే మిగిలాడు!

తనకి తృప్తయిందన్నట్లు వర్షం వెలిసింది, గాలీ ఆగింది, సముద్రం శాంతించింది, కెరటాలు నిమ్మళించాయి. వెలుగొచ్చింది. సూరీడు తొంగిచూడ్డం మొదలెట్టాడు. ఆకాశం మామూలయింది. అంతా కనిపిస్తోంది. అప్పుడు బతుకుజీవుడా అనుకుంటూ తెప్పలు ఒడ్డువేపుకి పయనించసాగాయి. ఒకటీ ఒకటీ ఒడ్డెక్కసాగాయి.

"సోముల్ని గంగ బలితీసుకుంది. నా నేస్తాన్ని పిడుగు పొట్టనెట్టుకుంది" గొల్లుగొల్లున గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడు రాములు. "ఆడూ లేడు. ఆడి తెప్పా లేదు. గంగలో కలిసిపోయారు. నానేస్తాన్నట్టుకు పోయాయి నీళ్లు" అతని దుఃఖానికంతు లేదు. గుండెలు బాదుకుంటూ, దొర్లుతూ ఏడుస్తున్నాడు.

సోముల ఆడది జరిగింది వింటూనే స్పృహతప్పి పడిపోయింది. తండ్రితో తెప్ప మీద వేటకెళ్లి తండ్రీ, తెప్పా లేకుండా ఒంటరిగా తిరిగి రావడంలోని విధివైపరీత్యాన్నీ, విచిత్రాన్నీ నమ్మలేనట్లు నోరు పెగలక, బిత్తర చూపులతో బొమ్మలా మిగిలిపోయాడు సోముల ఏకైక సంతానం భీముడు.

పిలగోడు ఓదార్చుతున్నాడు "బతుకులింతే. నీటి బుడగలు ఏచ్చనంలో పగిలిపోతాయో! ఇంకా నయం. సోములు పోయినా భీముడు మిగిలాడు. తెప్పపోయినా బతుకు మిగిలింది. పెద్దోడు పోయి సిన్నోడు, తండ్రి పోయి కొడుకు మిగలడం ఓ యిదంగా గుడ్డిలో మెల్లే. ఇశారించకండి. ఏడిచేటి నాబం? శవం కూడా దొరక్కపోడం శానా ప్రారబ్ధమే. కానేటి సెయ్యగలం? ఎంతేడిస్తే మాత్రం పోయినోడు మరలొస్తాడా? సోములు పోయాడని బాధపడక, ఆడి కొడుకు భీముడు మిగిలాడని సంతోసిద్దాం. గంగమీద తుపాన్లకి దారితప్పి దిక్కులేని సావులూ, పిడుగులడి ప్రేణాలు పోడమూ తక్కువే అయినా అప్పుడూ అప్పుడూ తప్పనివే మన పీకలకి. గంగమ్మ బలితీసుకుందని సరిపెట్టుకొండి"

సోములు తనకెంతో పరిచితుడు. ఇలా మరణించాడా! పిడుగుపడి! సముద్రం, గంగాపుత్రులకి తిండిపెట్టే సముద్రమే వాళ్ల బతుకులనీ యిలా తినేస్తుందా! సాగర సంగీతంలో జీవనరాగాలే కాక శివరంజనులూ ఆలపిస్తుందా! నేలమీద 'పాపాత్ముడు పాముకాటుకి చస్తాడట' అన్నట్లే గంగాపుత్రులు 'పాపాత్ములు పిడుగు పాటుకి చచ్చిపోతారా?' కానీ, సోములేమీ పాపాత్ముడు కాడు. చాలామంచివాడు. చుట్ట, కల్లు, వ్యసనాలను కూడా వీడినవాడు. మరెందుకిలా మరణించాడు? అనాయాస మరణం, వినా దైన్యేన జీవనం. మంచివానికి మరణమే సాక్షి. ఓహో! మంచివాడు కావడంవల్లనే యిలా మరణించాడేమో!

కళ్లు తుడుచుకున్నాడు మాధవ్.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. పోయినవారి గురించి విచారించడం కాదు, ఉన్నవారి గురించి ఆలోచించు.

రైతు కూలీలకేదో భీమా పథకం ఉందని చదివాడు తను. రైతుకూలి కుటుంబ యజమాని అయి అరవయ్యేళ్లలోపున ఏకారణంగా మరణించినా ప్రభుత్వమో, జీవితభీమాసంస్థో ఆ మృతుడి కుటుంబానికి వెయ్యి రూపాయలిచ్చి సాయంచేస్తారుట, మృతుడి వార్షికాదాయం ఒక పరిమితికి లోబడి ఉంటే.

ఆ సదుపాయం సోముల కుటుంబానికీ అందుతుందా? మండల్ ఆఫీసర్‌ని కలుసు

కుని అడగాలి. చేపలు పట్టడం- వ్యవసాయం కాదనీ, బెస్త- రైతు కాదనీ అంటే.. అతన్ని సంతృప్తి పరిచే సమాధానం తను సిద్ధంచేసి ఉంచుకోవాలి ముందుగానే.

సాయంత్రం రాములు వొచ్చాడు ఏడుస్తూ.

"ఏడవకురాములూ. సోములులాటి స్నేహితుడ్ని కోల్పోడం చాలా దురదృష్టకరమే. కాని ఏం చేయగలం? విధివిలాసం అలా ఉంది. మనం నిమిత్తమాత్రులం" అన్నాడు మాధవ్ సానుభూతిగా.

"అది కాదు బాబూ. ఆడు నా కళ్లెదుటే..."

"ఘోరమే రాములూ చూడు...మనం ఆలోచించవలసింది అతని కుటుంబం గురించి. సోములు పోయాడు. అతని పడవాపోయింది. ఒకటి హార్దికంగానూ రెండోది ఆర్థికంగానూ ఆ కుటుంబానికి పెద్దదెబ్బలే. ఆర్థిక నష్టానికి మనం ప్రత్యామ్నాయం చూడాలి. ఇలాటి సందర్భాలలో ప్రభుత్వంనుంచి సహాయం అందే అవకాశముందని ఈ దరఖాస్తు రాశాను. సోములు భార్య విచారం నుంచి కొంచెం తెరిపిన పడ్డాక ఈ కాగితం మీద వేలిముద్ర వేయించు. ఈలోగా నేను మరణ పత్రం గురించి చూస్తాను. ఒక వెయ్యి రూపాయిలందొచ్చు వారికి"

"డబ్బుదేముంది బాబూ? అది కాదు నా బాధ"

"మరి దేని గురించి? " ఆశ్చర్యంగా అడిగాడు.

"నా కళ్లెదుటే ఆడలా చచ్చిపోయాడు. నేను చూస్తుండగానే"

"ఎవరు మాత్రం ఏం చేయగలరా పరిస్థితులలో? "

"నేనతగాడి కెవరిలాటోడినో కాను బాబూ! నేస్తాన్ని. అందుకే బాబూ ఈ ఘోష"

అంటూ భోరుమని ఏడిచేశాడు రాములో కృసారిగా.

"నా కంఠంలో ఊపిరుండగా నానేస్తం కొడుక్కికాని కుటుంబానిక్కాని ఏలోటూ రానివ్వను. నాపడవే ఆళ్లపడవ. నా సంపాదన్లో సగపాలాళ్లది" నివ్వెరపోయాడు మాధవ్ అతని మాటలకీ వాటిలోని నిశ్చయానికీ! దూరంగా సముద్రపు హోరు! ఈసారి దానినిండా స్నేహరాగం! ఈ గంగాపుత్రులలో ఇంతటి నిష్కల్మషత్వం, నిజాయితీ, నైతిక బలాలతో కూడిన స్నేహం! స్వార్థానికతీతమయిన త్యాగం నేస్తంకోసం! అతను చనిపోయినా అతని కుటుంబానికి నేస్తంతాలూకు అండదండలు! ఎంత ఉన్నతమయినది వీరిస్నేహం! ఎన్ని కావ్యాలూ, కవితలూ రాస్తే అందుతుంది వీరి స్నేహమాధుర్యపులోతు.

"నువ్వేదో ద్రోహంచేశానంటావు కానీ నేస్తాన్ని నిలుపుకుందుకు నువ్వేంచేసి ఉండవలసిందని నీ ఉద్దేశం? "

"నాకళ్లెదుట నేస్తం చనిపోతుంటే నేనూ చచ్చిపోవాలతగాడితో. అదే నిజమయిన నేస్తం కట్టడం అంటే"

నిర్ఘాంతపోయాడు మాధవ్. ప్రపంచంలో ఇంత కంటే గొప్పదీ బలమయినదీ అయిన స్నేహం మరెక్కడయినా ఉంటుందా ఉండగలదా? "

★ ★ ★

ఆవేళ మబ్బులూ వర్షాగమన ఛాయలు లేవుకానీ ఎండకూడా తీవ్రంగా లేదు. వేసవి వెళ్లిపోతుంది సుమా అని హెచ్చరిస్తున్నట్లు ఎండలో కాంతి మాత్రమే మిగిలి వేడి తగ్గిపోయింది. సాయంత్రం తమ ఆటలూ చదువుల నెత్తికట్టి అందరూ మాధవ్ చుట్టూ చేరారు.

"వేసవెళ్లిపోతోంది. అంటే వర్షాకాలం దగ్గర పడిందనే" ఆ కంఠంలో దిగులు.

"మంచిదేగా? కాలం చల్లబడుతుంది" అన్నాడు మాధవ్ అమాయకంగా.

"కాలం చల్లబడుతుందికానీ మాలాంటో

ల్లకి కడుపులెండిపోతాయి వర్షాకాలంలో"
"అదేం? "
"వర్షాకాలంలో సముద్రం శాంతంగా ఉండదు. గాలికి కెరటాలు రేగుతాయెక్కు వగా. అలాటి సముద్రంలో చేపవేట పడదు. అదొకబాధ. పిడుగుల భయమొక వేపు. తుఫానొచ్చిందో ఎక్కడికి కొట్టుకుపో తామో ఏమౌతామో అని మరో బెంగ. అంచేత వేటకెళ్లేది తక్కువ. వెళ్లినా పడేవేటా తక్కువా. వర్షానికి తడవడం పెద్దోళ్లకి లాగే పెద్ద సేపలకీ ఇష్టముండదేమో"
"మరెలా? " ఆత్రంగా జాలిగా అడిగాడు.
"దాచుకున్నదుంటే బయటకు తీసి తిన డమే. ఇంకా చిన్నచిన్న చెరువులూ దొరు వులూ ఉంటే దొరికినవి తెచ్చుకుని పూట గడపడమే. మా గంగాపుత్రులకి వేసవే వరం. మిగిలిన కాలాలు శాపమే"
పట్నంలోనూ పేదలిదే మాటనేవారు. వేసవిలో అయితే సమస్యలు తక్కువట వారికి. పనులు దొరికి పస్తులుండవట. చెట్టుకిందో రోడ్డుపక్కో ఎక్కడేనా కునకచ్చు నట. వర్షాకాలంలో పనులు తక్కువా పస్తు లెక్కువా. నడ్డివాల్చేందుకు పొడిజాగాయే ఉండదు. వరద బాధా, బురద బాధానట. చలికాలమయితే ఒంటికే గుడ్డసరిగా ఉండని బతుకులకు కప్పుకుందుకు ఎక్కడినుంచొ స్తాయి?
"నేను మీకేం సాయం చేయగలను సమస్యా పరిష్కారానికి? "
"కల్లు, చుట్ట మానిపించేరు. అందువల్ల మాకు డబ్బులు బాగానే మిగిలాయి. అప్పు లకి దేహీ అని పోవలసిన కర్మాలేదు. ఆపైన వడ్డీలు చెల్లించే అగత్యమూలేదు. మేం మాట్లాడవలసినదదికాదు. ఇప్పటికే మీరు మాకెంతో సాయంచేశారు. సాధిం చారు"
ఉహూ అనుకున్నాడతను మనసులో. నిజంగా తను సాధించదలుచుకున్నది సాధించనేలేదు. కౌసల్య యింకా ఆ రాక్షస పంజరంలో రాత్రులు నరకమే అనుభవి స్తోంది. ఆమె అలా కన్నీరు కార్చేంత కాలమూ తను విజయం సాధించనట్లే.
"వర్షమొచ్చిందంటే వేళాపాళా ఉండదు. మా చదువులకీ ఆటలకీ సముద్రపొడ్డూ తుపాను షెల్టరు వరండా కుదరవు"
"నిజమే, నాకా ఆలోచనే తట్టలేదు"
"మీకెందుకు తట్టాలి? ఆ బాధ్యతమాది. మా చదువు సంధ్యలూ ఆటపాటలూ వర్షా కాలంలో ఆగిపోకుండా ఉండాలంటే పక్కా భవనం ఒకటి కట్టుకోవాలి వెంటనే. వర్షాలు ముదిరేసరికి మన భవనమూ నిల వాలి" దృఢత్వమూ నిశ్చయమూ నిండిన కంఠం.
"నా దగ్గర పాతిక వేలున్నాయి. నాగభూ షణంగారు సహాయం చేస్తామన్నారు"
"ఆగండి స్వామీ! మమ్మల్నిలా అవమానిం చకండి. మేమెంత బాగుపడ్డామో మాకు తెలుసు. ఇంకా బాగుపడాలి. మాకోసమూ మా బాగుకోసమూ మేమేమీ చేసుకోలేకపోతే కద మరొకరి సాయం? ఇంటికో పువ్వూ యీశ్వరుడికోమాలా. మీరు చేసే సాయం చేస్తూనే ఉన్నారు. అది మీరు తప్ప మరొ కరు చెయ్యలేనిది. ఈ చిన్నపనయినా మమ్మల్ని మాకోసం చేసుకోనివ్వండి"
"ఎలా నిర్మిస్తారు భవనం? జాగా, డబ్బు? "
"సముద్ర పొడ్డునే కడతాం. ఇదంతా మా గంగాపుత్రులదే. కూలికంటూ డబ్బు ఖర్చు పెట్టక్కర్లేదు. మా అందరమూ తలోపనీ చేస్తాం. కలపకీ తడుముకోనక్కర్లేదు. తెప్ప తయారీలో మిగిలినది జాగ్రత్తగా వాడతాం. సిమెంటూ ఇనుమూ అదీ పెద్ద ఖరీదు. దానికి మేమంతా డబ్బులేసుకుంటాం"
"ఐతే మీరంతా ముందే సిద్ధమయి ప్రణా ళికతోనే వొచ్చారన్నమాట" మనసులో మహ దానంద భరితుడయ్యాడు మాధవ్. వారు వారినీ వారి అవసరాలనీ శక్తి సామర్థ్యాలనీ గుర్తించుకుంటున్నారు. ఎంతమంచి విషయ

మిది!

"మీరు ఊ అని ముహూర్తం పెట్టడమే తరవాయి"

"ఊ అని అంటాను. ముహూర్తమూ పెడతాను. ఐతే ముందుగా ఒక మనవి. ఇక్కడ చేపలు పట్టడానికి ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ సంబంధించిన గంగాపుత్రులు రెండు శాఖలవారున్నారు"

"ఔను, జాలరులు, వాడబల్జీలు. వాళ్లు జాలారిపాలెం పెద్దూరు, కొండపాలెం కడవీ ధుల్లో ఉన్నారు. ఐతే? "

"క్షమించాలి. ఇంతవరకూ వాళ్లు ఎక్కువగా కలవడంలేదు. మీ సంగతికాదు నేను చెబుతున్నది మిగిలిన వారి గురించి. మనం నిర్మించబోయే భవనం ఏవొక్కశాఖదీ కాదు, ప్రతివొక శాఖదీ. అందరిదీలాగ ఉండాలి"

"ఔను అంతే"

"ఇది మనమనుకుంటే సరిపోదు. కులపెద్దల చేత వొప్పించాలి. చంద్రయ్యా చేత కూడా"

"అదెంతపని? అరగంటలో పిలగోళ్ల నెంటబెట్టుకొచ్చేస్తాం. విషయం ఇవాలే ఇక్కడే తేలిపోవలసిందే" అంటూ నలుగురు పరుగెత్తారు హుషారుగా. అన్నట్లే అరగంటలో పిలగోళ్లను పట్టుకు తీసుకొచ్చారు. వాళ్ల వెనుక చంద్రయ్యా.

"దండాలు సామీ! నమస్కారం స్వామీ"

"నమస్కారాలు, కూర్చోండి. మరేమీలేదు. ఇక్కడ కొంచెం చదువూ ఆటలూ అవీ సాగుతున్నాయికదా"

"కొంచెమేటి సామీ? మా ఖంఠం కూడా రేడియో పెట్టెలో వినిపించారు. మీరు మాకూ మావోళ్లకీ శానా మేలు చేస్తున్నారు"

"నేను చేసేది తక్కువే. ఇప్పుడు వాళ్లకి వాళ్లే ఓ మంచిపనికి ముందుకొచ్చారు. దానికి మీ అంగీకారమూ సహాయమూ అత్యవసరం"

"మీవంటి వారు మాకు పెద్ద పీటేసేస్తున్నారు"

"మీరన్నా మీ పెద్దరికమన్నా నాకు గౌరవం. కోర్టులకి వెళ్లి కాలమూ ధనమూ వ్యయపరచనక్కరలేకుండా తగవులు తీర్చడంలో ఐతేనేం, మంచి మార్గాన చిన్నవారిని నడిపించడంలో ఐతేనేం మీరెంత చక్కని పనులు చేస్తున్నారో! మనిషి చేసే మంచి పనులని బట్టే కదా గౌరవం? "

"మీకంటేనా? ఇప్పుడు కల్లు తగువులూ తక్కువైపోయాయి. చెప్పండి"

"మీరు విశాల హృదయంతో మీ వాళ్లనిక్కడికి చదువు సంధ్యలకీ ఆటపాటలకీ పంపుతున్నారు. అది చాలా ఆనందదాయకం. వర్షాకాలమొస్తోంది. సముద్రపొడ్డునా వరండాలోనూ కార్యకలాపాలు సాగ జాలవనీ, అందుకొక భవనం నిర్మించాలనీ యువకులుత్సాహపడుతున్నారు"

"మంచిదే పన్లోపనిగా దాన్లో ఓ గది కూడా కట్టిస్తే తమరూ ఉండొచ్చు. సరయిన బసలేదుకదా మీకు? "

"దానికేం అదలా ఉంచండి. అలాగ భవన నిర్మాణం మీకందరికీ అంగీకారమేనా? "

"ఓ"

"అది ఎవరికీ చెందదు. కాని అందరదీ మీ అందరిదీ"

"సబబే"

"ఆ భవనానికి మీకులంలోని శాఖా భేదాలంటకూడదు. అక్కడ ప్రతివారికీ హక్కే"

"అలాగే"

"యువకుల ఉత్సాహానికి మీచేతనయిన సహాయం అందిస్తారా మనస్ఫూర్తిగా? "

"తప్పకుండా పొద్దుటేల దాన్నుంచి పాట వినిపించేలా వొడ్డున దగ్గరగా కట్టించండి"

"కట్టించేవారు మీరే, కట్టేది యువకులు. మైకు సెట్టు నేను బహూకరిస్తాను"

"ఆ పెట్టె పట్టుకుని మోసుకుంటూ మీరు తిరగక్కర్లేదప్పుడు. వర్షమొచ్చినా మాకు పాటలు వినిపిస్తాయి. బాగుంది స్వామీ!

మహా బాగుంది. మావాళ్లకీ చెప్పి యిరాళాలిప్పిస్తాం"

"విరాళాలకంటే మీ చల్లని దీవెనలూ, మంచిమనసూ అవే ముఖ్యం"

"వాటికేం కొదవ? మీరు పూనుకొండి. మేము మీ వెనక ఉంటాం. మీరెలా జేసినా కాదనం"

"మీ అభిమానానికీ విశ్వాసానికీ కృత జ్ఞుణ్ని. మీ ఆధ్వర్యంలోనే శంఖుస్థాపన జరుగుతుంది. స్థల నిర్ణయం..."

"బాబూ! ఈవొడ్డంతా మనదే. పదండి. మంచి స్థలం చూద్దాం" ధీమాగా అన్నాడు.

ఆమధ్య ఎవరో పైనుంచి లారీలో బోటు పెట్టుకుని వొచ్చి ఇక్కడ చేపలు పట్టబోతే- అతన్నీ, సహాయంగా వొచ్చిన రక్షక భటుడినీ తన్నినంత పనిచేసి తిప్పి పంపించేశారుట. చెరువులకిలాగ పన్ను కట్టకపోయినా ఈ తీరంమీదా సముద్రం మీదా హక్కు గంగాపుత్రులదే. ఇక్కడ వీరిదే బలం.

యువకులంతకుముందే చూసి ఉంచిన నాలుగైదు జాగాలలో ఒకదానినందరూ ఏక గ్రీవంగా ఆమోదించారు.

"సుబ్రహ్మణ్యేశ్వరశాస్త్రిగారిని పిలిపించి ముహూర్తం పెట్టిద్దామా? "

"మీరే ఉండగా వారెందుకూ? " అన్నాడొక యువకుడు.

"ఎవరిపనివారు చేయడం మంచిది" నవ్వాడు మాధవ్.

"అది వారి వృత్తి"

"ఎవరికివ్వ వలసిన స్థానం వారికిస్తారు బాబూ! అందుకే మీరు గొప్పవారు" అన్నాడు జాలారిపాలెపు పిలగోడు.

పంచాంగం పట్టుకు మరీ వొచ్చారు సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి. ఏ ఉద్దేశంతో ఎటువంటి భవనం నిర్మించబడబోతూందో మాధవ్ వారికి వివరించాడు. ఆయనేవో లెక్కలు వేసి మూడవరోజునే ముహూర్త నిర్ణయం గావించి- పారితోషికం అందుకుని వెళ్లారు.

★ ★ ★

సందర్భానుసారంగా ఉందావేదిక. రధం... గుర్రాలు... నేపధ్యచిత్రం. ఆరు నుంచి పదేళ్లలోపు బాలికలు కృష్ణుడి వేషం లోవొచ్చి-నిలుచుంటే రధంమీద నిలుచున్నట్లే కనిపిస్తున్నారు ప్రేక్షకులకి. చిన్నపిల్లలేమో- పంచెకట్టి- జుత్తు దువ్వి నెమలికన్ను తగిలించేసరికి అచ్చంగా అలనాటి కృష్ణపరమాత్మలాగే గోచరిస్తున్నారు. ఒక్కొక్కరూ వొచ్చి భగవద్గీతలోని పది శ్లోకాలను చదివి వెళ్తున్నారు. న్యాయం సరిగా జరగాలని కాబోలు పోటీదార్ల పేర్లకి బదులుగా నంబర్లు చెబుతున్నారు. రధంమీద 'గీతాజ్ఞాన సమితి'

కార్యక్రమమంతా వీడియో రికార్డింగ్ చేయబడుతూంది.

ఒక్కొక్క బాలకృష్ణుడూ వొచ్చి తనకు నచ్చిన పదిశ్లోకాలు చదివి వెళ్తున్నాడు.

అలాగ ముప్ఫయ్యిద్దరు చదివారు. పది నిమిషాలలో న్యాయనిర్ణేతలు వేదిక మీదకు వచ్చి "మేము బహుమతి గ్రహీత పేరు పిలవగానే ఆ పాపని వారి పెద్దలు వేదికపైకి తీసుకొచ్చి పాప వివరాలు చెప్పాలి" అంటూ,

"ప్రథమ బహుమతి చి.సౌ.సరస్వతి" అని చదివారు.

మాధవ్ ఆనందానికి అవధిలేదు. ఇంకా కృష్ణుడి వేషంలోనే ఉన్న సరస్వతినెత్తుకుని వేదికపైకి వెళ్లాడు. సరస్వతికి బహుమతం దించి ఆపైన ఆశీర్వదించారు కూడా బహుమతి ప్రదాత. న్యాయనిర్ణేత "పాప సరస్వతి కంఠం అతి తీయనిది. దానికి తోడు దోషాలు లేకుండా స్పష్టంగా చదివింది అన్ని శ్లోకాలూ. సంస్కృతంలో ఉండే సహజసంగీతాన్ని వెలికి దెచ్చిందీమె చదివిన వైఖరి. చిరు నటనను జోడించి అర్ధవంతంగానూ భావస్ఫోరకంగానూ సంస్కృత భగవద్గీతా శ్లోకాలను గానం చేసిన ఈ చిన్నారికి ప్రథమ బహుమతే అర్హమని మేము భావించాం" అన్నారు. వారి నిర్ణయాన్ని హర్షిస్తున్నట్లు ప్రేక్షకులు చప్పట్లుకొట్టారు.

"ఫలితాలన్నీ అయ్యాక బహుమతి

ప్రదానం ముగిశాక పాప వివరాలు చెబుతాను, మన్నించం"డంటూ వేదికదిగాడు మాధవ్. గిరిజకి ప్రోత్సాహక బహుమతి రావడంతో ఆమె నెత్తుకుని మళ్లీ వేదికెక్కాడు.

"ప్రథమ బహుమతి గ్రహీత చి.సౌ.సరస్వతి. ప్రోత్సాహక బహుమతి గ్రహీత చి.సౌ.గిరిజలకు సంరక్షకునిగా మాత్రమే వొచ్చాను. ఈ ఇరువురూ పూడిమడకలోని గంగాపుత్రుల పుత్రికలు. ఉద్దండుడిని కాకపోయినా నాకు తెలిసిన స్వల్పంమేరకు వీరికి, మరో ముప్ఫయి మందికీ సంస్కృతం నేర్పుతున్నాను"

"ఏమిటీ! జాలర్ల పిల్లలా! వీళ్లకి సంస్కృతమూ భగవద్గీతా శ్లోకాలా! బహుమతులూనా" ఆశ్చర్యపోయారు ప్రేక్షకులు. మరొకసారి సరస్వతిని గీతాశ్లోకాలు చదవమని కోరారు. సరస్వతి ఈసారి మరో పది శ్లోకాలు గానం చేసింది. ఆ గానానికి ప్రేక్షకులు మురిసిపోయారు.

"భాషకు కులభేదముండదు. ఈ సందర్భంలో శోకమును శ్లోకరూపంచేసి శ్రీమద్రామాయణాన్ని రచించిన వాల్మీకి, మహా భారతకర్త వేదవ్యాసులూ కులాన్ని బట్టీ అయితే అగ్రగణ్యులు కారనీ, కాని వారి రచనలు చిరస్మరణీయాలూ, వారు చిరస్మరణీయులూ అని గుర్తు చేస్తున్నాను" అన్నారు కార్యదర్శి.

"చూడండి. మీరీ కార్యక్రమం వీడియో తీశారుకదా ఒక్కసారి నాకిస్తే ఈ పాపల తల్లిదండ్రులకి, మిగిలినవారికీ చూపించి క్యాసెట్ తిరిగి ఇస్తాను. అది వారందరికీ ఆనందం కలిగించడమేకాక సంస్కృతం నేర్చుకునేవారి సంఖ్యనధికం చేస్తుందని నా ఆశా, ఆకాంక్షా"

"అలాగే, మీరెప్పుడు కావాలన్నా ఇస్తాను. మీరిక్కడ సంస్కృతాన్ని బాగా ప్రభావం చెయ్యండి. మీ పేరు మాధవ్ కదూ అన్నారు? "

"ఊ" అని నమస్కరించి శలవు తీసుకుంటూంటే

"నమస్కారం! మీరు మాధవ్‌గారని ఇప్పుడే విన్నాను. నా పేరవధాని. సంస్కృత పండితుడినేకాని అవకాశమూ ఆదరణ లేక నావిద్య మరుగున పడిపోతోంది. వ్యవసాయముంది నాకు దోసూరులో. మీరవకాశమిస్తే పూడిమడకలో పిల్లలకి సంస్కృతం చెబుతాను. నెలకి రెండు వందలు వచ్చినా చాలు. విద్య నేర్పడంలో తృప్తి ఆపైన పూడిమడక కనుక ప్రతినిత్య సముద్ర స్నానమూ లభిస్తాయి. మా పొలం నుంచి అడ్డదారిన దగ్గరే కనుక కాలినడకన వొచ్చిపోతుంటాను. అలాగ వ్యాయామమూ లభిస్తుంది వొంటికి. మీరక్కడ చేసే కృషి గురించి ముందే తెలిస్తే నేను మిమ్మల్ని కలుసుకునేవాడినే. మీరీ అవకాశం చూపగలిగితే భుక్తీ ముక్తీ కూడా ప్రసాదించినట్లే"

"పెద్దవారు! మీరంతగా చెప్పాలా! నేనూ సంస్కృత పండితుడి కోసమే అన్వేషిస్తున్నాను. నాకొచ్చింది స్వల్పం. అది కాస్తా నేర్పేశాను. మీవంటి పండితుల చేతుల్లో అయితే ఆ విద్యార్థులు మరీ రాణిస్తారు. మీకు నెలకి రెండువందలు కాదు మూడు వందలందేలా చూస్తాను" అన్నాడు మాధవ్.

"రేపే మిమ్మల్ని ఇక్క[illegible]స్తాను"

"తప్పకుండా నమస్కారం"

అవధాని సరస్వతినీ గిరిజనీ అతనినీ కూడా ఆశీర్వదించి శలవిచ్చారు. పదిరోజుల లోనే పూడిమడకలో ఆ రాత్రి సభ జరిగింది. వర్షాగమన సూచనలు లేనందున సముద్రపొడ్డునే కూడారందరూ. పిల్లా పెద్దా ఆడామగా అందరూ వచ్చారు కార్యక్రమానికి. మొట్టమొదట వీడియో.

"అరె! మన సరస్వతీ! అచ్చంగా బాలక్రిష్ణుడిలాగే ఉంది"

"ఎంచక్కా రథమెక్కి కూర్చొని ఎలా శ్లోకాలు పాడుతోందో"

"దీనికింతిద్యెక్కణ్నుంచొచ్చిందే. సేపలాళ్ల చిన్నదెక్కడ శ్రీకృష్ణుడెక్కడ"

"హోలమ్మోలమ్మ. గుంటగట్టిదే. అందర్లోకీ గొప్పదే. ఎంత ఎండిగిన్నిచ్చారో"

"ఎండిగిన్నె కాదేహ్! ఎండికప్పు"

"గిరిజ కూడా బాగానే పాడింది"

"మొత్తానికి మనబొట్లు అనకాపల్లెళ్లి కప్పు లట్టుకొచ్చేరన్నమాట పజ్యాలు చదివి"

"ఇదంతా స్వాములోరి చలవే. ఆరే ఈళ్లని చేరదీసి ఇంతోళ్లని చేశారు"

వీడియో కార్యక్రమం అనంతరం చంద్రయ్యని వేదికమీదకి పిలిచాడు పిలగోడు.

ముందు వొద్దన్నా పిలగోడు బలవంతం చేశాక వేదికెక్కక తప్పలేదు. తరువాత విశ్వేశ్వర్రావుని పిలిచారు.

"మనూరి విశ్వేశ్వర్రావు. అనకాపల్లిలో పోటీలకెళ్లి పరుగులోనూ గెంతడంలోనూ రెండు కప్పులు కొట్టుకొచ్చాడు. అవి ఇవిగో" అన్నారు చంద్రయ్య.

అందరూ చూసి బాగున్నాయని కప్పులనీ విశ్వేశ్వర్రావునీ మెచ్చుకున్నారు. ముందు వరసలో కూర్చున్న చుక్క కళ్లు ఒక్కసారి మెరిశాయి. కాని అంతలోనే ఆమె నుంచి నిట్టూర్పు.

"విశ్వేశ్వర్రావ్ సామాన్యుడుకాదు. రచ్చగెలిచినాడు. మన పూడిమడక్కి గర్వకారణం. ఇలాటి కొడుకో అల్లుడో ఉండాలని పెద్దాళ్లా సపడేంత ఘనుడే మనిశ్వేశ్వర్రావ్.. ఇతనింకా ఇలాటి కప్పులెన్నో కొట్టుకురావాలి"

చంద్రయ్య బాగానే అప్పగించాడు తన చేత మళ్లీమళ్లీ చెప్పించిన మాటలని. అదయ్యాక వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకోడం అనే సరదా ఘట్టాన్ని పావుగంట నాటికలా ప్రదర్శించారు.

కాసులమ్మ నవ్వాపుకోలేకపోయింది. గాడిద- అదోలా మాట్లాడుతుంటేనూ, మధ్య మధ్య ఓంద్ర పెడుతుంటేనూ.

ఆమె పక్కనే ఉన్న మాధవ్ ఆమె ఆనందంగా నవ్వుతూంటే ఆశ్చర్యమనిపించి కాబోలు ఆమెనే చూస్తూ ఉండిపోయాడు.

మరో పదినిమిషాలకు కార్యక్రమాలు ముగిశాయి. సద్దుబాట్లని పర్యవేక్షించి బసకి చేరుకుని అలసటగా వాలిపోయాడు. అప్పటికే చాలా వేళవడంతో అతనికి చాలా గాఢ నిద్ర పట్టేసింది కొద్దినిమిషాలలోనే.

ఆ రాత్రి కాసులమ్మ రోదనలతనికి వినిపించలేదు. ఎప్పటికంటే క్రూరంగానూ కఠినంగానూ శిక్షించాడామెను గరటయ్య. ఆమె మాధవ్ పక్కనే నిలుచుందనీ, అతనితో వికవికలూ పకపకలూ ఆడిందనీ నిందిస్తూ. ఆమెకు భరించలేని బాధని కలిగించిందా శిక్ష. ఇంకామె సహనం నశించిపోయింది.

ఏమైతేకానీ రేపు తగువెట్టేస్తాను. ఈడు నన్ను పశువుని బాదినట్లు బాదేస్తున్నాడు రోజూ అని.

ఆ రాత్రంతా ఆమె బాధతో ఏడుస్తూనే ఉంది. బాధ అధికమైనప్పుడల్లా లాభం లేదు తగువెట్టవలసిందే. లేపోతే ఆడు తగ్గడు అనుకుంటూనే ఉంది. అలాగే తెల్లవారిందామెకారేయి.

★ ★ ★

"ఇక్కడున్నారా బాబూ! తమరికోసం ఊరంతా తిరిగాను" అంటూ వొచ్చాడు కొత్వాలు.

"ఏం పని? "

"రేపు తగువుంది బాబూ"

"ఎవరిది? "

"కాసులమ్మది"

అతను గతుక్కుమన్నాడు.

"తమరికి కూడా కబురు సెప్పమన్నాడు పిలగోడు"

"ఆహా... వస్తానని చెప్పు. రేపు తీరికే"

"దండాలు బాబూ" అని వెళ్లిపోయాడు వాడు. ఇక అతనూలేచాడు. నడవసాగాడు. రేపటి తగవేవిధంగా ముగియబోతూంది? భర్తనుంచి కౌసల్య స్వతంత్రురాలౌతుందా? అయ్యాక? ఆమె కూడా కల్లు చంద్రమతి లాగే. వీల్లేదు. అలా ఎంతమాత్రమూ జర



గకూడదు. తన కంఠంలో ప్రాణముండగా అలా జరగనివ్వడు.

"ఏటి స్వామీ చూస్తున్నారు? భవనం-గోడలవరకూ వచ్చాగిపోయిందనా! దేముడు తలుచుకోవాలనే కానీ అదెంత? ఇంతవ రకూ వస్తదనుకున్నామా?" నవ్వాడతను.

నిజమే. అనుకున్నదే తడవు. చకచక పునాదులూ, గోడలూ లేచాయి. యువకు లంతా శ్రమదానం. ఊరిలో విరాళాలు. కానీ ఇక పైన.

ఔను దేముడే ఉన్నాడు.

రేపు కౌసల్య ఆరోపించే నేరానికి గర టయ్య ఏం జవాబు చెబుతాడు?

చివరికి నేరం ఎవరిదని నిరూపితమౌతుంది?

ఏమో, కాలమే నిర్ణయిం చాలి.

బాధగా నిట్టూ ర్చాడు మాధవ్.

ఆ రాత్రి అభోజన ముండిపోయాడు మాధవ్.



రచ్చబండవేపు నడి చాడు. అతను వెళ్లేసరికే అందరూ గుమిగూడారక్కడ. పిలగోడికె దురుగా కాసులమ్మొకవేపూ గరటయ్య మరోవేపూ.

"కాసులమ్మా! నువ్వు చెప్పదలుచుకున్నది చెప్పుకో"

"నా మొగుడు గరటయ్య నన్ను అస్త మానూ తంతున్నాడు"

"నిజమేనా గరటయ్యా"

"ఆ"

"ఎందుక్కొడుతున్నావు?"

"దాన్నే అడగండి"

"కొట్టేవాడతను. అతనికే తెలియాలి. అతనే చెప్పాలి" అందామె.

"అదీ నిజమే. చెప్పు ఎందుక్కొడుతు న్నావ్?"

"అది నాయాల్ది పైవాడికోసం పరుగులెడు తోంది"

"అబద్ధం! అదంతా ఆడి అనుమానం, బ్రమ, అంతే" అరిచిందామె.

"మరయితే దీనిసంగతేటో?" అంటూ ఆమెవేపు క్రూరంగా చూసి పిలగోడి కందిం చాడు. అది ఫొటో! కాసులమ్మ ఉన్న ఫొటో!

"ఆ మిండగాడు దీనికి పొటోదీశాడు. ఇది దిగింది. ఇంతకంటె నిదర్శనమేటి కావాలి. అదీ ఆడూ కులుకుతున్నారనడా నికి? ఆడూ యిదీ ఎదురుప డితే సాలు యికయికలూ పకపకలూ. ఒకట్రెండు రాత్రులాడు గుడిసెకె రాబోయినాడు నేనుం డననుకుని. రోడ్డుమీ దాడూ ఇదీ మంతనా లాడుకోడం నర్సిం హెన్నో సార్లు కళ్లారా చూశాడు"

"ఏమంటావ్ నర్సింహా?"

"గరటయ్య సెప్పేది నిజవే" అన్నాడతను ముందుకొచ్చి.

"నిజవే... మేం మాట్లాడుకున్నాం. అంటే ఆ బాబు నన్నేదో అడిగితే నేను బదులు చెప్పాను. అంత మాత్రానికే ఆడదీ, మాగాడూ మాట్లాడినందుకే అనుమానమూ, రంకు కట్టడమూ, పశువుని బాదినట్లు బాద డమూ నాయమా?"

"వాళ్ల మధ్యేమీలేకపోతే ఆడు దీనికి అద్దం దువ్వెనా ఎందుక్కొనిస్తాడో?"

"నేను కొనుక్కుంటే సమయానికి డబ్బులు సాలకపోతే సాయం జేశారా బాబు. మళ్లా నేనిచ్చేసేనది"

"ఇంతకీ ఎవడతడు అడిగాడు పిలగాడు.

"ఊరూ మీరూ కొలుస్తారే దేముడల్లే. ఆసామే, కాషాయ గుడ్డల దొంగసన్నాసే"

కసిగా అన్నాడు గరటయ్య.

"ఆ! స్వామా!" త్రుళ్లిపడ్డాడు పిలగోడు. అతను సంకటంలోపడ్డాడు. "పై వారి విష యంలో నేనెలా తగవు తీర్చగలను? " అనే శాడు చటుక్కున. నిజమే. అక్కడివారే అతను చెప్పిన న్యాయం అంగీకారంగాలేద నుకుంటే ఓపికుంటే కోర్టుకి పోతారు. అలా పోయేవారరుదే. కానీ పిలగోడి న్యాయానికి పరిధీ పరిమితీ ఉన్నాయి. తమకులానికి చెందని వారాపరిధిలోకిరారు.

"నేను పైవాడినికాను. మీకులంలో జన్మిం చకపోయినా మీవాడినే. మీ తీర్పు ఎటువం టిదయినా కట్టుబడి ఉంటాను" అంటూ పిలగాడి ముందుకు వొచ్చి తలవంచాడు.

"స్వామీ! మీరిటువంటి తప్పు జేశారంటే"

"నేను చేసింది తప్పనుకోలేదు. కాని నిజం తెలియని గరటయ్య నన్నలా భావిం చడం సహజమే. నాకథ వింటే, గతం వింటే అసలు విషయం అర్థమౌతుంది. మీరనుమ తిస్తే విన్నవిస్తాను. అది విన్నాక కూడా నేను చేసింది తప్పే అనుకుంటే మీరేశిక్ష విధించినా సంతోషంగా స్వీకరిస్తాను"

"చెప్పండి" అనుమతించాడు పిలగోడు.

"కౌసల్యంటే నాకు చాలా యిష్టం, అభి మానం, ప్రాణం, ప్రేమ. కాని నేను లేని సమయంలో ఆమెకు సంబంధం కుదిరింది. ఆమెకు కాబోయే భర్త ఎటువంటివాడో తెలుసుకోకుండానే తొందరపడి వివాహం జరిపించేశారు. నాగరిక సమాజంలో వివా హమది వ్యాపారం. ఆడపిల్లకి సంబంధం కుదరడమంటే చాలా అదృష్టమే. ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాలలో. కనుకనే ముందూ వెనకా చూడకుండా తొందరగా మూడుముళ్లూ వేయించేశారు. పెళ్ళయిన తరవాత కౌసల్య భర్తలోని పులి బయటప డసాగింది. వొట్టి ధనదాహం మనిషి. ఎంత డబ్బుకీ అతని దాహం తీరదు. పెళ్లయిన ఆరేడు నెలలకే అతని ధనదాహం అత్తమా మలు తీర్చలేరని అతనికర్థమైపోయింది"

"చస్! అదేం బతుకు? ఆడు మగాడు కాడా? మనలోనే నయం. పెళ్ళికి తీసుకునే కట్నం అంతంతమాత్రం. సమయంలో చెల్లించలేకపోతే గడువిస్తాం ఆడపిల్ల తండ్రికి. అప్పటికీ తీర్చకపోతే తెగించి కబు రెడతాం. ఆ అవమానం బరించలేక యియ్యంకుడు డబ్బట్టుకు పారొస్తేసరే. ఇచ్చుకోలేనంటే సరే పో అని వొగ్గేస్తాం బాకీ పైసల్లేసేసి. అంతే కాని మనింటికి దెచ్చుకున్న ఆడపిల్లమీద ఈగవాలనివ్వం. పువ్వుల్లో పెట్టి జూసుకుంటాం మనది అయిన కోడల్ని. పల్లెత్తు మాటనం. అది మన పిల్ల. అసలు సంబంధం జేసుకున్నాక ఆళ్లేటి మనవేటి అంతా వకటే. వియ్యంకుడు బాకీ ఉన్నాడనే యాదస్తుండదు. ఆడు పైవాడేటి? మరేటో. సదువుకున్నామం టారు. గొప్పోళ్లంటారు. డబ్బుల్దెమ్మని పుట్టింటినుంచి సొమ్ముట్టుకురమ్మని పెళ్లాన్ని తోలేడమా! చస్... ఎదవ పని. ఆడు మగాడు కాదూ? పౌరుసంనేదూ? సిగ్గూ శరమూ లేవూ? చేతనయితే సొంతంగా సంపాదించుకోవాలి కానీ మొగజన్మెత్తి అత్తా రిమీద ఆదారపడ్డమా! అడుక్కోడమా! అలాటి కొజ్జాగాళ్లకి పెళ్లేటి? "

"భార్యనుంచి పుట్టింటి సొమ్ము ఇక రాదని తేలిపోయాక కౌసల్యనామె భర్త నానా విధాలా హింసించసాగాడు. కొన్నాళ్లు భరించి, ఇంకా హద్దుమీరడంతో తన యాత నలన్నీ వివరిస్తూ పెద్ద ఉత్తరం రాసింది. అమ్మా నాన్నా పరుగెత్తుకెళ్లేసరికి, ఆ ఉద యమే ఆమెను కిరసనాయిలు పోసి- నిలు వునా కిరసనాయిలు పోసి అగ్గిపుల్ల గీసే శాడా రాక్షసుడు. ఆమెనెవరో దయామ యులు హాస్పిటల్లో చేర్చారు"

"ఫుండాకోరు! ఇష్టంలేకపోతే వొగ్గియాలి కానీ అగ్గెడతాడా! అలాటాడిని ఆడినే అగ్గి నిప్పుల్లో దోసెయ్యాల డబ్బు కక్కుర్తి నా కొడుకులు"

"నాకు టెలిగ్రామందింది పరిస్థితిని తెలియజేస్తూ. నేను రైలుదిగి హాస్పిటలు చేరేసరికి-

కౌసల్య కాలిపోయి, భయంకరంగా కనిపిస్తూ, బాధగా కేకలువేస్తుంటే షాకయి, కూతుర్నలా చూడలేక చనిపోయింది. తల్లి ఆ తండ్రికి ముందే హార్ట్‌అటాక్. అటు కూతురి పరిస్థితి, ఇటు భార్య మరణం రెండు బాధలు భరించలేక వొరిగిపోయారు. ఆయన ప్రాణమూ పోయింది. మరో అరగంటకే కౌసల్య కూడా చనిపోయింది. కాలిపోవడంవలన మూడుశవాలూ మార్చురీలో ఉన్నాయి. తీసుకొండి" అంది నర్స్.

కథ వింటున్న ఆడవాళ్లు కళ్లు తుడుచుకున్నారు. తగవుకొచ్చిన ప్రేక్షకులలో అధిక భాగం ఆడవాళ్లే! ఆలుమగల తగవంటే ఆడవాళ్లకే ఎక్కువ కుతూహలమనిపింపజేస్తున్నట్లు ముసిలాళ్లు కూడా వచ్చారు. కల్లు చంద్రమతి, లీల, సన్నమ్మ, దుర్గ, ఎందరెందరు స్త్రీలో! పిల్లలు మాత్రం లేరు. ఇలాటి తగవులకి వారు రారో, లేక పెద్దలే రానివ్వరో.

"మూడు శవాలను అయిన వారి ముగ్గురినీ దహనంచేశానొక్కసారే. నాకింకెవరూ లేరు. వైరాగ్యం ఆవరించి సముద్రంలో కలిసిపోవాలని, ఆత్మహత్య చేసుకోవాలని ఆ రాత్రి ప్రయత్నిస్తుంటే, ఒకస్వామి వారించారు. ఆత్మహత్య కూడదన్నారు. బతకాలన్నారు. పూడిమడక వెళ్లమని ఆజ్ఞాపించారు. కాదనలేకపోయాను"

"మీరొక స్వామి. వారు మరోస్వామి!"

"నేను నిజంగా స్వామిని కాను. వారే నిజమయిన స్వామి. నేను వారి వలన పునర్జన్మే పొందాను. మీరు విశ్వసించగలిగితే నాలో చిత్రమయిన మార్పు వచ్చింది. స్వామివారి బోధనలకి"

"వారేం బోధించారు?"

"మూడేముక్కలు. ముఖ్యంగా మానవసేవే మాధవసేవ. మానవసేవలోనే జీవితాన్నందుకోనూవచ్చు. అర్థంచేసుకోనూవచ్చు. వారి మాటలు పరమ సత్యాలే అయ్యాయి నా పాలిట. నేనక్కడకు వచ్చిన తొలి ఘడియలలోనే కౌసల్య కనిపించింది నాకిక్కడ. ఒక్కక్షణం ఆశ్చర్యమేసింది. నా కౌసల్యే.

అదే రూపం. అదే కంఠం. కాకపోతే చిన్న చిన్న తేడాలు. అంతే. నా కౌసల్యే మళ్లీ పుట్టి వొచ్చిందనిపించింది. నా జీవితానికి మళ్లీ ఆలంబన లభించింది. అయితే నేను ఒక విచారించవలసిన విషయం గ్రహించవలసివొచ్చింది. ఈ కౌసల్య భర్త చేత అనుమానించబడుతూ శిక్షించబడుతూ దుర్భరమయిన జీవితం గడుపుతోంది. ఇక్కడ వరకట్నం లేనట్లే. వరకట్న బాధలూ చావులూ లేవు స్త్రీకి. అందుచేతనే నాకీ సమాజం ఎంతో నచ్చింది. నా కౌసల్యే ఇటువంటిచోట ఉండిఉంటే అలా దారుణంగా భర్తచేత కాల్చిచంపబడి ఉండేది కాదేమో. కొన్ని కోణాలలో ఇక్కడిదత్యంత ఆదర్శమంతమయిన సమాజం. నాగరికులే నేర్చుకోవాలి దీనిని చూసి. సరే నేనొకటి ధ్యేయంగా పెట్టుకున్నాను. కౌసల్య కళకళలాడుతూ సుఖంగా జీవించాలి. ఈ కౌసల్యా నా కౌసల్యలా బాధలు పడకూడదు. అప్పుడే నాకానందం"

"ఇక్కడ మాలో కౌసల్యెవరూ లేరే"

"కాసులమ్మే నా కౌసల్య"

"అసలు కౌసల్యెవరు? ఆమెకీ మీకూ ఏమిటి సంబంధం?"

"కౌసల్య నా చెల్లెలు"

"అరె! మరామాట ముందు చెప్పరేం?"

"కౌసల్య నా చెల్లెలే అయినా మొదటి నుంచీ కౌసల్యా అనే అనేవాడిని. అదే నా అలవాటు. ఆమె కూడా నన్నన్నయ్యా అని కాక మాధవా అనే అనేది. ఆ అలవాటు ఆమె పోయినా ఆమెతో పోలేదు. కౌసల్య నాకు చెల్లెలే కాదు, స్నేహితురాలు. మేమెంత సరదాగా నవ్వుతూ తుళ్లుతూ

ఉండేవాళ్ళం. అందుకే ఇక్కడ కాసులమ్మలో మళ్ళీ నా కౌసల్య కనిపించేసరికి మనసు నాపుకోలేకపోయేవాడిని. పలకరించకుండా ఉండలేకపోయేవాడిని"

"ఈ విషయం ముందే చెప్పి ఉంటే..."

"కొత్తగా వొచ్చిన నా మాటలు మీరు నమ్మగలిగి ఉండేవారు కాదేమో"

"ఇప్పుడు మాత్రం నేను నమ్ముతానేటి? రంకు నేర్చినవాళ్లు బొంకు నేర్వరా? సదువుకున్నోళ్లకి కథల్చెప్పడం ఏపాటి? నాటకాలాడించేవోళ్లకి నాటకాలెయ్యడమెంత? ఈ కట్టు కథ నేన్నమ్మను" అన్నాడు గరటయ్య మొండిగా.

"పునర్జన్మ ఎత్తాక నాకు ఏ స్త్రీ అయినా కౌసల్యలాగే కనిపిస్తూ వొస్తుంది. మీరు నమ్మలేకపోయినా నాలో స్త్రీపట్ల కామభావనే కలగడంలేదు" తల వొంచుకున్నాడు మాధవ్.

"బాబుగారి ఈ మాట నిజమని నేను చెప్పగలను" అంటూ ముందుకొచ్చింది కల్లు చంద్రమతి హటాత్తుగా, "సూరిగాడు యాపారం తగ్గిపోవడానికి బాబే కారణమని యితణ్ణి వశం జేసుకోమని అర్ధరాత్రి నన్నం పాడీయనకాడకు. మనలో మనమాట. నేను చెడిపోయిన దాన్నయినా కాసులమ్మ కంటె కంటికి నరుదుగానే కనిపిస్తాను. చిన్నదాన్నీను. అయినా నేనెన్ని టక్కులు జేసి బతిమాలినా నన్ను ముట్టలేదీ బాబు. ముకం సూడలేదు.. అక్కడనుంచి పారిపోయారు తప్పంటూ. ఈ బాబందరిలాటోడూ కారు"

ఆ మాట నేనూ చెప్పగలను మనస్ఫూర్తిగా. ఎందుకంటే గల్లీల్లో కూలికెళ్తే పైనుంచెవరొచ్చినా ఆరితో నన్ను పడక చెయ్యమనేవాడు మా గుమాస్తా. నేను సక్కనిదాన్ననీ వయసులో ఉన్నదాన్ననీ, పడకగదిలోకొచ్చి పైటజార్చినా ఆడదానివంక సూడకుండా అవతలకి పంపేసిన మొగాడింతవరకూ నాకీయనొక్కరే కనిపించారు. అంతే కాదు, ఆపైన అటువంటి పాడుపనులు మానిపించేశారు కూడా. పద్ధతులే మార్చేశారు. బాబుకి చేతులెత్తి మొక్కాల ప్రతి ఆడదీ" అంది లీల.

"ఆ ఫొటో నేను తీసింది కాదు. ఈ వూరు చూడడానికొచ్చిన విశ్వమనే అతను తీసిన అనేక చిత్రాలలో అది వొకటి. నిజానికి చెల్లెలి కన్నయ్య ఫొటో తీస్తే మాత్రం తప్పేమిటి? " అన్నాడు మాధవ్.

ఒక్కనిమిషం అక్కడంతా నిశ్శబ్దమయిపోయింది.

"నమ్మేవారికి నిదర్శనమూ అక్కరలేదు. నమ్మనివారికెన్ని నిదర్శనాలూ చాలవు. నా మాటలను మీరు నమ్మకపోతే నన్ను శిక్షించండి. కాని కాసులమ్మ... కౌసల్య నిరపరాధీ, అమాయకురాలూ. ఆనాడు నా చెల్లెలు తన భర్త చేతిలో పడిన కష్టాలలాటివే యీమే తన భర్త చేతిలో పడుతూంది, కారణం వేరయినా. ఆమెకీ కష్టం తొలిగి సుఖంగా ఉండగలిగేందుకు నాకే శిక్ష విధించినా సరే" ఆవేదనగా అన్నాడు మాధవ్.

పిలగోడు ఒక్కసారి తీవ్రంగా ఆలోచించాడు. జనంవేపు చూశాడు. "వీరు మనమేం చెబితే దాని కంగీకరిస్తామంటున్నారు. గరటయ్యకింకా వీరి మాటలమీదా వీరిమీదా నమ్మకం కుదిరినట్లు లేదు. అనుమానం అనేది నిప్పు లేకపోయినా వొచ్చే పొగ. మరి వీరిని ఊరొదిలి వెళ్ళిపొమ్మందామా? "

ఒక్కసారి జనంలో కలకలమూ అలజడీ కోలాహలమూ- "వొద్దొద్దు. ఊరుదేముడు ఊరికుపకారి. ఎన్నెన్నో జేశారు, చేస్తున్నారు. కల్లు మానిపించి కాపరాలు నిలబెట్టారు. ఆటలు పాటలు, సంస్కృతం. సంగీతం, లెక్కలు నాటకాలు చల్లని దీవెనలు, చక్కని మాటలు రేడియో పెట్టిలోకెక్కించారు. స్వామి వెళ్ళరు. వెళ్ళకూడదు. మేం వెళ్ళనివ్వం. కావాలంటే ఆ గరటయ్యనే పొమ్మను. ఆడి పెళ్ళాన్ని తీసుకుని మరో మగాడు లేని ఊరేదయినా ఉంటే అలాటూ

రికి. అంతేకాని సామిని పంపేందుకీల్లేదు. మేమొల్లమంటే వొల్లం"

నిశ్శబ్దమన్నట్లు వారించి- పిలగోడు మాధవ్ని దగ్గరగా పిలిచి ఒక మాటా కాసులమ్మని పిలిచి ఓ మాటా చెప్పాడు. అప్పుడు గరటయ్యని పిలిచి రెండు మూడు నిమిషాలు గుసగుసలాడాడు. ఆ ముగ్గురినీ దగ్గరగా నిలబెట్టాడు.

"అన్నయ్యా!" అంది కాసులమ్మ మాధవ్కి మరీ చేరువై.

"చెల్లెమ్మా!" అన్నాడతను ఆమెని దగ్గరకు తీసుకుంటూ. అప్పుడు గరటయ్యవేపు తిరిగి- "బావగారూ! మా చెల్లి అమాయకురాలు. సరిగా ఏలుకోండి" అంటూంటే పిలగోడు మాధవ్కి పాకెట్లందించాడు.

"చెల్లీ! ఇదుగో నీకు కొత్తకోక. యీ అన్నయ్యనుంచి బహుమతి"

"బావగారూ! ఈ కొత్త బట్టలు స్వీకరించండి బావమరదినుంచి"

గరటయ్య కాదనకుండా అందుకున్నాడు. అతని కళ్ళ వెంట నీళ్లు వొస్తున్నాయి. అతని కాళ్లమీద పడిపోయాడు. "మూర్ఖుణ్ణి... నీచుణ్ణి... నన్ను చమించండి సామీ! మీమీద కోపంతో చదువుకీ ఆటలకీ తోటివారితో రాక కల్లు, సుట్ట మానక ఇన్నాళ్లూ నా కొంపకి నేనే అగ్గెట్టుకున్నాను. మీరేటో కానలేకపోయాను కళ్లు మూసకపోయి. తమరు నన్ను బావా అని పిలిచారు. ఎంతదృష్టం ఈ నీచుడికి. అవును సామీ! నిజమే... దేముడు పాపాత్ములకే దగ్గరగా ఉంటాడు"

"బావగారివి! నా కాళ్లమీద పడకూడదు. తొందర్లో మేనల్లుడినో మేనకోడలినో కనియిస్తే వాళ్లు నా కాళ్లమీదపడి ఏనుగాటా... వీపుమీద పడి చల్ చల్ గుర్రం ఆటా... నెత్తెక్కి కోతికొమ్మచ్చీ ఆడుకోవాలి. అదీ మనందరికీ ఆనందం"

"ఇప్పుడు నా మనసులో ఏ కుళ్లూ లేదు. నిజం చెబుతున్నాను బావా! నా మనసు స్వచ్ఛమయింది. ఈ సుబసందర్భంలో రాత్తిరికి మాయింట నీ చెల్లెమ్మింట ఇందుసెయ్యాల మరి. కాదనకండి-"

"కాదనడమా! బలే బావవే. నాకెంతో సంతోషం. మా చెల్లెమ్మ చేతివంట తినాలని నాకెన్నాళ్లనుంచి కోరికో. ఆ కౌసల్య ఎలాగూ తీర్చలేదు. ఈ కాసులమ్మే తీర్చాలి. కాని చెల్లెమ్మా! విందని- మత్స్యమూ మద్యమూ పెట్టావు. నాతరం కాదు సుమా!'

"సెల్లిని. నాకు తెల్దేటి నా అన్న సంగతి. అన్నా! ఇకనుంచి నువ్వా కౌసల్యని మర్చిపో. నేనున్నాను"

"అదృష్టవంతుణ్ణి. ఆ కౌసల్య అలా చేజారినా, ఇలా మళ్లీ లభించింది"

★ ★ ★

ఆషాఢమాసం ప్రవేశించింది. విదియనాడు చిన్న ఉత్సవం. ఏకాదశినాడు మాత్రం రథోత్సవం. పెద్దెత్తున జరుగుతూంది- పూడిమడకలో.

సారథులు జాలర్లే. కోవెల... సముద్రపు వొడ్డునే. కోవెల పక్కనే రథం. దానిని చక్కగా అలంకరించారు. భక్తులు కోవెలలోకి వెళ్ళి దైవదర్శనం చేసుకుంటున్నారు. రథాన్నే చూస్తూ నిలుచున్నాడు మాధవ్. కలపతో పెద్దరథం. చక్రాలూ పెద్దవి.

"ఏటిబాబూ సూత్తన్నారు? రథంవా? దేముణ్ని జూశారా? "

అంతలోనే కోలాహలం చెలరేగింది. రథంమీద జగన్నాథస్వామినూరేగించబోతున్నట్లుంది. అక్కడందరూ జాలర్లే, గంగాపుత్రులే. చూడబోతే ఇది వారి ఉత్సవంలాగే ఉంది. జగన్నాథుడు వారి దేముడిలాగే ఉన్నాడు- అతను చెప్పినట్లు.

మాధవ్కి వారి ఐకమత్యం కన్నులపండగే అయింది.

అతనికారాత్రి ఆనందంతో హాయిగా నిద్ర పట్టింది.

తియ్యనికలలూ వొచ్చాయి. అప్పటికే

స్లాబ్ పడిన భవనం చక్కగా పూర్తయి అన్ని సౌకర్యాలతోనూ మంచి బడిగా మారినట్లు.

★ ★ ★

చూస్తుండగానే రోజులు గడచిపోతున్నాయి.

వర్షాకాలం వెళ్లిపోయింది. ఎక్కువ ఉప్పెనలూ ఉత్పాతాలూ గాలివానలూ తుఫానులూ పెట్టకుండానూ గంగాపుత్రులని కడగండ్లపాలు చేయకుండానూ భవన నిర్మాణం పూర్తయింది. అవసరమయితే వివాహాలు జరుపుకుందుకు కూడా అనువుగా విశాలమయిన హాలు. స్లాబ్ ముందే వేయబడింది కనుక లోపలి పనులకు వర్షాలాట్టే ఆటంకం కలిగించలేదు.

శీతాకాలం వొచ్చేస్తూంది. రాత్రులు చలి ముదురుతోంది. ఐతే- సముద్రతీరం కనుక మరీ చలిగా ఏమీలేదు. ఇప్పుడు గంగాపుత్రులు పగలంతగా వేటకెళ్లడంలేదు. రాత్రులే వెడుతున్నారు. అదేమిటని అడిగితే-

"చలికాలంలో చేపలు పడేదే తక్కువ" అన్నాడు గంగన్న.

"చేపలకీ చలే కాబోలు" అన్నాడు మాధవ్.

"నీటిగర్భంలో వెచ్చగా ఉండే అవి బయటకు రావు. రాత్రులు మాత్రం కొంచెం నయమే. గుడ్డిలో మెల్ల. అందుకే ఓపికున్న-వారు అర్ధరాత్రి దాటాకెళ్ళి తెల్లారుజామునెళ్లి తెల్లరేసరికి తిరిగొస్తారు. లేదా సాయంత్రం ఐదుకెళ్లి రాత్రి పదకొండుకొస్తారు"

"అన్నయ్యా! మీ బావగారివేళ నిన్ను భోజనానికి పిలవమన్నారు"

"ఏమిటి విశేషం?"

"ఆయనే చెబుతారు" సిగ్గుపడిందామె.

"మరచిపోక వస్తావు కదూ?"

"రాకుండా ఉండడం నా తరమా కౌసల్యా!" వాగ్దానం చేస్తున్నట్లే అన్నాడు. ఆమె కూడా వెళ్ళిపోయింది.

కౌసల్య గర్భవతని అర్థమయింది అతనికి.

అతను ఆనందం పట్టలేకపోతున్నాడు. ఎదురుగా సముద్రం కనిపించింది. దాని హోరు వినిపిస్తోంది.

అతను సముద్రంలోకి దిగాడు. ఇప్పుడతనికెందరున్నా సంతోషం పంచుకుందుకు మాత్రం సముద్రమే. ఏమో...

★ ★ ★

రెండు మూడు పనులు పెట్టుకుని అనకాపల్లి బస్సెక్కాడు మాధవ్. మొదటిది-హోమియోమందులు కొనడం. ఇప్పుడిప్పుడు హోమియో వైద్యానికొస్తున్న పేషంట్ల సంఖ్య పెరిగింది. ఇద్దరు ముగ్గురు రోగులకి వ్యాధులు నయంకావడంతో వాళ్ల ప్రచారం చేసినట్లుంది. మొదట్లో పంచదార గుళిక లనుకున్న హోమియో మాత్రలు కూడా నిజంగా పనిచేసేమందే అన్న నమ్మకం కలిగిందేమో- ఎక్కువగానే వొస్తున్నారు రోగులు. అవసరమయిన మందులు కొనుక్కుని- రెడీమేడ్ షాపులో కౌసల్య కనబోయే సంతానానికి బాబాసూటు తీసుకున్నాడు. కౌసల్యకొక చీర కొన్నాడు. నెహ్రూచౌక్‌కి వొచ్చి మలుపుతిరిగాడు.

మత్స్యకారుల జీవితం క్షణక్షణం గండమే. కాలమనే సముద్రంలో మనిషనే పడవ జీవితమనే ప్రయాణం చేస్తాడు మత్స్యకారుడిగా. సముద్రమంటే చేపలే కావు, కెరటాలూ, వాడిదుడుకులూ... తుఫానులూ, పిడుగులూ తిమింగలాలూ కూడా. ఏ పడవే క్షణంలో బుడుంగుమంటుందో! ఏ గంగాపుత్రుని జీవితం ఏ క్షణాన గంగపాలవుతుందో! అలా అయితే అతని కుటుంబం వీధినపడవలసిందే, అతనూ లేక అతని ఆర్జనా లేక. కనుక వీరికి సామూహిక బీమా పథకం (గ్రూప్ ఇన్సూరెన్స్) లాటిది వర్తిస్తుందేమో తెలుసుకోవాలా వివరాలను కుంటూ జీవితభీమా సంస్థ కార్యాలయానికొచ్చేసరికి-

"సమ్మెలో ఉన్నాం. అసలే నిరుద్యోగం ప్రబలిన యీ దేశంలో కంప్యూటర్లు పెట్టి మా కడుపులు కొట్టడానికి తలపడుతోంది ప్రభుత్వం. మా బతుకులమీద దెబ్బకొట్టబో తున్న ప్రభుత్వ విధానాన్ని వ్యతిరేకిస్తూ మేము- ఉద్యోగులం, జీవితభీమా సంస్థ ఉద్యోగులం- సమ్మె చేస్తున్నాం. పోరాడు తున్నాం. మా న్యాయమయిన పోరాటానికి మీ సహాయసహకారాలూ మద్దతూ యివ్వం డని ప్రజలందరినీ ప్రార్థిస్తున్నాం" అంటూ ఉపన్యాసమిస్తున్నారు. ఉద్యోగ సంఘనాయ కులు కాబోలు. వారి బతుకు బాధ సమం జసమే అనిపించింది. ఇవాళ్టికి పనిజరగదని బస్‌కాంప్లెక్స్‌కి వొచ్చేసరికి బస్ సిద్ధంగా ఉంది బయలుదేరడానికి.

పూడిమడకలో దిగి అప్పారావ్ హోటల్లో భోజనం చేసి సముద్రతీరానికొచ్చేసరికి-

మత్స్యకారులు వేటనుంచి తిరిగొస్తు న్నారు. ఒంటిగంటవుతోంది. ఎండగానే ఉంది. సముద్రమెందుకో దీనరాగాలాలపి స్తోంది. తిరిగి వస్తున్న గంగాపుత్రులల్లంత దూరంనుంచీ నీటిమీద నుంచే కేకలు పెడు తున్నారు. ఆ కేకలు ప్రమాదాన్ని సూచిస్తు న్నాయి.

వారినే గమనిస్తూ ఒడ్డున నిలుచున్న మాధవ్ త్రుళ్ళిపడ్డాడాకేకలకి. ఏం జరి గింది? పిడుగులు పడడానికి వర్షమేలేదే! తపాను సూచన కూడా లేదే! మరేమ యింది? ఎందుకాకేకలు?

నాలుగయిదు తెప్పలే వచ్చాయి ఒడ్డుకి.

"మరపడవ, మరపడవ" కేకలు వేస్తూ జాలారి పేటలోకీ వాడలోకీ పరుగెత్తారు కుర్రాళ్ళు.

మాధవ్‌కేమీ అర్థంకాలేదు. మనసు మాత్రం కీడుశంకిస్తోంది. మరపడవంటే తను ఊహించగలిగిన యంత్ర సహాయంతో పడవకాక తన ఊహకతీతమయిన అర్థమే మయినా ఉంధా గంగాపుత్రుల భాషలో?

అతని వేపు వేగంగా నడిచి అడిగాడు. "మర పడవంటే ఏమిటి? "

"మరపడవంటే మరపడవే. పెద్ద తెప్ప. తెడ్డయ్యక్కర్లేకుండా యంత్రంతో నడుస్తుంది ఆయిలు తాగేస్తూ. మామూలు తెప్పకంటే చాలా దూరం పోగలదు. దూరమంటే లోతులెండి. ఐదారుగురు వెళ్ళొచ్చు ఒక్కో మరపడవమీదా. మరపడవంటే మాలాటి గంగాపుత్రుల ప్రాణం మీదకి దెయ్యమే"

"అదెలా? వాళ్ళలా అరుస్తుంటే మరపడవ నేది ఏ తిమింగిలానికో మీరు పెట్టుకున్న మారు పేరనుకున్నాను. వాళ్లెందుకూ అలా భయపడుతున్నారు? "

"ఎందుకంటే... తిమింగిలమయితే మని షినే తింటుంది. మరపడవయితే మా బతు కులనే తినేస్తుంది. అందుకూ"

మాధవ్ అయోమయంగా చూశాడు. అతని మెదడులో ఏదో సందేహం.

"ఎలా? " అడిగాడు.

"మరపడవ సముద్రంలో చాలా తోతుకి వెళ్లగలదు. ఐదారుగురు వెళ్తారు కనుక చాలా చేపలు పట్టేస్తారు లోతు గంగలో. దానితో అంతలోతుకి వెళ్లలేని మా తెప్పలకి చేపలు మిగలవు. మీదనే... ముందే పట్టే స్తాయి మరపడవలు. అందుచేత మా పొట్ట లెండిపోతాయి వేట పడక. అలా మరపడ వలు మా పాలిట యమకింకరులే"

"ఆ మరపడవలెవరివి? "

సముద్రంవేపు చూస్తూనే జవాబు చెబు తున్నాడతను. "మరెవరికుంటాయి? మారా జులకీ మరీ డబ్బున్నవోళ్లకీ. మా గంగాపు త్రులలోనే డబ్బున్న వాళ్లు తలావెయ్యా వేసుకుని లక్షజేసి ప్రభుత్వసహాయంతో మరపడవ కొన్నారు. ఉన్న డబ్బుచాలదనీ దానిని ఇబ్బడిముబ్బడి చేసేసుకోవాలనీ, మా కడుపులమీదా బతుకులమీదా దెబ్బకొ ట్టాలనీ"

"వాళ్లు మీవాళ్లు కారా? "

"కులానికి మావాళ్లే. కానీ డబ్బుకి మావోళ్లు కారు. మాలోనూ జాలారులూ,

వాడ బల్జీలూ ఉన్నారు. సొసైటీ పెట్టుకుని మరపడవ దెచ్చిన వాళ్లలోనూ జాలర్లూ వాడోళ్లూ ఉన్నారు. ఎక్కడేనా బావకాని వంగతోట దగ్గర వరసకాదని డబ్బు దగ్గర మనా, పరా ఉండదు. అదే లోకంతీరు"

ఒకటి స్పష్టంచేశాయతని మాటలు. మత్స్యకారులు తెగని బట్టేకాక ఆర్థికస్తోమత నిబట్టి కూడా విభజించబడినట్లే. ఆ విభజ నరేఖ చాలా ధృడమయినది కూడా.

వీళ్లక్కడ మాటలాడుకుంటూంటే,

సముద్రంలో, ఒడ్డుకి కొంతదూరంలో మరపడవ. దానిలో ఐదుగురు జాలరులు. వాళ్లు కంగారు పడుతున్నారు. "డ్రయివరూ! మన పడవచుట్టూ తెప్పలు. వాళ్లు కమ్ముకొ స్తున్నారు. మనని చుట్టు ముడుతున్నారు. తప్పించు"

"ఎలా తప్పించేది? ఆళ్లెటూ దారివ్వడం లేదు. వలయం కమ్మేశారు. ఒడ్డుకేసి తప్ప పోనిచ్చేట్టులేరు" అన్నాడు డ్రయివరు.

"వాళ్ళొడ్డుకేసెడితే మనపని సరే"

"అంతకంటె గత్యంతరం కనపడ్డంలేదు. ఇక్కడే ఎదురు తిరిగితే? "

"తెప్పలు పదిహేనిరవైదాకా ఉన్నాయి. ఎంత చచ్చుగా చూసుకున్నా పాతిక ముప్ఫ యిమందుంటారు. మనం జూస్తే ఐదు గురం. ఆళ్లందరికీ మనమేం దీటుగానిలవ గలం? తప్పించు"

"లాబంలేదు. వాళ్లెంట బడుతున్నారు. అడ్డంపడుతున్నారెటెళ్తే అటే"

"మనం వాళ్ల సేతుల్లో సిక్కడిపో యామా? "

"అంతే మరి. చెప్పండేటి సెయ్యాలో. ఎటు నడపాలో. మరపడవచుట్టూ వాళ్ల తెప్పలు మీకుమాత్రం కనపడ్డంలేదేటి? "

"నిజమే. వాళ్లొడ్డుకు తప్ప మరోయేపుకి దారివ్వడంలేదు. ఎనక్కిపోదామన్నా కుద రదు"

మరీమరీ ఆ తెప్పలు మరపడవ దగ్గర కొచ్చేస్తుంటే మార్గాంతరంలేక మరపడవ జాలారి పాలెం తీరంవేపు వేగంగా సాగింది. అయినావాళ్లు వదలలేదు. వెంబడిస్తూనే ఉన్నారు.

మరపడవ వడ్డుకి చేరక తప్పలేదు. అది నీటి అంచును తాకడమేమిటి, దానిలోని వారు ఉరికి పారిపోబోయారు. కానీ-

అప్పటికే అక్కడ పాతికమందికీ పైగా పడవ తెడ్లతోనూ, ఈటెలూ, బరిసెలతోనూ సిద్ధంగా కాచుకుని ఉన్నారు.

మాధవ్ వారిస్తున్నా వినలేదెవరూ. మర పడవమీదకి గెంతారు. పడవలోని వాళ్లని కిందికి లాగారు. అక్కడ చిన్న ఎత్తున యుద్ధమే జరిగింది. అడ్డుకుందుకూ, వారినా పేందుకూ వారి మధ్యకు వెళ్ళిన మాధవ్‌కీ తగిలింది దెబ్బ. అది వారూహించనిది కావ డంతో ఒక్క నిముషం బిత్తరపోయారు. ఆ అదనుచూసుకుని మరపడవవాళ్లు గాయాలు తగిలినా ప్రాణాలు దక్కితే చాలని ఊరివేపు పారిపోయారు పడవనక్కడే వదిలేసి.

మాధవ్‌కి స్పృహ తప్పింది దెబ్బ బుర్ర మీద తగలడంతో. అతన్ని కొందరు దగ్గ రున్న గరటయ్య గుడిసెలోకి మోసుకుపో యారు తాత్కాలిక చికిత్సచేసేందుకు.

ఒడ్డునున్నవారు మరపడవవేపు కసిగా కోపంగా శత్రువువేపులా చూశారు. ఎవరో దానిలో కెక్కి లోపలున్న చేపలన్నీ బయ టకు తెచ్చేశారు. మరెవరో ఆ మరపడవ ఇంజనులోని ఆయిలువి పడవ లోపలంతా గుమ్మరించారు. ఇంకెవరో అప్పటికే గుడ్డ లతో తయారుచేసి ఉంచిన దివిటీలంటించి మరపడవలోకి విసిరారు. ఒకటి రెండు నిముషాలకే-

సుమారు రెండులక్షలు విలువచేసే మర పడవ నిలువునా మండసాగింది.

మత్సరంలా మంటలూ పగలాటి పొగలూ.

"లంకా దహనం"

"నరకాసురుడు"

"మనపాలిటి బెమ్మరాచ్చసి"

"మండిపోతోంది. మాడిపోతోంది. మస వుతోంది"

"అందరూ చూడ్డానికి రండొహో!"

విజేతల్లా వారంతా మండుతున్న మరప డవచుట్టూ చేరి ఆనందంగా అరుపులూ, గెంతులూ, నాట్యాలూ.

కొంచెంసేపటికే మరపడవ మరెందుకూ పనికిరానంత దగ్ధమైపోయింది. పొగలు మాత్రం చెలరేగుతూనే ఉన్నాయి.

ఔను పొగలూ, పగలూ ఒకంతటఆగవు.

"నాకేమీ కాలేదు. దెబ్బ పెద్దదేమీ కాదు. చిన్నదే. సున్నితమయిన చోట తగలడంతో తెలివితప్పి రక్తంచిందిందంతే. పదండి అక్క డికి తొందరగా వెళ్లాలి" అంటూ లేచాడు మాధవ్.

"వొద్దు బాబూ! మీరొచ్చి ఏం చేస్తారు? "

"మీకు తెలియదు. నాకేమీ కాలేదని చెబుతున్నాగా? నన్ను వెళ్లనివ్వండి... నేను డాక్టర్ని నాకంటే మీకు తెలుసా? "

తప్పనిసరయి-అతన్ని ఇద్దరు పట్టుకుని నడిపించారక్కడికి. అప్పటికే పూర్తిగా భస్మీప టలమయిపోయింది మరపడవ పెద్ద మసి బొగ్గులా మిగిలి. పొగలు చిమ్ముతున్న దానిని చూసేసరికి భయంతో వొణికిపోయాడు మాధవ్. జరిగినదేమిటో సులభంగానే అర్థమైపోయిందతనికి. అతను వొణికిపోయాడు.

ఇది ఆరంభమా, అంతమా? ఎంత తొందరపడ్డారు వాళ్లు! అమాయకులు, ఆలో చనారహితులు.

"పిరికిపందల్లా పారిపోయారు కానీ నరికి పోగులు పెడుదుము. మా పీకలమీదకి మర పడవ దెస్తారా? " అంటున్నాడక్కడివాడు.

మాధవ్ ఆలోచనలోపడ్డాడు.

అలా ఆలోచిస్తూ, అలా పదిపదిహేను నిముషాలు వంటరిగా కూర్చున్నాడో లేదో చంద్రయ్య వచ్చాడు. "దండాలు బాబూ!" అతని కంఠం నిరుత్సాహంగా ఉంది.

"ఏమిటలా ఉన్నావు? "

"ఏం చెప్పమంటారు"

"నిజమేలే. నీ బాధ నేనర్థంచేసుకోగలను. నీ సాటివారందరూ ఒకరో యిద్దరో మను మలూ మనుమరాండ్ర నెత్తుకుని మురిసిపో తున్నారు. నువ్వేమో, యింకా, చుక్కకి పెళ్లే చెయ్యక"

"మీరు సరిగానే కనిపెట్టారు సామీ! కాని నా కూతురికి నేను పెళ్ళిచెయ్యక పోడమో, చెయ్యలేకపోడమూ కాదు. అదే వొద్దనే స్తుంది. మా జాలార్లలో బలవంతప్పెళ్ళిళ్లుం డవు బాబూ. నేనేమయినా కట్నం ఇవ్వ లేనా? కర్చుపెట్టి కళ్యాణం చెయ్యలేనా? చుక్క ఊ అనాలే కాని"

"ఆమె మనసులో ఏముందో తెలుసుకు న్నావా చంద్రయ్యా? "

సరిగ్గా ఆ క్షణంలో-

"స్వామీ! స్వామీ" అంటూ పరుగెత్తుకొ చ్చాడు విశ్వేశ్వర్రావ్. "ఎవరు బాబూ మీమీదే కర్రెత్తింది? చెప్పండి ఆతన్ని నరికి పోగులెడతాను"

"మాటల్లో పడి వచ్చినపని మరిచాను స్వామీ! నన్ను చమించండి సామీ! నావల్ల పొరపాటే జరిగింది. నన్ను శిచ్చించండి సామీ!" భోరుమన్నాడు చంద్రయ్య.

"నువ్వేం చేశావ్? " ఆశ్చర్యంగా చూశాడు మాధవ్.

"అవతలోడిమీదకెత్తిన కర్ర మజ్యలోకి మీరొచ్చారటాత్తుగా. ముసిలాణ్ని. ఊపు కాసుకోలేకపోయాను. శత్రువు నెత్తిమీద పడవలసిన కర్ర నా స్వామినెత్తిన జార్చిన పాపిని సామీ! మీ రక్తం చిందించిన రాచ్చ సుణ్ని సామీ!"

"ఎంత మంచిపని చేశావు చంద్రయ్యా! ఎంత మేలు చేశావు"

"అదేటి బాబూ! మీరు... మీరూ... చచ్చి నపాముని మరింత చావగొడతారా!" ఏడుస్తూ, "నన్నీ కర్రతో బాదేసి శిచ్చించి కసి

తీర్చుకొండి సామీ!"

"లేదు చంద్రయ్యా! నీమీద నాకు కోపమూ, కసీనా! నిజంగా నీవలన ఎంత ఉపకారం జరిగిందో! నా ఒంటిమీద దెబ్బ పడి నా రక్తమే చిందకపోతే- అప్పుడక్కడేం జరిగుండేది? "

"ఆళ్లయిదుగురూ అంతమయ్యేవారు. మాలోనూ ఒకరో, ఇద్దరో..."

"ఔనా! కానీ నా రక్తం చుక్కలు కాసినీ ఆరేడు ప్రాణాలనాపలేదూ? నా రక్తాన్కి ఎంత విలువుందో తెలియజేయలేదూ? "

"బాబూ!" ఏడిచేశాడు చంద్రయ్య- అక్కడే కూలబడి.

"విశ్వేశ్వర్రావ్! నాకేమీ కాలేదు. జరిగినది వదిలేయ్. నీ విశేషాలు చెప్పు"

"రాష్ట్రస్థాయి పరుగు, లాంగ్‌జంప్‌ల పోటీలకెళ్లాను కదండీ. కప్పులు గెలుచుకొచ్చాను. ముందు మీకే చూపించాలని" అంటూ సంచీ లోంచి వాటిని తీసి మాధవ్ ముందుంచాడు. సాయంత్రపుటెండలో వెండిపూత కల ఆ కప్పులు ధగధగ మెరిసిపోతున్నాయి.

"ఎంత పెద్ద యెండికప్పులు" మెచ్చుకోలుగానూ, ఆశ్చర్యంగానూ చూశాడు చంద్రయ్య.

"మన విశ్వేశ్వర్రావంటే ఏమిటనుకున్నావు చంద్రయ్యా! రాష్ట్రంలో అంటే ఆరుకోట్ల పైచిలుకు జనాభాలో అందరికంటే ముందు పరుగెత్తగలవాడూ, ఎక్కువ దూరం గెంతకలవాడునూ. ఈతని ప్రతిభకి మెచ్చి తొందరలోనే ప్రభుత్వం ఇతనికి మంచి ఉద్యోగం ఇచ్చినా యివ్వవచ్చు"

"ఫొటోలు సార్" అంటూ ఓ కవరందించాడు విశ్వేశ్వర్రావ్.

పరుగెడుతూంటే, జంప్ చేస్తూంటే, బహుమతులందుకుంటూంటే వివిధ సందర్భాలలో తీసిన కలర్ ఫొటోలు చాలా చక్కగా ఉన్నాయి. తను చూసి చంద్రయ్య కందించాడు మాధవ్.

"విశ్వేశ్వర్రావ్ ఇంత గొప్పవాడివి ఆటలలో. కులవృత్తి చక్కగా చేస్తావు. ఇంకా పెళ్ళి చేసుకోలేదేం? ఆడపిల్లలూ వాళ్ళూ ఊరుకున్నారా? " అడిగాడు మాధవ్.

"వెంటపడుతూనే ఉన్నారండి. కానీ నా మనసులో ఓ అమ్మాయుందండి. కుదిరితే ఆమెను చేసుకోడం. లేకపోతే జీవితానికి పెళ్లే లేదంతేనండి"

"అయ్యో! అదేంమాట? నీలాగ అన్నివిధాలా యోగ్యుడయిన అబ్బాయి పెళ్లికాకుండా ఉండిపోతే ఓ అమ్మాయి నష్టపోతుందే. మంచివాడివి, ప్రతిభాసంపన్నుడివి చక్కగా వేటాడగలవాడివి. నిన్నెందుకు కాదంటుంది ఏ అమ్మాయయినా? "

"అమ్మాయికిష్టమేనండి. ఎటొచ్చీ మా తెగే వేరు. వాళ్ళు జాలర్లు... మేం వాడోళ్ళం"

"ఏమిటయ్యా... దేశనాయకులు కులమత విబేధాలుండకూడదని మొరపెట్టుకుంటుంటే నువ్వేమో ఇంకా తెగలంటూ కూర్చుంటావేం? నీ ఆటలకీ, చదువుకీ అడ్డురాని తెగ, ప్రేమకడ్డురాని తెగ పెళ్ళికెందుకడ్డు రావాలీ? "

"మాకుకాదండి అడ్డొస్తున్నది. ఆమె పెద్దలకీ, నా పెద్దలకీనండి"

"దురదృష్టం... ఆమె తండ్రిది. మీలో నీలాటల్లుడు దొరకడం ఎంత ఘనం. తెగ పేరుతో ప్రేమనికాదని మనసులనీ, మనుషలనీ విడదీయడం అన్యాయమేకాదు... అమానుషం కూడా. ఆ... నువ్వెళ్ళు. నేరుగా బస్ దిగి నా దగ్గరకే వచ్చేసినట్లున్నావు. విశ్రాంతి తీసుకో ఇంటికెళ్ళి"

"మీకు దెబ్బ తగిలిందని విన్నాక క్షణం ఉండలేకపోయానండి మిమ్మల్ని చూసి మాట్లాడేవరకూ. నన్నింతవాడిని చేసింది మీరేకదా"

"అది కేవలం నీ అభిమానం. నేనొట్టి నిమిత్తమాత్రుణ్ణి"

విశ్వేశ్వర్రావు వెళ్ళిపోయాడు.

"చంద్రయ్యా..." మెల్లగా పిలిచాడు మాధవ్.

"ఏటి బాబూ? "

"పెద్దవాడివి. అన్నీ తెలిసినవాడివి. ఇవాళ జరిగింది ఇక్కడితో ఆగుతుందం టావా? "

"ఏమో బవిస్యెత్తువరు సెప్పగలరు? "

నిజమే భవిష్యత్తెవరూ కచ్చితంగా చెప్ప లేరు. కాలపు పొరలని ముందుగా ఎవరూ తొలగించి చూడలేరు లోపలేముందో. కానీ కాలం కూడా ఎప్పుడూ ఊహాతీతంగా మాత్రమే ఉండదు. చాలా సందర్భాలలో మనిషి ఆలోచనకీ, మేధస్సుకీ... తర్కానికీ, హేతువుకీ అందుతూనే ఉంటుంది.

"ఒక్కమాట... నాకు తెలియకడుగు తాను. పెద్దవాడివి కనుక నీవు చెప్పగలవని నా ఆశ. చూడు... గంగాపుత్రులలో రెండు తెగలున్నాయి"

"జాలర్లు... వాడోళ్ళు"

"వాళ్ళలో మళ్ళీ మరో విభజనుంది. డబ్బు కలవాడూ, లేనివాడూ. ఔనా? "

"నిజమే"

"ఈ వర్గపోరాటం, కలవారికీ, లేనివారికీ మధ్య సంఘర్షణ, చారిత్రాత్మకమే కాదు వర్త మాన ప్రపంచ సత్యమూనూ చంద్రయ్యా. మరపడవ యజమానులలో జాలరి, వాడ రెండు తెగలవారూ ఉన్నట్లే. ఆ పడవ యజమానులు కానివారిలోనూ ఇరు తెగల వారూ ఉన్నారుకదా. రేపు ఈ విషయం మీద మీరందరూ ప్రతిపక్షులు కావలసి వస్తే..."

"తెగని బట్టి కాక ఆర్థికంగానే విడిపోతాం"

"అంటే... తెగకంటే కూడా డబ్బే బలమ యిన శక్తి అన్నమాట"

కాదనలేకపోయాడు చంద్రయ్య. ఔననీ అనలేకపోయాడు. అక్కడినుంచి వెళ్ళిపో యాడు భారంగానూ, ఓటమి చెందినవాడి లాగానూ మెల్లగా అడుగులు వేసుకుంటూ.

చీకటి పడుతోందప్పటికే. సముద్రపు హోరులో లీలగా శివరంజని రాగం.

మాధవ్ తిన్నగా నాలుగూళ్ళ పిలగోడి దగ్గ రకు వెళ్ళాడు. "జరిగిన దురదృష్టకర సంఘ టన మీకు తెలుసనుకుంటాను"

"విన్నాను" అన్నాడతను విస్కీ సీసా దాచేస్తూ.

"ఇది ఇక్కడితో ఆపగలిగితే చాలామం చిది. మీకు జ్ఞాపకముండే ఉంటుంది. కొన్ని నెలలకిందట కలరా వచ్చింది మత్స్యవా డలో. మొదట ఎవరూ పట్టించుకోలేదు వైద్యశాఖాధికారులు. ప్రెసిడెంటు డి.యం. వో.కి తంతి పంపి వారొచ్చేసరికి జరగవల సిన ఘోరం చాలావరకూ జరిగిపోయింది. ఆ మహమ్మారి పదహారుమందిని పొట్టన పెట్టుకుంది. వారిలో ఆరుగురు యువకులే" బాధగా అన్నాడు మాధవ్ గాద్గదిక కంఠంతో.

"తప్పేదు. వాళ్ళ గుడిసెలు గలీజు. శుభ్రతే ఉండదు. ఏదిపడితే అది తినే స్తారు. చదువూసంధ్యా లేనివాళ్ళింకెలా ఉంటార్లెండి"

"జరిగింది ప్రత్యక్షంగా చూడడం. ఆపైన కొందరు పెద్దలు పూనుకుని వారికి శుభ్రత బోధించడం, వీటిమూలంగా వారి పద్ధతుల్లో కొంత మార్పు వస్తోంది. నేను గమనిస్తు న్నాను. చూడండి... తగవులు తీర్చినపుడు పిలగోళ్ళు వసూలు చేస్తే తప్పు... జుల్మానా సొమ్ము లెక్కగా పెద్ద మనుషుల దగ్గరుంచు తారు ప్రజాహిత కార్యక్రమాలకు వినియో గించేందుకు"

"ఔను... కానీ సొమ్ము అమ్మోరి పండగ లకీ, అలాంటి సందర్భాలకి" విసుక్కున్నాడు నాలుగూళ్ళ పిలగోడు. "మీరేం పనిమీదొ చ్చారో సూటిగా చెప్పండి"

అతనికి విస్కీకి వేళయిపోతోంది మరి.

"నేనధికారంగా అడగడంలేదు. అర్థిస్తున్నా నంతే... నష్టం ఎవరిదయినా నష్టమే. ఆ మరపడవ యజమానులకు జుల్మానా సొమ్ములోంచి పరిహారం చెల్లించేసి తగవు మాఫీ చేయండి. అసలే కల్లోలమయిన మత్స్యకారుల బతుకులు మరింత కడగండ్ల

పాలవకుండా కాపాడండి. ఇదే నా మనవి"

"కుదర్దు..." కచ్చితంగా చెప్పేశాడు నాలు గూళ్ళ పిలగాడు. "జుల్మానాల సొమ్ము పరిహారాలకేమూలకీ చాలదు. ఆ మరపడవలో మనోళ్ళ పెట్టుబడి లచ్చపైనే. అదీకాక ఈ తగవు ఉన్నోళ్ళకీ, లేనోళ్ళకీ మధ్య. ఇదంత త్వరగానూ, సులభంగానూ చల్లారదు. జుల్మానాల సొమ్ము అమ్మోరి పండగలకి"

"అమ్మవారికంటే మనుషులు ముఖ్యం కాదా? వారి బతుకులు ముఖ్యంకావా? "

"నిజం చెప్పాలంటే... కావు"

నివ్వెరపోయాడు మాధవ్. అతనికి నోటి మాటరాలేదు.

ఇది భక్తా? మూర్ఖత్వమా?

"అంతేకాదు. ఈ తగువాపే శక్తి నాకూ లేదు, మీకూలేదు. ఎవరికీలేదు. ఇప్పటికే కొంపలంటుకుని రాజుకుంటున్నాయి. ఈ అగ్గి ఎవరిని దహిస్తుందో? ఎందరిని కాలుస్తుందో? " అని ముఖం తిప్పేసుకున్నాడతను.

ఎంత ప్రయత్నించినా కన్నీరాగడంలేదతనికి. అతను అమ్మలాటి గంగదగ్గరకొచ్చేశాడసంకల్పితంగానూ, అప్రయత్నంగానూ. ఆనందానికేకాదు ఆపదకీ అమ్మలాటిదే అంబుధి.

దూరంగా జాలారిపాలెంలో, వాడలో...

గొల్లున గోల. నడిరేయి నిశ్శబ్దం తుళ్ళిపడుతూ భంగమయింది. మాధవ్ ఒక్క ఉదుటున లేచి అటు పరుగెత్తాడు.

ఆడవాళ్ళ ఏడుపులు, పిల్లల అభినందనలు. మగవారి తొందరమాటలు... అర్థం కాకుండా అసంపూర్తిగా వున్నాయా మాటలు.

మనుషులు పరుగులు తీస్తున్నారు కటిక చీకటిలో గుంపులుగా.

ముందేముందో చూసుకోకుండా ఉరుకులూ, పరుగులూ.

పరుగెత్తుతున్నవారందరూ పురుషులే, పెద్దవారే.

ఎక్కడికి వారి పరుగు? ఎందుకు?

మాధవ్‌కేమీ అర్థంకావడంలేదు. ఆగేవారెవరు? అతనికి చెప్పేవారెవరు?

మరపడవలో సంఘసభ్యుల మొత్తాల పెట్టుబడేకాదు, సబ్సిడీ రూపంలో అయితేనేం మరోరూపంలో అయితేనేం ప్రభుత్వ సొమ్ము కలసి ఉంటుంది. అందుకే రెండు లక్షల పైచిలుకు ఖరీదు చేసే మరపడవ సంఘ సభ్యులకి సుమారు లక్షకే అందిరావడం.

మరపడవని నాశనం చేయడమంటే ప్రభుత్వ ఆస్తినో సొమ్మునో నాశనం చేయడమే. కనుక అది ప్రభుత్వద్రోహం. తీవ్రమయిన నేరం. కారణాలేమయినా మరపడవను /మరెందుకూ కొరగాకుండా కాల్చిన నేరస్తులను పట్టుకుందుకు "ఏ చనంలో అయినా పోలీసులు రావచ్చు ఆ చేతకానెదవలు మననేవీ జెయ్యలేక పోయి పోలీసులకీ పిషరీసోళ్ళకీ మొరెట్టుకున్నారట"

అందుకని పోలీసులు దిగబోతున్నారిక్కడికి!

అందుకనే వీళ్లూ వాళ్ల కందరాదని పారిపోతున్నారు.

"ఎన్నాళ్లు దాగుంటారలా? "

"పోలీసులూళ్లో ఎన్నాళ్లుంటే అన్నాళ్లూ. ఈ వూరికెలాగూ స్టేషనులేదు. పై వూరి నుంచొచ్చిన పోలీసులు ఎన్నాళ్లుండగలరిక్కడ? " ధీమాగా చెప్పాడా వృద్ధుడు.

★ ★ ★

మూడు రోజులకి వెళ్లారు పోలీసులు.

ఆ మూడురోజులూ మత్స్యకారుల గుడిసెలలో పొయ్యిలో పిల్లిలేవలేదు. నాలుగోరోజుకి ఖిలఖిలమంటూ వచ్చారు మత్స్యకారులు నలుమూలలనుంచీ. వస్తూనే వేటకెళ్లి ఏ చేపలు దొరికితే వాటినే పట్టుకొచ్చి వంట జేయించుకున్నారు. దానితో వారి జీవనవిధానం మళ్ళీ ప్రవృత్తిలో పడినట్లయింది. ఊరూ జాలరివాడా కలకలలాడడం మొదలయ్యాయి.

రోజులు మామూలుగా గడుస్తున్నట్లు కని పిస్తున్నా మత్స్యకారులమీదా వారి వాడల మీదా అదృశ్యమూ అతిభయంకరమూ అయిన శక్తేదో వేలాడుతున్నట్లే ఉంది. ఎవరూ మునుపటిలా ఉండలేకపోతు న్నారు. ఎవరి ముఖం చూసినా భయమూ బతుకూ. గాలిలో ఏవో గడుసుదెయ్యాలు బెదిరిస్తున్నట్లే. ఇంతకంటే దయనీయమ యిన పరిస్థితేముంటుంది? ఏదో క్షణంలో ఏదేదో జరుగుతుందని ఆందోళన. అదే క్షణమో ఉపద్రవం ఎలా ముంచుకొస్తుందో తెలియక నీడని చూసే జడుసుకుంటూ, నిద్రకూ మెలకువకూ భేదం తెలియని, తిన్నానోటికి పోని స్థితిలో ఎవరు మాత్రం ఎన్నిరోజులు బతకగలరు? పైపైన అన్నీ యథావిధిగానే సాగుతున్నయ్. బడులూ, ఆటలూ, పాటలూ, సంగీతాలూ, ఆరోగ్యపా ఠాలూ, లెక్కలూ, అన్నీ సాగుతున్నాయి. కానీ మామూలుగా కాదు. పైకి గోచరించని ఏదో మార్పుతో.

సముద్రం తుపాను ముందర ప్రశాంతంగా ఉంటుందట. ఇప్పుడది నిజం గానే మౌనరాగాలే ఆలపిస్తోంది. ఆ మౌనా నికి భాష్యం చెప్పగల మనిషే కరవ య్యాడు.

"మీరు నాలుగూళ్ల పిలగాడి దగ్గర కెళ్లార టగా మాకు చెప్పకుండా?"

"ఔను"

"లాభముండదు స్వామీ పిలగాళ్లకీ మర పడవలలో వాటా ఉంది. వాళ్లూ ఆ సంఘంలో సభ్యులే"

ఆ నిజానికి మాధవ్ తుళ్ళిపడ్డాడు "పోనీ మీరందరూ కూడా సంఘంలో సభ్యులై- మర పడవలతో భాగస్వామ్యులయితే?"

'పోరు నిలపాలని మీరాలోచించడం బాగానే ఉంది కానీ క్షమించండి బాబూ!" అది జరిగేదికాదు"

"ఎందుకని?"

"మొదట మేమంతా వెయ్యేసి రూపాయల చొప్పున కట్టలేం"

"కొంతమందికి నేను సాయంచేస్తాను. నా దగ్గర డబ్బుంది"

"బాబూ! మీకు మాసంగతి పూర్తిగా తెలి యదు. బయటనుంచి సాయమొస్తుందంటే అందరమూ బీదరుపులే అరుస్తాం. ఎందరి కెన్ని వేలని మీరివ్వగలరు? మరోమాట. మాతత్వం-అప్పు తీర్చే తత్వంకాదు. వసూ ళ్లలో మేమెంత పట్టుదలగా ఉంటామో చేసి నప్పుతీర్చకుండా ఉండేందుకన్ని ఎత్తులు వేస్తాం. ఆమధ్యేమయింది, అగ్నిప్రమాదం సంభవించినప్పుడు?"

వాడలో ప్రమాదవశాత్తూ ఇళ్లంటుకు న్నాయి. అందరూ చూస్తూ ఊరుకుంటారే కానీ ఆర్పే ప్రయత్నం చేయరే. తను ముందుకురకబోతే ఆ ఇంటి యజమాని అడ్డంపడి "కాలనీండి బాబూ. వెళ్ళి ఆర్ప కండి. పూర్తిగా కాలిపోనీండి. లేకపోతే మాకు గవర్నమెంటు సాయం అందదు. ఇల్లు కాలినట్లు ప్రెసిడెంటు లెక్కలో రాయడు. వచ్చే డబ్బుపోతుంది" అని బతి మాలాడు.

"అదేమిటి? వాళ్ళిచ్చే దానికన్నా మీకు నష్టం ఎక్కువకాదూ?" ఆశ్చర్యపోయాడు.

"ఫర్లేదు. అందరికీ డబ్బులంది నాకందక పోతే చిన్నతనం"

ఇదీ వాళ్ల అమాయకత్వం. ఎవరెవరో వస్తారు. ఇది చేయిస్తామది చేయిస్తామని కాగితాలమీధ వేలిముద్రలో సంతకాలో వేయించుకుని తలా ఐదో పదో చొప్పున పట్టుకుపోతారు. మరిఫికరుండదు. కొందరికీ వంచనే జీవనోపాధయిపోయింది. వాళ్లు పై వాళ్లూ కారు పైనుంచి వచ్చిన వారూ కారు. వీరిలోనివారే.

అక్షరాలలవడినా ఆలోచనా విధానమూ అమాయకత్వమూ మారలేదింకా. వీళ్లని మార్చవలసిందింకా చాలానే ఉంది.

"ఒకవేళ అందరమూ డబ్బుకట్టినా అంద రికీ సరిపడన్ని మరపడవలు ప్రభుత్వం

ఇవ్వదు. ఇవ్వలేదు. దానికీ మరపడవ ఒక్కంటికీ లక్ష పైచిలుకో పెట్టుబడవుతుం దిగా. అన్ని పడవలు అసాధ్యమే"

నిజమే అనిపించింది మాధవ్‌కి. మరి యీ మరా, మనుషుల పోరాటానికంతమె ప్పుడు?

"ఈ రావణాసురుడి కాష్టం యిలా కాలుతూండడమే. మేం బతికినన్నాల్లూ మా బతుకులు సాగాలంటే యీ పోరాటం తప్పదు"

ఇక్కడ తెప్పలకీ మరపడవలకీ పోరాటం అనివార్యమే. వీరు మరలితే భృతిపోతుంది. వారు మరలితే లాభాలు పోతాయి. కనుక వీరూ మరలరు, వారూ మరలరు. ఇది పరిష్కారంలేని సమస్యేనా! ఎన్నటికీ యింతేనా? తీవ్రంగా ఆలోచనలో మునిగాడు మాధవ్.



"ఎనిమిదో పదో మరపడవలతో వాళ్లు ఎల్లుండో ఎప్పుడో వేటకెళ్లబోతున్నారుట. ఎక్కడినుంచో మరపడవలని తెప్పించారుట" గుప్పుమంది వార్త.

మత్స్యకారులలో అలజడి రేగింది. ఆందోళన ప్రారంభమయింది.

"పదివరకూ మరపడవలంటే వాటిలో యాభై మందివరకూ ఉంటారు. మనం దెబ్బలాటకు దిగుతామని ముందు ఊహిస్తారు కనుక వాళ్లూ సిద్ధంగానే ఉంటారు. మునపటిలా మనదే పైచెయ్యవుతుందో లేక వాళ్లదే ఔతుందో" సందేహిస్తున్నారు కొందరు.

పరిస్థితిని గమనించి సభ పెట్టమని చెప్పాడు మాధవ్.

అది ప్రత్యేకమయిన సమావేశమే చాలా విధాల.

మాధవ్ ముఖం నిర్మలంగా లేదు. ఆత్రుత, ఆందోళన, భయం. ఎన్నెన్నో భావాల, బాధల నీడలు పడుతూ అప్రశాంతంగా ఉంది.

సహజమే. ఏ మనుషులంటే అతనికి ప్రేమాభిమానాలో వారు తీవ్రమయిన ఆపదలో చిక్కుకోబోతున్నారు. వాళ్ల జీవితాలూ, బతుకులూ అస్తవ్యస్తమూ, అయోమయమూ కాబోయే చిక్కు ఎదురౌతుంది.

తనకొక మార్గం స్ఫురించింది. కాని... అది సమంజసమా? సమంజసమేనేమో. అప్రియమయిన సత్యంకంటె ప్రియమో, హితమో చేకూర్చే అసత్యమే నయమనలేదూ పెద్దలే?

అందరూ చేరారు సముద్రపు ఒడ్డుకి.

"స్వామీ! తమరేమో చెబుతానన్నారుట?"

"ఔను... కూర్చోండి" అన్నాడు. దూరంగా బడి భవనం. ఇప్పుడక్కడ విద్యనుంచి క్రీడల వరకూ ఎన్నో కార్యక్రమాలు చక్కగా జరుగుతున్నాయి. ఎట్టి పరిస్థితులలోనూ అవి ఆగకూడదు.

"మిమ్మల్ని విడదీయడం నాకెంతమాత్రమూ యిష్టమయిన పనికాదు. కాని దైవేచ్ఛ మరోలా ఉంది"

"ఏమిటి బాబూ తమరనేది?"

"నిన్నరాత్రి దీక్షలోకి వెళ్లాను. నా దైవాన్ని శరణు వేడాను. ఈ సజ్జనులను మరపడవలు పీడించబోతున్నాయి. దీనినుంచి బయటపడేమార్గమేమిటి దైవమా అని వేడుకున్నాను"

అందరూ ఆశ్చర్యంగానూ, ఆనందగానూ చూశారతనివేపు. "దేముడేం చెప్పాడు?"

"ఒక షరతుమీద కాపాడతానన్నాడు"

"ఏమిటి స్వామీ అది?"

"ఉన్నవారూ, లేనివారూ అనే విభజన అనివార్యం. కాని లేనివారిలోనే మళ్ళీ జాలరులూ వాడవారూ అనే విభజన అనవసరం. జాలరులూ వాడవారూ అనే తారతమ్యం విడచి వారుభయులూ ఏకమయితే- నేను వారి పక్షం వహించి అంతిమవిజయం చేకూర్చుతాను అన్నాడు భగవంతుడు. ఇప్పుడు ఆలోచించవలసింది మీరే. మీ రెండు తెగలూ ఏకమైతే విజయం మీదే ఔతుంది. మీ పిల్లలకి నిశ్చితమైన భవిష్యత్తు, బడి, ఆటలు, పాటల కార్యక్రమాలు నిరాటంకంగా సాగడం, మీ సుఖ సౌఖ్యాలు, అన్నీ మీ నిర్ణయంమీదే ఆధారపడుంటాయి"

వాళ్ళలోవారు తర్జన భర్జనలుపడ్డారు. చివరికిద్దరు పిలగాళ్ళు ముందుకొచ్చి-

"ఈ ముప్పు తప్పుతుందంటే మావాళ్ళు దేనికయినా సిద్ధమే"

"మావాళ్ళూ అదే మాటంటున్నారు. దేముడే చెప్పాక కాదనేందుకేముంది? "

మాధవ్ ముఖం విప్పారింది. జాలరి, వాడబల్జీ శాఖలు ఒకటి కావడం! నమ్మశక్యం కాలేదతనికి కొన్ని క్షణాలపాటు.

"ఆపదలోనే ఆత్మీయతలు బయటపడతాయన్నది మీరు రుజువుచేశారు. ఎప్పుడో ఎందుకో వేరయినా మీరంతా ఒకటే. ఇదే న్యాయం, సత్యం. మీరంతా ఒకటయినందుకు చాలా ఆనందంగా ఉంది నాకు. నేను భగవంతుడికిచ్చిన మాటను నిలబెట్టారు. మీకెంతో కృతజ్ఞుడిని" అంటూ కళ్లనిండా ఆనందబాష్పాలతో చేతులెత్తి దణ్ణంపెట్టాడు మాధవ్.

"మంచివారే! మీరు మాకు దణ్ణంపెట్టడమేమిటి! మీరు చేసేదంతా మాకోసమే, మా మేలు కోసమేకదా"

"ఆ మాట చాలు. చూడండి. కొందరు మనుషులు దేముడి నొకపట్టాన నమ్మరు, నిదర్శనం చూపించేవరకూ"

"ఔను"

"అలాగే మనమూ, మనం మారామని, మన మనసులు మారాయని... ఒక రుజువు చూపించగలిగితే బాగుంటుంది"

"నిజమే బాబూ. నిజమే స్వామి! మీ మాట సమంజసమే"

"అందుకేంజేస్తే బాగుంటుందో మీరే చెప్పండి"

"మీరందరూ మీ విభేదాలను పూర్తిగా విస్మరించినట్లేగా? "

"నిస్సందేహంగా"

"నాగరకులలోనూ కులమత భేదాలు స్వల్పంకావు. మీరు పైకి ఎన్ని కబుర్లు చెప్పినా వివాహవిషయం వొచ్చేసరికి బయటపెడతారు తమ నిజస్వభావాన్ని. అంటే వివాహమే రెండు వర్గాలు నిజంగా కలిశాయా లేదా అన్నదానికి నిజమైన నిండైన నిదర్శనమని భావించవచ్చు"

"ఔను స్వామీ! ఎంతటివారూ అక్కడే తేలిపోతారు"

"మనం అలాటి తేలిక మనుషులం కాదని దేముడికి నమ్మకంకలిగేలా నిదర్శనం చూపాలంటే, జాలరి, వాడలమధ్య ఒక వివాహం జరగాలి ప్రారంభంగా" ఏమంటారన్నట్లు చూశాడు మాధవ్.

జాలరి, వాడోళ్ల మధ్య వివాహసంబంధం! కనీవినీ ఎరుగనిదది. అందుకే అక్కడ సంచలనం రేగింది. మాధవ్ ప్రేక్షకుడిలా మిగిలిపోయాడు వారిని గమనిస్తూ.

చాలాసేపే లజుగుజులు పడ్డారు వాళ్లు. చివరికి "అలాగే స్వామీ!" అన్నారు.

"చంద్రయ్యా! నీకూ సమ్మతమేనా ఈ ప్రతిపాదన? "

"నలుగురి మేలు కోసం, దేముడి మాట కోసం, తల వంచే మనిషినే బాబూ!"

"సాంబశివా! నీ మాటేమిటి? "

"నేనూ అందరిమాటే ఆడతాను స్వామీ!"

మాధవ్ లేచి నిలబడ్డాడు "ఒక్కసారి అందరూ నా మాటలు శ్రద్ధగా వినండి. వివాహానికి రెండు మనసులు కలవడమే తప్ప, కులం, కట్నం, హోదా, ఇలాటివి




ముఖ్యంకాదు"

"సత్యం పలికారు"

"చుక్క... విశ్వేశ్వరరావుల మనసులు కలిసినా మనువు కుదిరేందుకు వారి తెగల డ్డుపడ్డాయి. ఒకరు జాలరి కుటుంబంకాగా మరొకరు వాడబల్జీ. అందుకని వారు వివాహమే మానుకోదల్చుకున్నారు, మనసు కలసిన వారిని తప్ప మరొకరిని మనువాడనిచ్ఛగించక. ఔను కదా? "

"అంతే బాబూ" అంది చుక్క ధైర్యంగా ముందుకొచ్చి

"ఔను స్వామీ" అన్నాడు విశ్వేశ్వర్రావు కూడా.

"దేముడికి ప్రేమంటే యిష్టం. అందుకే ప్రేమే దైవం అన్నారు. ప్రేమికులయిన వీరిరువురికీ వివాహం జరపడంద్వారా మనం భగవంతునికి ప్రీతి కలిగించగలమని నా అభిప్రాయం. చంద్రయ్యకి విశ్వేశ్వర్రావు కంటే మంచి అల్లుడు కానీ, సాంబశివానికి చుక్కకంటె చక్కని కోడలు కానీ లభించడం కష్టమే అని నా ఉద్దేశం"

"ని...జ...మే..." అన్నాడు చంద్రయ్య.

"ఔ...ను..." అన్నాడు సాంబశివం.

"శుభస్య శీఘ్రమన్నారు మీవంటి పెద్దలే. మంచి పనిని వీలయినంత తొందరగా చేయడం మంచిది"

"రేపెలాగూ అమ్మోరి రోజే. రేపే జరిపించేద్దాం" అన్నాడు చంద్రయ్య. నలుగురు పెద్దలూ సై అంటే సై అన్నారు. అందరూ ఏకమై లగ్నం జరిపించేద్దామని నిశ్చయించారు.

మాధవ్ మనసు సంతోషతరంగిణే అయింది. వారిలో జాలర్లు, వాడ బల్జీల మధ్య పెద్దల అంగీకారంతో మనువు జరగడం యిదే ఓం ప్రథమం. ఈ కులాంతర వివాహం నిజంగా విప్లవమే. సంఘం శ్రేయస్సుకోరి, సాటివారి మేలుకోరి వీరు ఎంత విశాలహృదయంతో ప్రవర్తిస్తున్నారో! ఇవాళ పెళ్ళి మాటలు, రేపు పెళ్ళి! ఇంత తక్కువ వ్యవధిలో వివాహం జరగడం కూడా వీరిలోనే సాధ్యమేమో! కట్నకానుకల బేరసారాలు లేవు కనుక యీ సమాజంలో వివాహమనేది యింత సులభమూ సత్వరమూ కాగలిగిందేమో.

చుక్క... విశ్వేశ్వర్రావుల మనువు శుభశకునమే కావాలి.

మాధవ్ ఎంతో ఆనందంగా నడిచాడక్కడినుంచి.

★ ★ ★

చెలియలి కట్టనేది కవుల కల్పనే ఏమో. ఎందుకంటే సముద్రపు హద్దు స్థిరంగా ఉండదు. ఒక్కొక్కప్పుడు ముందుకురికి యిసుక ప్రాంతాన్ని తగ్గించేస్తుంది. మరొకప్పుడు వెనక్కిపోయి ఇసుక మేర పెరుగుతుంది. చుక్కనీ విశ్వేశ్వర్రావునీ పెద్దలూ, మాధవ్ ఆశీర్వదించిన నాలుగో రోజున చీకటిపడబోతున్న సంధ్యాసమయంలో.

"అటువేపు వస్తున్నాయి మరపడవలు" అంటూ కేకవేశారెవరో. సముద్రతీరంనుంచి కొద్ది నిముషాలలో నేలయీనినట్లు జాలరులు, వాడబల్జీలూ అటు పరుగెత్తసాగారాయుధాలతో. వాళ్లందరికీ ముందే తెలిసినట్లుంది. మరపడవలు వేటకి వెళ్లాయనీ, ఏ సమయంలోనయినా తిరిగి తీరానికి చేరవచ్చుననీ. అందుచేతనే వారు సంసిద్ధంగా ఉండి ఉంటారు. కొన్ని వందలమంది మగవారు. ఈటెలు, పడవతెడ్లు, బరిసెలు, మొదలయిన ఆయుధాలతో పరుగెత్తసాగారు.

వారితోపాటే మాధవ్. అయితే-ఇసుకలో పరుగెత్తడం అలవాటులేక అతను వెనకబడిపోతున్నాడు. వాళ్లు ముందుకి ఉరుకుతున్నారు.

మాధవ్ చేరుకునేసరికే-

అక్కడ రణరంగం ప్రారంభమయిపోయింది. పెద్ద ఎత్తున కొట్లాట. కేకలు, ఆర్తనాదాలు, అంతా దొమ్మీ, గుంపులు గుంపులుగా జనాలు. ఎక్కడేం జరుగుతోందో తెలియదు.

మధ్యమధ్య ఎర్రటోపీలు! బహుశా, మరప డవల యజమానులు వారిని రప్పించి ఉంటారు ముందు జాగ్రత్త కోసం. వాళ్ల చేతుల్లో తుపాకిలున్నాయి. కానీ వారు వాటి నుపయోగించడంలేదు. టియర్‌గ్యాస్ షెల్స్ మాత్రం బద్దలగొట్టారు. దానితో యుద్ధంలో స్వల్పవిరామం. కానీ ఆ బాష్పవాయువు ఎక్కువసేపు వారిని నిగ్రహించలేకపోయింది. ఎలాగ ఆపగలదు? వారిది బతుకుకోసం ఆరాటం. జీవిక కోసం పోరాటం! ఒకవేపు పోరాటం సలుపుతూనే మరపడవలమీద దాడిచేశారు కొందరు. పోలీసులు వారివేపు లాఠీలు ఝుళిపించారు. దెబ్బలుతింటున్నా వారు ఆగడంలేదు. ఈ పోరాటం ఆపితే తమ జీవితమే ఆగిపోతుందన్నంతగా తెగించి మరపడవలమీద పడుతున్నారు వారు.

వారిది జీవన్మరణ పోరాటమే అయితే,

వారి పగ మనుషులమీద కానేకాదు, మర పడవలమీదనే. తన తీరానే జరుగుతున్న యీ భీకర సంగ్రామానికి సాక్షిగానే మిగులు తోంది సముద్రం.

పోలీసులు ఎక్కువ కల్పించుకోడంలేదు. తమ సంఖ్యా, బలమూ కూడా స్వల్పమే అనీ, యీ సాగర సంగ్రామాన్నీ, జీవన పోరా టాన్నీ, తాము నిరోధించలేమనీ వారు స్పష్టం గానే గ్రహించినట్లున్నారు. ఒకటి రెండుసార్లు గాలిలోకి తుపాకులు పేల్చినా గంగాపుత్రులు చెదరకుండా బెదరకుండా తమ దాడిని కొన సాగిస్తుండడంతో వారికేం చేయాలో తోచన ట్లుంది. ఏమీ చేయకుండా నిలబడిపోయారు చోద్యంచూస్తున్నట్లూ, అంతకంటె తాము చేయగలిగేదీ ఏమీలేనట్లూ.

సముద్ర తీరాన్నంటిపెట్టుకుని అక్కడే నివసించే జాలరులూ వాడబల్జీలలో పేద వారే అత్యధికం. కాగా కడపాలెం, పెద్దూ ర్లలో సముద్రతీరానికి కొంచెం దూరం లోనూ, పూడిమడక ఊరిలోనూ ఉండేవా రిలో మధ్యతరగతివారూ, వివిధ వృత్తుల వారూ, వ్యాపారులూ, ధనవంతులూ వీరిదే అత్యధిక శాతం. సముద్రానికి దూరంగా ఉండి గంగాపుత్రుడిగా జీవించడంలో చాలా అసౌకర్యాలుంటాయి మరి.

కలవారికీ లేనివారికీ సాగరతీరంలో జరు గుతున్న ఈ సంగ్రామం సుమారుగా ఆ వీధులకీ, ఈ వీధులకీ జరుగుతున్నట్లే. వారికి అర్థబలమూ, అధికారబలమూ కొమ్ముకాస్తుంటే, వీరికి అంగబలమూ, సంఖ్యాబలమూ ఆసరా ఇస్తున్నాయి. వారి పోరాట ధ్యేయం ఇంకా ఎక్కువ డబ్బూ లాభాలూ కాగా, వీరి పోరాటాశయం ప్రాణాలు పోకుండా ఆకలికి బలికాకుండా బతకగలగడం.

అవతల పోరు తీవ్రంగా సాగుతోంది.

తాను ఎలుగెత్తి కేకలు వేస్తున్నా ఎవరూ వినడంలేదు. తమ మధ్యకు రానివ్వడం లేదు. దానితో కింకర్తవ్య విమూఢుడై నిలబ డిపోయాడు మాధవ్.

జాలారిపాలెంనుంచీ, వాడనుంచీ ఆడ వాళ్ళు కూడా గుంపులు గుంపులుగా రావడం మొదలుపెట్టారు రోకళ్ళలాంటి ఆయుధాలు చేతపుచ్చుకుని. న్యాయమే.. ఆడవాళ్ళదీ జీవితమే. అవసరమయితే వారూ పోట్లాడి తీరవలసిందే పరిస్థితుల మరచక్రాలలో ప్రాణాలుపోకుండా కాపాడుకో వాలంటే.

అప్పటికి మరపడవలన్నీ కొంచెమో ఎక్కువో చెడగొట్టబడనే చెడగొట్టబడ్డాయి. ఇక అవి ఇంతలో వేటకిపోలేవు. అది నిస్సందేహం. అది గ్రహించిన గంగాపు త్రులు మూకుమ్మడిగా వెనుతిరిగారు. తమ జాలారిపేట, వాడలవంక పరుగెత్తారు ఎదు రుపడిన ఆడవారిని కూడా మరల్చుకుని. అవతల చీకటి చిక్కబడింది.

సంగ్రామం అప్పటికి సర్దుమణిగినట్లే తాత్కాలికంగా. కానీ ఆ వీధులమధ్యా, ఈ పేటలమధ్యా పగలూ, సెగలూ.

★ ★ ★

మూడురోజులపాటు ఊరిలో ఉద్రిక్తతా, ఉద్రేకాలూ. వీరు ఒంటరిగా కంటపడితే వారూ, వారూ ఒక్కరూ కంటపడితే వీరూ అవకాశం దొరికిందో అటకాయించి అమీ తుమీ తేల్చుకుందామని దెబ్బలాటకు దిగ డమే. కత్తులూ, కటార్లూ పట్టుకుని తప్ప తిరగడంలేదెవరూ. మూడురోజులూ సము ద్రపొడ్డున కదలలేనట్లూ, క్షతగాత్రులలా గానూ, మూగగా పడున్న మరపడవలు. వీధులలో ఎర్రటోపీలు. ఊరిలో దెబ్బలు తగిలినవారు మంచాలమీదా, మందులు వేసుకుంటూనూ... వాడలో దెబ్బతిన్నవారు మూలుగుతూనూ, గాయాలకవీ ఇవీ పూసు కుంటూనూ ఉన్నారు. వాతావరణంనిండా వెర్రిభయం. గాలినిండా గడుసుదెయ్యాలు. అక్కడ ఇంకా మరణమృదంగ ధ్వనులు. మారణహోమపు అవశేషాలు. ఊరివారు ముగ్గురు, పేటవారిద్దరు. యుద్ధానికి బలిఅ య్యారు. అటూఇటూ దెబ్బలు తిన్నవారెం దరో లెక్కకందరు.

ఈ పరిస్థితిలోకూడా గంగాపుత్రులు వేట కెళ్ళడం మానలేదు. ఎలా మానగలరు? మృత్యువుకంటే కూడా ఆకలే బలవత్తరమైన దేమో అప్పుడప్పుడు. ఆకలి సమస్యే లేక పోతే మానవజీవితం మరోలా ఉండేది.

★ ★ ★

ఆ సాయంత్రం అధికార యంత్రాంగం దిగింది. పోలీసులు... వ్యానులు, జీపులు, జిల్లాకలక్టరు.

గంగాపుత్రులు పుట్టకొకరు చెట్టుకొకరుగా చెల్లాచెదురు కాబోయారు. కానీ మాధవ్ వారికి అభయమిచ్చాడు. "నేను పంపిన వర్తమానానికి స్పందనగానే జిల్లా కలక్టరు గారు వచ్చారు తప్ప మిమ్మల్ని శిక్షించడాని కికాదు. వారికి మనమందరూ మన సమ స్యలూ, కష్టసుఖాలూ మనవి చేసుకుందాం. వారు మన సమస్యలకు పరిష్కారం సూచి స్తారు. నిర్భయంగా నాతోరండి. మీకు నా ప్రాణాలడ్డం" అని వారందరినీ సమావేశానికి బయలుదేరదీశాడు. "పారిపోవడం పిరికిత నంగానే కాక నేరం అంగీకరించడమూ ఔతుంది" అని హెచ్చరిక కూడా చేశాడు.

అందరూ కలక్టరుగారి దగ్గరకు బయలుదే రారు. వారనుమతించగానే తాను ముందే రాసి ఉంచుకున్న వినతిపత్రాన్ని చదవసా గాడు మాధవ్. అలాగ తమ ప్రతినిధిగా మాధవ్‌ని మిగిలిన పిల్లగాళ్ళతోపాటు నాలు గూళ్ళ పిలగోడు కూడా ప్రతిపాదించాడు.

"జిల్లా కలక్టరుగారికీ, సభ్యులకీ నా విన యపూర్వక నమస్కారములు. ఈ ఊరివారి ప్రతినిధిగా నేను తయారుచేసి పెద్దల ఆమోదం పొందిన వినతిపత్రం చదువుతు న్నాను.

మూడురోజులకిందట మరపడవలవారికీ, మామూలు జాలరులకీ జరిగిన సంగ్రా మంలో మొత్తం ఐదుగురక్కడికక్కడ మర ణించగా ఎందరో గాయపడ్డారు. ఇది అత్యంత దురదృష్టకరమూ, విచారణీ యమూ అయిన దుస్సంఘటనే. ఇటువంటి దుర్ఘటనలు మళ్ళీ జరగకూడదనే మా అందరి ఆకాంక్ష.

నగరాలలో కంప్యూటర్లకి వ్యతిరేకంగా ఉద్యోగులూ, కార్మికులూ, ఇక్కడ మరపడవ లని నిరోధిస్తూ గంగాపుత్రులు. మౌలికంగా ఇద్దరు చేసే పోరాట స్వభావమూ ఒక్కటే. మరతో మనిషి పోరాటం. తమ జీవికను దెబ్బతీసే మరను మనిషి ఎదిరించ కతప్పదు. అతను బతకాలికదా. స్వల్ప సంఖ్యలో మరపడవలు ఇక్కడ కొన్నివందల మంది ఉపాధిని బలి తీసుకుంటాయి. కబ ళింపుచేస్తాయి. అందుకే వీరు తమ ప్రాణా లకు తెగించి పోరాడారు. కొందరు తమ ప్రాణాలనే పణం పెట్టారు. జీవనపోరాటా నికి దీనినిబట్టే సమస్య ఎంత తీవ్రమయి నదో అవగతమౌతుంది.

ఈ గంగాపుత్రులు మూర్ఖులు కారు. ఇప్పుడు వెనకబడి కూడా లేరు. చదువు నేర్చు తున్నారు. ఆటలు, పాటలలో అగ్రగణ్యు

# పలినముత్యాలు

- మీలో రగుల్చుకున్న అగ్ని మీ శత్రువుకంటే మిమ్మల్ని ఎక్కువ కాల్చుకు తింటుంది.

– తిరువళ్ళువర్

- కొందరు. తాము వెళ్ళిన ప్రతిచోటుకు ఆనందాన్ని తీసుకువెళతారు. కొందరేమో తాము వదలివెళ్ళిన ప్రతిచోటును ఆనందంతో నింపుతారు.

– రబ్బీ సిమియన్

- ముఖ్యంగా మీ తలిదండ్రులు మీకోసం పొదుపు చేసివుంటే అది చాలా మంచిది.

– విన్‌స్టన్ చర్చిల్

- ప్రతి ఒక్కరూ మానవాళిని మార్చాలనుకుంటారేగానీ తమనుతాము మార్చుకోవాలన్న విషయాన్ని గురించి ఏ ఒక్కరూ ఆలోచించరు.

– లియోటాల్‌స్టాయ్

- మిమ్మల్ని బాగా ఆలోచింపజేసే పుస్తకాలే మీకు గొప్ప సహాయాన్ని అందించగల పుస్తకాలు అవుతాయి

– టి.పార్కర్

- ప్రపంచం రెండు శాఖలుగా విభజింపబడింది. పనులు చేసే వర్గం. పనిచేసామన్న ఘనతను పొందే వర్గం.

– డ్వైట్‌మెర్రన్

- ఇతరులు చెప్పేంత వరకు వేచి ఉండకుండా అవసరాన్ని చూసి రంగంలో దూకడాన్నే నాయకత్వం అంటారు.

– మార్టిన్ రాడెన్

- తెలుసుకోవాలన్న ఆదుర్దాయే మనం మనుషులలో చూడగల తొలి సరళమైన భావోద్వేగం

– ఎడ్మండ్‌బర్క్

- ఆనందం నిజాయితీనుండి ఉద్భవిస్తుంది

– కౌటిల్యుడు

- అధికారబలంలేని న్యాయం సామర్థ్యంలేనిది. న్యాయరహితమైన అధికారబలం నిరంకుశమైనది.

– పాస్కల్

- కోరికలు లేనివాడు నిరాశకు ఎప్పటికీ గురికాడు. కాబట్టి ప్రపంచంలో ధన్యుడు అతడే.

– బుద్ధుడు

సేకరణ: ముద్దంశెట్టి అందమ్మ

లౌతున్నారు. వీరికి జీవిక మృగ్యమయితే మళ్ళీ వెనకటి దీనిస్థితికి దిగజారిపోక తప్పని పరిస్థితే వస్తుంది. ప్రభుత్వోద్దేశం అలాగ ఎంతమాత్రమూ ఉండజాలదుకదా. ప్రభుత్వంనుంచి అతి తక్కువ సహాయం మాత్రమే అందుకుంటూ చాలా అభివృద్ధి చెంది స్వయంకృషితో ఎన్నదగిన స్థానం పొందిందీ పూడిమడక. దీనికి తీవ్రమయిన అఘాతంలా ఎదురౌతుంది మర పడవల సమస్య. ఈ గంగాపుత్రుల బతుకుతెరువుకి ప్రత్యామ్నాయం చూపగలిగితే వీరు మరపడవలనీ నిరోధించరు. కానీ ఇప్పటి పరిస్థితులలో ప్రభుత్వానికిది సాధ్యమేనా?

మరపడవలు కొందరి అధిక లాభాలకి, మామూలు తెప్పలు ఎందరో గంగాపుత్రుల మనుగడకి, స్వల్పసంఖ్యాకుల లాభంకోసం అధిక సంఖ్యాకుల జీవనాన్ని కబళించడం ప్రజాస్వామ్య విధానం కాజాలదుకదా?

మర పడవలనిక్కడ ఎప్పుడు దింపినా ఈ సంగ్రామం తప్పదు. ఎందుకంటే అది జీవన్మరణ సమస్యే గంగాపుత్రుల పాలిట.

ఈ సమస్యనూ, పరిస్థితినీ అర్థం చేసుకుని గంగాపుత్రులపట్ల సానుభూతితోనూ, విశాల హృదయంతోనూ తగు నిర్ణయం చేస్తే ఇకపైనైనా ఇటువంటి దారుణ మరణాలు సంభవించకుండా దయచూపినవారౌతారు కలక్టరుగారు.

మరొక వినతి. జరిగిన పోరాటానికి ఇరు పక్షాలూ బాధ్యులే. చనిపోయినవారు తిరిగి రారు. కేసులు పెట్టడంవలన వీరి జీవితాలు మరింత అల్లకల్లోలమూ, అస్తవ్యస్తమూ కావడంకంటే ప్రయోజనమూ సిద్ధించేదేమీ ఉండదు. ఈ విషయంలో కూడా అధికారులు వాస్తవికమూ, మానవతా దృక్పథంతో ఆలోచించి తగువిధంగా చేయగలరు.

జిల్లా కలక్టరువారికి గంగాపుత్రులందరి తరఫునా నా వందనములు" అని వచ్చి కూర్చున్నాడు మాధవ్.

అవతలివారూ తమ వాదనలు వినిపించారు. "ప్రభుత్వ సహాయంతోనే కొన్నాం మేమూ మరపడవలను. పెట్టుబడి పెట్టాం కనుక లాభాలు తీయడానికి ప్రయత్నించడంలో తప్పూ, అసాధారణమూ ఏమున్నాయి. పెద్దలోకవేపు సాంకేతికాభివృద్ధితో ఇరవయ్యొకటో శతాబ్దంవేపు పరుగులు తీద్దామంటుంటే ఇక్కడేమో మరపడవలు కూడా వీలులేదు. నాటుపడవలే ఉండాలనడం న్యాయమేనా? "

వాదోపవాదాలు, తర్జనభర్జనలు...

కలక్టరు ఫిషరీస్ డిపార్ట్మెంట్ అధికారులతో సంప్రదించారు. ఒక అరగంటపైగా అధికారులతో సమావేశం జరిపి... సంభాషణలద్వారా సమస్యను కూలంకషంగా అర్థంచేసుకున్నాక వారు మళ్ళీ వేదికపైకొచ్చి తన నిర్ణయంకోసం ఎదురుచూస్తున్న గంగాపుత్రులని జాలిగా చూస్తూ...

"గంగా పుత్రులారా!

మీ సమస్యను నేనవగాహన చేసుకోగలిగాననే భావిస్తున్నాను. మీ ప్రతినిధి మాధవ్... ఫిషరీస్ డిపార్ట్మెంట్ అధికారులు... ఇక్కడి మత్స్యకారుల సంఘం, ఊరి పెద్దలు, మీరందరితోనూ చర్చలూ సమావేశమూ సంభాషణలూ జరిపి- నేను మీ జీవనగమనాన్ని కొంతమేరకయినా అర్థంచేసుకోగలిగాననీ భావించి-ఇలా తెలియజేస్తున్నాను. నిశ్చయంగా మీ సమస్య తీవ్రమయినదే. ఐతే దానికి పరిష్కారంగా మీరెన్నుకున్న మార్గం పోరాటం మాత్రం సమంజసంగా లేదు. సమస్యకి సంగ్రామమనేది సరయిన పరిష్కారంకాజాలదు సాధారణంగా. సరే ఇక ముందిటువంటి అవాంఛనీయమయిన సంఘటనలు జరగనివ్వరని విశ్వసిస్తూ- ఇక్కడికపై మరపడవలు మీకు పోటీరావని తెలియజేస్తున్నాను" అన్నారో లేదో కరతాళ ధ్వనులు చెలరేగాయి. నిట్టూర్పులు, ఆనందంతో అరుపులు, కొండంత గండం గడిచి బయటపడ్డట్లు సంతోషం నిండిన కేకలు. ఆ సందోహం-సాగరఘోషనే మించిపోయింది.

"దయచేసి నిశ్శబ్దంగా ఉండండి. మరపడవలను బాగుచేయించే బాధ్యతా ఖర్చూ ప్రభుత్వమే తీసుకుంటుంది. మరపడవలిక్కడి నుంచి తరలించబడతాయి. గంగాపుత్రులకూ వారి జీవనానికీ ఆటంకంకాని తీరాలలోనే ఇకపై మరపడవలు చేపలు పడతాయి. జరిగిన జననష్టానికి ప్రభుత్వం చాలా చింతిస్తోంది. ఇలాగ ప్రజలొకరినొకరు చంపుకోటం శిక్షార్హమయిన నేరమే అయినా- ఊరివారందరూ దీనిపై ఇకమీదట రభస చేయమనీ... ఏమీ జరగనట్లే ఐకమత్యంగా ఉంటామనీ మనస్ఫూర్తిగా వాగ్దానంచేస్తే... ఇక్కడ పోలీసులూ ఉండరు, ఎవరిపైనా కేసులూ ఉండవు. మీరందరూ జరిగినవి మరచి... వైరాన్ని విస్మరించి... స్నేహితుల్లా మసలాలీ క్షణంనుంచీ. అలా మాటివ్వండి"

అంగీకార సూచకంగా ప్రేక్షకులందరూ ఒక్కసారి అరిచారు. "ఓ! అలాగే. అంతకంటే మాకు కావలసిందేముంది? మాకూ స్నేహమే కావాలి, వైరంకాదు"

వారి తరపున- మాధవ్, పిలగోళ్లూ జిల్లా కలక్టరుగారికి- అందరిముందూ- వేదికమీద వాగ్దానంచేశారు.

మెల్లగా వారందరూ వెళ్లిపోయారక్కడినుంచి. ఒక్కడే మిగిలాడక్కడ. అతను మాధవ్. అతనికక్కడినుంచి ఎంత మాత్రమూ కదలాలనిపించడంలేదు.

పౌర్ణమేమో నిండుగా చందమామ. పండు వెన్నెల. అందంగా ఆకాశం, సముద్రం మహోత్సాహంగా ఉంది. అది తన హోరులో ఏదో ఉల్లాస రాగాలాలపిస్తున్నట్లుంది. అందులో ఎన్నెన్నో జీవనరాగాలు, వేదాంతం, వైరాగ్యం, విషాదం, సంతోషం, సర్వమూ... అది వింటూ...

దూరంగా ఆ భవనం, అది బడి. గంగాపుత్రులందరినీ ఏకం చేసే గుడి. అక్కడ విద్య... సంస్కృతం, సంగీతం, ఆటలు, పాటలు, సాంస్కృతిక కార్యక్రమాల ఊపిరి.

ఇటు ఊరు వాడ... అందరూ తనవారు. అతని హృదయం ఆర్ద్రమౌతోంది.

తానిప్పుడు ఏకాకికాడు. ఎందరో ఉన్నారు తనకి. అందరూ సన్నిహితులే స్నేహితులే. తన జీవితం నిష్ప్రయోజనం కాదు. ఎందరికో సేవ చేసే అదృష్టం లభించింది. తన జీవితం శూన్యపాత్రకాదు. జీవన కలశమే. దాని నిండా సేవాసుధ.

"ఇక్కడున్నావా అన్నయ్యా"

"కౌసల్యా! నువ్వా!"

"మరిచిపోయావా? ఇవాళ పౌర్ణమి"

"ఊఁ"

"నీమేనల్లుడు పుట్టింది పున్నమినాడు. ప్రతి పున్నమినాడూ వాడినాశీర్వదిస్తానని మాటిచ్చావ్" జ్ఞాపకం చేస్తున్నట్లే అందామె.

"ఔనౌను. ఇవాళ పౌర్ణమి. అంటే వెన్నెల" అంటూ ఆమె చేతిలోని బాబునందుకుని ముద్దుపెట్టుకుని "పెరిగి పెద్దవాడివీ మనిషివీ కావాలి" అని ఆశీర్వదించాడు. వాడు కేరింతలాడాడర్థమైనట్లే. కౌసల్య వాడినందుకుని చంకనేసుకుని "అవతలందరూ నీకోసమే ఎదురుచూస్తున్నారు. కలక్టరుగారి గౌరవార్థం కార్యక్రమం ఏర్పాటు చూశారుగా? పల్లిపదాలూ, ఆంధ్ర జాలరి నృత్యమూ, సరస్వతి చేత భగవద్గీతా శ్లోక పఠనమూ, నువ్విక్కడుండిపోతే ఎలా? "

అతను నవ్వాడు. "ఇప్పుడు నేనెక్కడున్నా ఫరవాలేదు. ఏ కార్యక్రమమూ ఆగదు"

"నిజమే. కాని నువ్వంటే వాళ్లకి ధైర్యమూ, ఉత్సాహమూ. ఆ దారివేరు. పద. అయినా వొక్కడివీ ఇక్కడేం చేస్తావ్? "

"బాబునిటివ్వు" అంటూ వాడినెత్తుకుని ఆమె పక్కనే నడవసాగాడు.

పౌర్ణమి మూలాన సముద్రంలో ఆటుపోటులు,

వెన్నెలవలన అవి మరీ అధికంగా

సాగరఘోషమంద్ర స్థాయిలో

ఆ హోరులో అనంత రాగాలు

అర్థంచేసుకోగలగాలేకాని అవన్నీ జీవనరాగాలే.







# చతుర కతలు

## ఇంటాయన

ఉమ, వాణి, హైమవతి ఒకే ఆఫీసులో ఉద్యోగస్థులు. రోజూ కలసి లంచ్ చేస్తారు. ఆ లంచ్ టైమ్‌లో ఏదో సాహితీ చర్చ జరుగుతూనే ఉంటుంది. ఒకరోజు పత్రికలో వచ్చిన నవల గురించి ప్రస్తావన వచ్చింది. వాణి ఆ నవల్ని చాలా విమర్శించింది. ఉమ ఆ నవల్లోని విషయాల్ని సమర్థించింది. పైగా "ఆ నవల్లో ఏం విషయ పసా లేనిదే దానికి బహుమతి ఎందుకు వస్తుందే! ఆ పత్రిక వాళ్లు వెర్రివాళ్లంటావా!" అని నిలతీసింది వాణిని ఉమ.

వాణి కొంచెం ఉడుక్కుంది. "ఏమిటో ఇదంతా చూస్తే ఆ నవలా రచయిత దీని చుట్టమేమో" అంది హైమవతితో.

"అవునే ఖచ్చితంగానూ! చుట్టంకంటే ఎక్కువే! ఆ నవలా రచయిత మా ఇంటాయన" అంది ఉమ.

"అలా చెప్పు. ఏదైనా పుస్తకాన్ని దాని యొక్క బాగోగుల్ని బట్టి మెచ్చుకోవాలేగాని 'ఇంటాయన' అయితే ఒకలాగా మేనత్త అయితే ఒకలాగా, ఇంకెవరైనా అయితే ఇంకోలాగా సమర్థించుకోకూడదు" అంది వాణి.

"సర్లే ఆ విషయం మాకు తెలీదులే" అంది ఉమ.

ఇదేదో చివికి చివికి గాలి వానయ్యేటట్లుందని "లంచ్ అవర్ అయిపోయింది ఇక నడవండే" అంది హైమవతి.



ఆ మర్నాడు లంచ్ అవర్లో ఆ నవల విషయం మళ్లీ మొదలు పెట్టింది వాణి. వాణికి కొంచెం ఉక్రోషం ఎక్కువ. "నేను రేపు ఆదివారం వచ్చి ఆ నవలలోని విషయాలు ముఖాముఖీ మీ ఇంటాయనతో చర్చించి నేను చెప్పినవి సమంజసంగా ఉన్నాయని ఆయనచేత చెప్పించకపోతే నా పేరు వాణి కాదు" అంటూ "నువ్వు కూడా నాతోపాటు రావే" అంది హైమవతితో.

"సరే రండి నాకేం భయంలేదు" అంది

ఉమ.

అనుకున్నట్లుగానే ఆదివారం హైమవతి, వాణి కలసి పది కిలోమీటర్లు బస్సులో పడి ఉమ ఇంటికి వెళ్లారు. ఇదే మొదటిసారి ఉమ ఇంటికి వెళ్లడం! ఎంత స్నేహితులైనా హైదరాబాద్‌లో ఒకళ్లింటికి ఒకళ్లు, అందు లోనూ ఉద్యోగాలు చేసే ఆడవాళ్లకి వెళ్లడం కష్టమే. వచ్చేది ఒక్క ఆదివారం. ఆ రోజు సెలవైనా పొద్దుట్నుంచీ సాయంకాలం వరకు ఇల్లు సర్దుకోవడం, పిల్లల చదువుల విషయం ప్రత్యేకంగా చూసుకోవడంతో సరి పోతుంది. ఉమ ఇల్లు పట్టుకోవడం కష్టమే అయింది. తీరా వెళ్లేసరికి ఉమ ఇల్లు తాళం వేసుంది. వాణి మెల్లగా అంది "నేను చెప్ప లేదే హైమా! భయపడి ఎక్కడికైనా ఇల్లు తాళం వేసుకుని వెళ్లిపోతుందేమో అని! అలాగే అయింది చూడు"

ఆ పక్క వాటాలో ఆవిడ్ని అడిగారు "ఉమ ఎప్పుడు వస్తుందని"

"వాళ్ల మేనమామగారికి బాగా లేదని కబురొస్తే వెళ్లిందండి. బహుశః సాయం కాలం దాకా రారేమో! పూర్తి వివరాలు కావాలంటే పైన ఓనర్స్‌ని అడిగితే తెలు స్తుంది" అని లోపలకి పిలిచి మంచి నీళ్లూ, కాఫీ ఇచ్చింది ఆవిడ.

"ఏదైనా ముఖ్యమైన పనయితే చెప్పండి. నా వల్లవుతుందేమో చూస్తానంది" ఆవిడ.

ఈ నవల గోల ఏం చెప్తారు పాపం! "రేపు ఆఫీసులో ఎలాగూ కలుస్తాం" అని వెళ్లిపోయారు వాళ్లు.

ఆ మర్నాడు ఆఫీసులో ఉమని గట్టిగా తగులుకుంది వాణి. "అంత దూరం వస్తే నీ ఇంటికి తాళం వేసుకుపోయావు. అంత భయం అయితే ఆ నవల గురించి నేను చెప్పిన విషయాలు ఒప్పేసుకోవచ్చుకదా! కనీసం నీ భర్తని ఇంట్లో అట్టేపెట్టినా ఆయ నతో ఆ నవల గురించి మాట్లాడేదాన్ని కదా!"

"అనుకోకుండా మా మామయ్యకి బాగా లేకపోతే వెళ్లాను. అయినా నా భర్తతో మాట్లాడటం ఏమిటి! మా ఇంటాయన అదే ఆ నవలా రచయిత మా హౌస్ ఓనర్. ముసలాయన మేడమీదే ఉన్నారుకదా! ఆయ నతో మాట్లాడ వలసింది" అంది ఉమ.

"అయితే ఆ నవలా రచయిత నీ భర్త కాదన్న మాట! మరి మా ఇంటాయన... ఇంటాయన అని చచ్చావేం" అంది వాణి.

హైమవతి కూడా వెర్రిమొహం వేసింది.

**– భమిడిపాటి సోమయాజి**

---

# ఉద్యోగం

సాంబశివరావుకు ఇద్దరు కొడుకులు, పెద్దాడి పేరు రాముడు. బుద్ధిమంతుడు. అలనాటి శ్రీరామచంద్రమూర్తికి కలియుగం తాలూకు నకలు. తండ్రి మాట జవదాటడు. అందుకే తనకిష్టం లేకపోయినా పితృవాక్యపరిపాలన కోసం ఎమ్‌కాం చదువుకుని ఫస్టుక్లాసులో పాసయి, ఆ తరువాత ఐ.టి కూడా చేసి, అమెరికాలో ఉద్యోగాల్లేక, ఇండియాలో ఉద్యోగం రాక తండ్రి చేసే బ్యాంకులో ఆయన రిటైరయితే ఏదైనా ఉద్యోగంలో కుదురుకుందామని ఆశగా ఎదురుచూస్తూ రోజులు లెక్కపెడుతున్నాడు.

రెండో కొడుకు భీముడు పేరుకు తగ్గట్టు ఒట్టి మొరటు మనిషి. చదువబ్బలేదు. అబ్బ మాటెప్పుడూ ఖాతరు చేయడు. కండలు పెంచి ఊరుమీద పడి దౌర్జన్యంగా బతికే దాదాగా మారిపోయాడు. వాడిని కన్నందుకు సాంబశివరావు దిగులుపడని క్షణంలేదు.

ఆ దిగులుతోనే ఆయన మంచమెక్కాడు. ఉద్యోగం ఇంకా ఐదేళ్లుందనగానే టపామని టపా కట్టేడు.

పోయేముందు చూడటానికొచ్చిన పైఅధి కారి చేతులు పట్టుకుని "నేను లేకపోతే



సంసారం వీధిన పడుతుంది. ఎలాగైనా నా కొడుకుల్లో ఒకర్ని బ్యాంకుద్యోగిగా చూడాలనుకున్నాను ఆదుకోండి" అని బావురుమన్నాడు.

సాంబశివరావుపోయిన నెల రోజుల తరువాత బ్యాంకు వారి నుండి ఇద్దరు కొడుకులకి వర్తమానం వచ్చింది. 'కంపాసినెట్ గ్రౌండ్స్‌మీద ఇద్దర్లో ఒకరికి ఉద్యోగం ఇవ్వదలిచాము. బ్యాంకు అవసరాలకు సరిపడిన అర్హతలు మీలో ఉన్నాయో లేవో పరిశీలించటానికిగాను ఇద్దరూ ఫలానా తారీఖున ఇంటర్వ్యూకి హాజరుకావలసింది' అని. రాముడు బుద్ధిగా తయారయి చంకలో తన సర్టిఫికెట్ల దొంతర్లున్న ఫైల్ పట్టుకుని ఇంటర్వ్యూకటెండయ్యాడు.

భీముడు చేతులూపుకుంటూ నిర్లక్ష్యంగా వచ్చిపోయాడు. అవతల తనకు చాలా అర్జంటు పనులున్నాయని మధ్యలోనే లేచిపోబోయాడు. "ఏంటా పనులు? " అనడిగితే "దాదాగిరీ" అన్నాడు మీసం మెలేస్తూ.

రెండు రోజుల తర్వాత బ్యాంకునుండి అప్పాయింట్ మెంట్ లెటర్ వచ్చింది. సాంబశివరావు ఆశ నెరవేరింది. ఇద్దరు కొడుకుల్లో ఒకరు బ్యాంకాఫీసరయ్యాడు అని సంతోషించారు ఆ కుటుంబం గురించి తెలిసిన వాళ్లందరు. బాధపడింది ఒక్క రాముడే. ఎందుకంటే ఆ ఉద్యోగం అతనికి రాలేదు. 'ఎంకామ్ ఏం చేసుకోవాల? ఐటీ ఎంప్లాయిస్ ఇప్పటికే మస్తున్నారు. మాక్కావాల్సింది రికవరీ ఏజెంట్లు. నయానో భయానో మొండిఖాతాలు వసూలు చేయగలిగిన దమ్మున్న భీముడు లాంటివాళ్లు. అందుకే అతనికి రికవరీ ఆఫీసరు పోస్టిస్తున్నాం' అని వివరణ ఇచ్చింది బ్యాంకు.

*– కర్లపాలెం హనుమంతరావు*

## రాజకీయ రాహువు

దేశంలో ముందస్తు ఎన్నికలు అవుతాయని ప్రకటన వెలువడింది. కేవలం కేంద్రంలోనే కాకుండా రాష్ట్రంలో కూడా అవ్వబోతున్నట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు. రాజకీయ సంరంభం ఆరంభమయింది. సుమారు ఒక దశాబ్దంగా పాలన సాగిస్తున్న పాలక వర్గంకి భయం పట్టుకొంది, ఈసారి జనం ఎవరిని ఆదరిస్తారో అని. అటు ప్రతిపక్షంకి దడ ఆరంభమయింది. రాయితీలమీద రాయితీలు ప్రకటిస్తే అవి నీటిమీద రాత



లని తెలిసి తమకు తాటాకులు కడతారేమో నని వాళ్ళ సంశయం. ఎన్నికల తేదీ ఖరారయింది. ఇరుపార్టీల కార్యకర్తలు ఇనుమడించిన ఉత్సాహంతో పల్లె, పల్లెలకు వెళ్ళి ప్రచారం కొనసాగించారు. మండుటెండలని ఖాతరు చెయ్యకుండా రోడ్‌షోలు నిర్వహిస్తూ, తలకు తుండుగుడ్డలు కట్టుకొని రహదారి పక్కనే ఆకుల్లో అన్నం తింటున్నట్లు ఫొటోలు తీయించి మీడియా ద్వారా రకరకాల గిమ్మిక్కు చేసుకొంటూపోతున్నారు రాజకీయ నాయకులు. అటు పాలక ప్రభుత్వం ప్రజల సానుభూతికోసం తమ నాయకులు ఎలా ఉగ్రవాదుల తూటాలకి బలయ్యారో, ల్యాండు మైన్స్‌లో చావుతప్పి పునర్జన్మ పొందిన వాల్‌పోస్టర్సుతో ఓటర్లని ఆకట్టుకొంటున్నారు. మొత్తంమీద పోటాపోటీగా ప్రచారం ఇంటింటా, వీధివీధినా జరుగుతున్న సమయం. ఇది మంచి, ఇలా చెప్తే పర్యవసానం ఏమవుతుందో అన్న ఇంగితజ్ఞానం కోల్పోతున్నారు నేతలు. ప్రచారం ముగిసేందుకు ఇంకా నలభై ఎనిమిదిగంటలు మాత్రమే గడువుంది.

ఒక రాజకీయ నాయకుడు హడావిడిగా ఎలక్షను టూరు ముగిస్తూ రాత్రికి ఒక విధ వాశ్రమం చేరుకొన్నాడు. కార్యకర్తలు సభ కోసం సన్నాహాలు చేశారు. మారుమూల కుగ్రామమది. ఊరి చివర విశాల ప్రాంగణంలో ఉంది ఆ ఆశ్రమం. చుట్టూ పచ్చని తోట, పూలు, కాయగూరలు విరగబూసి ఉన్నాయి.

"రా. నా" తన ఉపన్యాసం ప్రారంభిస్తూ అక్కడికి వచ్చి వాళ్లందరితో అంతసేపు గడిపినందుకు తనకు చాలా ఆనందంగా ఉందని చెప్పుకొచ్చాడు. ఆశ్రమాన్ని అంత నీటుగా చక్కదిద్ది ఉంచినందుకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నట్లు చెప్పాడు. క్లీన్ అండ్ గ్రీన్ అన్నది తమ లక్ష్యమన్నట్లు ధాటిగా మాట్లాడుతున్నాడు. చప్పట్లతో ఆశ్రమం మారుమోగిపోయింది. మైకు లేకపోయినా రెచ్చిపోయాడతను. త్వరలో అక్కడికి వస్తానని, నెక్స్ట్‌టైం తను మళ్లా అక్కడికి వచ్చే సమయంలో వాళ్ల సంఖ్య ఇంతకింత రెట్టింపు అవ్వాలని మనసా, వాచా కోరుకుంటున్నానని చెప్పాడు. చివరిగా ఉపన్యాసం ముగిస్తూ ఆవేశంలో ఏం మాట్లాడుతున్నాడో తెలియని స్థితిలో తన భార్యను కూడా ఈ ఆశ్రమంలో చేరమని సిఫార్సు చేస్తున్నానని చెప్పి బయల్దేరిపోయాడు.

—ఆనంద్‌రావ్ పట్నాయక్



# సచిత్ర విచిత్రం

## బట్టతల వ్యాపారం



బట్టతల అమెరికాలో పెద్ద వ్యాపారంగా విరాజిల్లుతోంది. జుట్టుని ట్రాన్స్‌ప్లాంట్ చేసే వ్యాపారం అది. దీన్ని ఫాల్లి కలర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ అంటారు. అదే మనిషి తలమీది ఇతర ప్రాంతాల్లోని జుట్టుని తీసి బట్టతలమీద ట్రాన్స్‌ప్లాంట్ చేస్తారు. జుట్టు పీకిన చోటు నుంచి తిరిగి జుట్టు మొలుస్తుంది కాబట్టి బట్టతలని పూర్తిగా జుట్టుతో కవర్‌చేయచ్చు. ఈ పద్ధతిని 1983లో కనిపెట్టిన డాక్టర్ రాబర్ట్ బ్రెన్‌స్ట్రెయిన్ కొలంబియా యూనివర్సిటీ డెర్మటాలజిస్టు. డైట్, హెర్బల్ మందులు సరిగా పనిచేయకపోవడంతో ఆయనకీ ఆలోచన కలిగింది. తమాషా ఏమిటంటే డాక్టర్ రాబర్ట్‌దీ బట్టతలే. ఆయన మాత్రం ట్రాన్స్‌ప్లాంటేషన్ జోలికి పోలేదు. ఆయన భార్య దానికి ఒప్పుకోలేదట. ఉదయం హాస్పిటల్‌లో చేరితే మర్నాడు డిశ్చార్జి చేస్తారు. ముందురోజు రాత్రంతా ట్రాన్స్‌ప్లాంటేషన్ పని చేస్తారు.

# ఏరిన ముత్యాలు

✲ అధిరోహించవలసిన దుర్గాలు, దాటవలసిన అడ్డంకులు లేనప్పుడు జీవితమెంతో నిస్సారం... ఎంతో రస విహీనం.

– జవహర్‌లాల్‌నెహ్రూ

✲ మానవుడు అత్యున్నత శిఖరాలపైకి ఎక్కవచ్చు కానీ అక్కడ ఎక్కువ కాలం నివసించలేడు.

– జి.బి.షా

✲ సత్ప్రవర్తనకు రెండు ప్రధాన సూత్రాలు ఉన్నాయి. ఆచరణకు ముందు ఆలోచన... అనంతరం ఆత్మవిశ్వాసం.

– లాయొలా

✲ ప్రజాస్వామ్యం విజయవంతమయ్యేందుకు ప్రజాభిప్రాయం, పౌరబాధ్యత ముఖ్యాంశాలు.

– నెహ్రూ

✲ తీసుకునే ఆహారం వలన దేహబలం, చదివే పుస్తకాలవల్ల మనోబలం చేకూరుతున్నాయి. కానీ ఆహారం మీద ఉండే శ్రద్ధ పుస్తకాల విషయంలో ఎందరికుంటుంది.

– కొలియర్

✲ మానవుడి మెదడు చాలా గొప్పది. పుట్టినప్పటినుండి అది విరామం లేకుండా పని చేస్తూ ఉంటుంది. ఒక్క క్షణం కూడా ఆగదు... ఉపన్యాసం ఇచ్చేందుకు వేదిక ఎక్కినప్పుడు తప్ప.

– హాఫ్‌మాన్

✲ వివేకవంతుల ఉదాసీనతకంటే ఉత్సాహవంతుల పొరపాట్లకు ఇష్టపడతాను.

– ఆన్‌బోల్‌ఫ్రాన్స్

✲ యదార్థమైన సుఖానికి వాంఛలూ, భయాలు రెండూ రెండు శత్రువులవంటివి

– స్వామీమాధవతీర్థ

✲ సదవకాశాలు వృద్ధి చేసుకోవడము, మనకు అందుబాటులోకి రానున్న మంచిని గ్రహించడము ఈ రెండే ఉన్నత జీవిత పథకానికి పూలబాటలు.

– జాన్సన్

✲ విజ్ఞానం అవధిశీల నిర్మాణం

– మహాత్మాగాంధీ

సేకరణ: లక్ష్మీసువర్చల

# 'ఐ లవ్‌యూ మై చైల్డ్' పై సమీక్షలు

ఆగస్టు 'చతుర'లో ప్రచురితమైన ప్రియదర్శినీ యల్లాప్రగడ నవల
'ఐ లవ్‌యూ మై చైల్డ్' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## సంస్కరణ

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ప్రేమ మత్తులో పడి వివాహేతర సంబంధాలకు పరిగెత్తే స్త్రీల అగచాట్లను అక్షరబద్ధం చేసిన నవల అని పరిచయ పేజీలో ప్రకటించారు కానీ నవలలో స్త్రీల అగచాట్లనేగాక తత్సంబంధిత పురుషుల మరియు వారి సంతానం పొందే అగచాట్లను కూడా రచయిత్రి ప్రియదర్శినిగారు హృద్యంగా వర్ణించారు.

నేటి సమాజంలో ఇటువంటి వివాహేతర సంబంధాలు కొనసాగించటం క్రమక్రమంగా పెరుగుతుంది. చదువురానివారేకాక విద్యావంతులు కూడా ప్రేమమత్తులో పడిపోయి భవిష్యత్తులో జరుగబోయే అనర్థాలను గుర్తించడంలేదు. నిజమైన ప్రేమకు హద్దులేమీ ఉండవని రచయిత్రి అన్నారు కానీ ప్రేమ అఖుశక్తివంటిదని, బుద్ధి విచక్షణలతో సమ్మిళితమైన ప్రేమ లోకకల్యాణానికి దారితీస్తుందని, బాధ్యతారహితమైన ప్రేమ మానసిక సంఘర్షణకు హేతువవుతుందని రచన ద్వారా విశ్లేషించి చూపారు.

ప్రధాన పాత్రధారి దుష్యంతరావు మానసిక దౌర్బల్యంవలన తను అనుకున్నది సాధించలేక అందరిని ఇక్కట్లపాలు చేశాడు. వివాహానికి కావలసినది మానసిక అనుకూల్యత అని గుర్తించలేని అతని తండ్రి సెంటిమెంటు బంధంతో చెల్లెలి కూతురును తన కోడలుగా చేసుకోగలిగాడు కాని కొడుకుకు భార్యను తేలేకపోయాడు. తండ్రి మరణం తర్వాత దుష్యంతరావు బాధ్యతల బరువు మోయడంలో స్వాంతన కొరకు రహస్యంగా పద్మిని వివాహం చేసుకొన్నాడు. కేవలం బాహ్య అవసరాలు తీర్చితే సరిపోతుందని భావించాడు. రహస్య వివాహానికి పూర్వమే తండ్రి అయ్యి కూడా రాబోయే పరిణామాలను అతడు గుర్తించలేదు. తద్వారా తనకేకాక పద్మిని, ప్రాణేష్‌లకు అంతులేని ఖేదాన్ని మిగిల్చాడు. "ఐ లవ్ యు మై చైల్డ్" అని సరైన సమయంలో చెప్పలేకపోయాడు.

పద్మిని సంఘపు కట్టుబాట్లను అతిక్రమించి దుష్యంతరావుని వివాహం చేసుకోవడంవలన జీవితంలో సుఖాలను త్యాగంచేసి కష్టాలను స్వీకరించవలసివచ్చింది. భర్తకు, కొడుకుకు సమన్వయం సాధించడానికి ఆమెకు జీవితకాలం సరిపోలేదు. మిసెస్ కులకర్ణి, మీరాషామ్‌ల ఆదరణ లభించిన ప్రాణేష్ వేగంగా జరిగిన పరిణామాలకు అనుగుణంగా పరిణతితో పరిస్థితులను తన అదుపులోకి తెచ్చుకోవడంలో పద్మిని యొక్క శిక్షణ అద్వితీయం. తండ్రి ప్రేమను కొడుకుకు అందించలేకపోవడం తప్పించి ఆమె పాత్రను రచయిత్రి చక్కగా మలిచారు.

క్రమశిక్షణను, బాధ్యతను విస్మరించి క్షణికావేశంలో, ఉన్మత్తతలో పుట్టిన "ప్రేమ" జీవితాలను దహించివేస్తుందని దుష్యంతరావు, పద్మిని పాత్రల ద్వారా విశదమవుతున్నది. కొందరైనా నవల సారాంశాన్ని అర్థం చేసుకొనగలిగి తదనుగుణంగా మెలిగితే

రచయిత్రి ధన్యురాలే.

– జె.వి. రమణ, మణుగూరు

## కనువిప్పు

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ప్రేమించడం తప్పుకాదు. కాని ఆ ప్రేమను సఫలం చేసుకునే అవకాశమూ, ధైర్యమూ లేనప్పుడు సమాజం గర్హించే వివాహేతర సంబంధాలకు తావిచ్చి జీవితాలను అశాంతిపాలు చేసుకోవడం అవివేకం! ప్రేమమైకంలో తాము తీసుకునే నిర్ణయాలు తమకు కలగబోయే సంతానంపై ఎటువంటి పరిణామాలకు దారితీస్తాయో ఓ క్షణం ఆలోచించగలిగితే, బహుశా అటువంటి తప్పటడుగు వేయరేమో!

'ఐ లవ్ యూ మై చైల్డ్!' అన్న నవలలో చెప్పదలచుకున్న విషయం ఇదేననిపిస్తుంది. ఇంజనీరింగ్ చదివి బాధ్యతాయుతమైన ఉద్యోగం చేస్తున్న దుష్యంతరావు పద్మినిపట్ల బాధ్యతారహితంగా ప్రవర్తించాడని చెప్పక తప్పదు. తన కుటుంబపు స్థితిగతులు ఎరిగుండీ ప్రేమంటూ పద్మినిలో ఆశలు రేపడం శోచనీయం. మేనరికం చేసుకుని ఏడాది పాటు కాపురం చేశాక కూడా పద్మినికి మహోపకారం చేస్తున్నట్టు ఆమెను చాటుగా వివాహమాడడం ఆమెను వంచించడమే అవుతుంది. ప్రభుత్వోద్యోగి అయ్యుండీ, చట్ట విరుద్ధమని తెలిసీ గుళ్లో పెళ్లే అయినా ఆమె మెళ్లో తాళికట్టడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఎటువంటి బాధకైనా కాలం గొప్ప హీలర్. పద్మిని ఓ ఆర్టిస్టు. పెయింటింగ్ ఆమె ఎమోషన్స్‌కి మంచి అవుట్‌లెట్. అతను తన జీవితంలో మళ్ళీ ప్రవేశించి వుండకపోతే ఆమె తన పెయింటింగ్స్‌వైపు దృష్టి మళ్లించి తన బాధను, ఆవేదన్నీ మరిచిపోయేదేమో! తన పిచ్చిప్రేమకు ఫలితంగా మానసిక హింసకు గురికాకుండా వుండేది.

ఓపక్క దుష్యంతరావు సజ్జనుడు, పద్మినిని అమితంగా ప్రేమిస్తున్నాడంటూనే, మరోపక్క అతను కుటుంబపు కట్టుబాట్లకు లొంగి ఆమెను నిర్లక్ష్యం చేశాడనడం, పద్మిని, ప్రాణేష్‌పట్ల అతడు చూపే నిరాదరణ, ప్రవర్తన ... ఆ పాత్ర చిత్రీకరణలోని కన్‌ఫ్యూజన్ ఎత్తిచూపుతుంది. వివాహేతర సంబంధాల మూలంగా కలిగిన సంతానం గురయ్యే అగచాట్లు, మానసికవేదన ప్రాణేష్ పాత్ర తెలుపుతుంది.

అయితే- మిసెస్ కులకర్ణి పాత్ర ప్రవేశంతో సినిమాటిక్‌గా మారిపోతుంది నవల. ఆమె కొడుకును యాక్సిడెంటులో చంపడమూ, తన కోట్ల ఆస్తిని ఆమె అయాచితంగా ప్రాణేష్‌పరం చేయడమూ, స్వంత భవనం విడిచి పద్మిని ఇంట్లోనే వుంటాననడమూ (అదీ ఓమాజీ బ్రిగేడియర్ భార్య) వాస్తవ దూరంగా వుంటాయి.

నవలలో చెప్పదలచుకున్న విషయం తక్కువ విశ్లేషణలూ, వివరాలూ ఎక్కువగా కనిపిస్తాయి.

ఏదిఏమైనా పద్మినిలాంటి అమాయకపు యువతులకు ఈ నవల కనువిప్పు కాగలిగితే ముదావహం!

– పి.వి.వి. సత్యనారాయణ, జెంషెడ్‌పూర్

## స్త్రీమూర్తి గొప్పతనం

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

ప్రియదర్శిని యల్లాప్రగడ గారి 'ఐ లవ్‌యూ మై చైల్డ్' కథనం, కథ నడిపించిన శైలి చాలా బాగుంది. ఇందులో కథ చిన్నదైనా ఎలాంటి అవినీతికిగానీ అసభ్యవర్ణనకు వీలులేకుండా సాగింది. నా అంతర్గత సమస్యకు పరిష్కారం ఈ నవల.

ముఖ్యంగా పద్మిని పాత్ర చాలా చక్కని

పాత్ర. తల్లిగా, ఇల్లాలిగా, ఓ కరుణామూర్తిగా, సహృదయత కలిగిన ఓ మంచి వ్యక్తిగా, మనసులో కలకాలం గుర్తుండిపోయే పాత్ర ఆమెది. ఆమెపడ్డ అంతర్గత సమస్య ఎవరూ తీర్చలేనిది. భర్త అనే ఓ మగాడికి సొంతం ప్రేమనిస్తూ తన మనసుని ఎవరికి అంతుచి క్కనీయకుండా అన్నివేళలా అతనిని స్మరిస్తూ అతని రాక్కకై ఎదురు చూస్తూ రాని రోజున అలమటిస్తూ ఎవరికీ ఏమీ కనిపించనీయ కుండా అందరి విమర్శలు, హేళనలు అనుభ విస్తూ కాలమనే నదిలో ఆశ అనే నావ మీద పయనిస్తూ ఏ రోజు అయినా నన్ను తన అక్కున చేరనీయకపోతాడా, ఏనాటికైనా నేను తన ఇల్లాలిని అని ప్రకటించకపోతాడా అని ఎదురుచూసి లోకానికి రెండవ భార్యగా కాకుండా ఉంపుడుగత్తెగా, కేవలం ఓ బిడ్డకు తల్లిగా, ప్రపంచానికి ఏమీ కాని దానిగా సాగిన పద్మిని జీవనయాత్ర ముగింపు మాత్రం శాశ్వతంగా గుర్తుండిపోయింది.

కులకర్ణిలాంటి అతివలు ఎందరుంటారు ఈ సమాజంలో. ప్రాణేష్‌లాంటి సహృద యులు ఇంకా వున్నారా అనిపిస్తుంది. కానీ దుష్యంతరావుని మాత్రం క్షమించలేము. అంతా అయిపోయిన తరువాత అన్ని విష యాలు తన బిడ్డ అయిన ప్రాణేష్‌కు చెప్పడం అతని మనసులో స్థానం సంపా దించాలని ఉద్దేశ్యం మాత్రమే! ఒక సందర్భంలో పద్మిని అంటుంది ఏనాటికైనా మీ నాన్నను చూడాల్సింది నువ్వే ప్రాణా అని. అది నిజం అయింది. తల్లి మనసు పడే ఆవేదన ఆ రోజు అర్థం కాకపోయినా అవి అక్షరసత్యాలై ఈ రోజు ఈ దుష్యంత రావుని కన్నతండ్రిగాను, అంతకుమించిన కరుణతోను ఆదరించిన ప్రాణేష్ నిజంగా ఆ పద్మినికి తగినబిడ్డ. అందుకే ఈ నవ లకు 'ఐలవ్‌యూ మై చైల్డ్' నామకరణం చక్కగా వుంది. ఆ మాట అనవలసింది దుష్యంతరావుకాదు... పద్మిని.

**– యు.కృష్ణమూర్తి, ఊటుకూరు**

## అనుకున్నవన్నీ జరగవు

*(నాలుగవ బహుమతి*
*రూ. 50/– పొందిన సమీక్ష)*

ఆడది తను ఎంతగా ప్రేమించినా, సర్వస్వం తానే అనుకున్నా, పెళ్ళి అయిపో యిన తన ప్రియుడికి తనమనసులో ఫుల్‌స్టాప్ పెట్టక తప్పదు. పెళ్ళి అనేది వివాహబంధాన్ని మాత్రమే ఎంత గట్టిగా బిగిస్తుందో, వివాహేతర సంబంధాన్ని అంతగానూ చులకనచేసే సాధనం. దానివ లన పద్మినిలాంటి జీవితాలు ఎలా హీనంగా చూడబడతాయో ఐలవ్‌యూ మై చైల్డ్ ద్వారా రచయిత్రి చక్కగా తెలియజే శారు. పోనీ అన్నిటికీ తెగించి ఇద్దరూ ఒక్కటి అయినా అవసరానికిమించిన సహనం, ఓర్పు, చాదస్తం, తమతోపాటు తమ బిడ్డను చిత్రహింసలకు గురిచేశాయి. ఇంకా ఒకవిధంగా చెప్పాలంటే దుష్యంత రావు, తనరెండో భార్యకు, కుమారుడికి చెయ్యావలసిన దానికంటే ఎక్కువే చేశాడు. "మనిషి అనుకున్నవన్నీ జరగవు. కొన్నిం టిని వదిలేయాలి. లేకుంటే అవి మనల్ని పీడిస్తాయి" అన్న వాక్యాలు అందరూ గుర్తుంచుకోవాలి. "ప్రపంచంలో ఎవరూ పర్‌ఫెక్టుగా ఉండాలన్న రూలు లేదుకాని, ఉన్నంతలో ఆనందంగా వుండాలి" అనేది అందరూ గమనించాలి. తనకు ఎన్ని కష్టా లెదురైనా, ఎదుటివారిని అన్ని సమయాల్లో ఊరడిస్తూ కనిపించే మిసెస్ కులకర్ణి పాత్ర, చిన్నచిన్న కష్టాలకు కృంగిపోయేవారికి ఆదర్శం. తల్లీకొడుకు ప్రేమ వివరణ చాలా బాగుంది. కళ్ళముందు జన్మించిన బిడ్డల మరణాన్నైనా తల్లిదండ్రులు సహించగలరే మోకానీ, అన్ని ప్రాణాలూ తనమీదే పెట్టు కున్న అమ్మ, చనిపోతే చుట్టూ ఎంతమంది వున్నా, ఆ బిడ్డ ఒంటరివాడే అవుతాడ

స్నట్టు, ఆ తల్లీకొడుకుల ప్రేమానుబంధాలు కంటతడి పెట్టించాయి. తల్లిని కోల్పోయిన కొడుకు, కొడుకును పోగొట్టుకున్న తల్లి మధ్య జరిగే మాటలలో మంచి స్నేహ భావం కనబడింది. కానీ వాక్య నిర్మాణాల విషయంలో ఒక్కొక్కచోట పొంతన కుదర లేదు. ఏదిఏమైనా నవలలో చదివించే గుణంవుంది.

– సి. హెచ్. శ్రీవల్లి, రాజమండ్రి

## సమాజంలో ఎంతో మంది

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ప్రియదర్శినీ యల్లాప్రగడగారి 'ఐ లవ్‌యూ మై చైల్డ్' నవల ఆద్యంతం ఆసక్తి కరంగా సాగింది. రెండో భార్యగా ఉంటే ఎన్ని బాధలు అనుభవించాలో చక్కగా వివ రించారు. పద్మిని దుష్యంతరావుపై పిచ్చి ప్రేమను పెంచుకుని అతని ఎడబాటు భరిం చలేక చివరికి మనోవేదనతో మరణించడం మనసును దహించివేసింది. దుష్యంతరావు లాంటివారు మన సమాజంలో ఎంతోమంది ఉన్నారు. ఒక పెళ్లి అయిన తరువాత మరో పెళ్లి చేసుకుని ఆమెను తన రెండవ భార్యగా సంఘానికి పరిచయం చేయలేక, చేస్తే వారి హోదాకు, గౌరవానికి భంగం వాటిల్లుతుం దని భయపడి కొందరు, మోజు తీరిన తరు వాత కావాలనే నిరాదరణ చూపేవారు మరి కొందరు. నేడు ఇలాంటి సంఘటనలు ఎన్నో పత్రికలలో చదువుతున్నాం. వారిలో ఐపీయ స్‌లు, ఐఎఎస్‌లు, తదితర పెద్దహోదాలో ఉన్న వ్యక్తులు ఉండటం ఆశ్చర్యం. వీరిలో కొంతమంది రెండవ భార్యలు సంఘంలో తమకూ, తమ పిల్లలకు హోదా కల్పించాలని కోరుతూ నిరాహారదీక్షల వంటి నిరసనలు తెలిపిన సంఘటనలు కూడా ఇటీవల చోటు చేసుకుంటున్నాయి.

ఇక ప్రాణేష్ విషయానికి వస్తే ప్రాణేష్ పాత్ర చిత్రణలో ఆదర్శం లేదు. మీరాషామ్ అర్ధంతరంగా చనిపోతే ఆ ఆస్తితో ప్రాణేష్ ప్రజాసేవ చేయటం అంత బాగా లేదు. ఎన్నో కష్టాలు అనుభవించిన వ్యక్తి సాధార ణంగా పట్టుదలతో పైకిరావాలని కోరుకుం టాడు. అటువంటి లక్షణాలు లేని పాత్రగా ప్రాణేష్ పాత్ర మిగిలిపోయింది. మిసెస్ కులకర్ణి మీరాషామ్‌ల అండదండలతో ప్రాణేష్ స్వయంగా సంపాదించిన డబ్బుతో అటువంటి సేవాకార్యక్రమాలు చేసుంటే ఆ సేవకు అర్థం పరమార్థం ఉండేది. దుష్యం తరావు పద్మినిల వివాహానికి కలిగిన ఆటం కాలను నవల ప్రారంభంలో వివరించారు. తరువాత దుష్యంతరావు ఆమెని నిర్లక్ష్యం చేయడానికి కల్గిన కారణాలను విపులంగా వివరించి ఉంటే దుష్యంతరావు పాత్ర పాఠ కుల సానుభూతిని పొంది ఉండేది. ఏదిఏ మైనా రచయిత్రి ప్రియదర్శినీ యల్లాప్రగడ గారికి అభినందనలు.

– **పి.యస్.సి.మూర్తి**, నాచారం

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78






Healthy Cooking Oil



ఇక మీ జీవితంలోకి ఆహ్వానించండి ...

# ప్రియ సన్ ప్రైమ్

## నాణ్యమైన రిఫైండ్ సన్ ఫ్లవర్ ఆయిల్

ప్రతిరోజు అందరూ కోరుకుంటారు రుచికర పదార్థాలు. ఆరోగ్యమయ జీవితం. అందుకే ప్రియ మీ మనసు తెలుసుకొని మీ కోసం అందిస్తోంది ప్రియ సన్ ప్రైమ్ రిఫైండ్ సన్ ఫ్లవర్ ఆయిల్. ఇది పూర్తిగా మీరు నమ్మదగిన మరియు నాణ్యమైన ఆయిల్. ఇక మీ జీవితాన్ని మరింత ఉల్లాసభరితం చేయండి.






